అపరాధ పరిశోధన అనుబంధం—137

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## మతిలేని యువతులు

రచన: బొమ్మిడి అచ్చారావు

## సముద్రపు దొంగల ముఠా

రచన: కె. వి. రమణ

## తోడు దొంగలు

రచన: టెంపోరావ్

## ఒక ఇంటర్వ్యూ కథ

రచన: వసుంధర

అగ్ని కిరీటం - తొమ్మిదవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్ — 137
మే, 1985
వెల: రు. 6-00
ఏడాది చందా: 72 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
ఏ. వీ. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
కాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# మతిలేని యువతులు!

## బొమ్మిడి అచ్చారావు

"ఏమిటి వసూ, అలా డల్ గా కూచుండిపోయావు? సినిమా ప్రోగ్రాం మరచిపోయావా?" స్కూటర్ గేటుముందే పార్క్ చేసి వుంచి, లోపలికొస్తూనే అడిగాడు ఉమాపతి భార్య వసంతను.

వసంత అప్పుడే యీ లోకంలోకి వచ్చినట్టు భర్త వంక చూసింది.

ఉమాపతి కంగారుపడ్డాడు. "ఏమిటి డియర్ అదోకలా వున్నావేం? ఒంట్లో బావుండలేదా?" భార్య పక్కనే సోఫాలో కూలబడి ఆమె నుదురు, చెంపలు అరచేయి వెనక్కి తిప్పి, వేడిగా వుందేమోనని స్పృశించి చూశాడు.

వసంత బలవంతాన నవ్వి, "నాకేం? పిడిరాయిలా వున్నాను. నాకేం లేదు లెండి!" అన్నది. ఆమె మాటల్లో నిరాశ కొట్టొచ్చినట్టు కనిపించింది.

ఉమాపతి అనునయంగా ఆమె భుజాలచుట్టూ చేతులు

వేసి ఆమె తలను గుండెలకు చేర్చుకుని, "కారణమేమిటో నాతో చెప్పవూ?!" అన్నాడు.

ఆ కాస్త ఆదరణకే చల్లగాలి సోకిన మేఘంలా జలజల కన్నీరు కార్చి, "ఏమీ లేదండీ! మనకీ ఓ బాబో, పాపో వుంటే యెంత బావుండును? అనిపించి మనసంతా వెలితిగా అయిపోయింది, అంతే! మీరనవసరంగా కంగారుపడుతున్నారు!" అన్నది వసంత.

"ఓస్ యింత చిన్న విషయానికి యిన్నెంత హడల గొట్టేశావు వసూ! పిల్లలకోసం బెంగా యిదంతాను? చూడు వసూ, మనకిప్పుడు ఏమంత వయసు మీరిపోయిందని నీ భయం? నాకు ముప్పైరెండు. నీకు యిరవై ఎనిమిది నడుస్తోందనుకుంటాను. ఆడవాళ్ళకి నలభై ఎనిమిదేళ్ళు వచ్చేవరకు బిడ్డల్ని కనే సామర్థ్యముంటుంది."

అతని వాక్ప్రవాహానికి అడ్డు వచ్చి చేతులు జోడించి "మహాశయా! మీ శాస్త్ర పరిజ్ఞానం నాముందు వ్యర్థం చేసుకోకండి. నేనుకూడా సైన్సు గ్రాడ్యుయేటునే.... యే వయసు వరకు పిల్లలు పుడతారని కాదు యిప్పుడు ఆలోచించేది—పెళ్ళయి పదేళ్ళు కావస్తూన్నా యింకా మన నట్టింట చంటిబిడ్డ కాలుమోపలేదనే నా బెంగంతాను. నాతోటి వాళ్ళందరు యిద్దరు ముగ్గుర్ని కని ఆపరేషన్లు కూడా చేయించేసుకున్నారు అక్కర్లేకుండా. దాదాపు అందరం ఒకే సంవత్సరంలో గృహిణులైన వాళ్ళమే!" అన్నది వసంత.

"ఇక నువ్వీ వెర్రిమొర్రి ఆలోచనలకు స్వస్తి చెపుతావా, లేదా? పిల్లలు వుండాల్సిందే. కాదనను. కాని, పుట్టలేదనే బెంగ మాత్రం వుండకూడదు. మనిద్దరం దేవుడిమీద భారంవేసి చేతులు ముడుచుక్కూచోలేదు.

ఇద్దరం డాక్టరు పరీక్ష చేయించుకున్నాం. ఎలాంటి లోపమూ లేదని మనిద్దరికీ టెస్టుచేసిన నిపుణులు చెప్పారు. కొంతమందిలో ఫెర్టిలైజేషన్ బాగా ఆలస్యం కావచ్చునని కూడా వివరించారు. ఛైల్డ్ బేరింగ్ కన్సెప్షన్ ఫెర్టిలిటీ అన్న అంశాల మీద పుస్తకాలుకూడా చదివాం. ఇంకా అనుమానాలు పెంచుకొని వర్రీకావటం అనవసరం! పద, యిప్పటికే ఆలస్యమయింది. వస్తూ వస్తూ టిక్కెట్లుకూడా తెచ్చాను" అన్నాడు ఉమాపతి భార్యను సముదాయిస్తూ.

అన్యమనస్కంగానే భర్తకు కాఫీ యివ్వటానికి వంటింట్లోకి నడిచింది వసంత.

## 2

మర్నాడుదయం లోకల్ న్యూస్ పేపర్లోని ఓ అంశం ఆమె నాకర్షించింది. అది ఆమెకు ఎంతో ఆనందం కలగ చేసే ప్రకటన!

అందులో యిలా వుంది!

"గృహిణులకు శుభవార్త!

మీరు వివాహితులై చాన్నాళ్లు అయినా ఇంకా సంతానం కలగలేదా? మీ వయసు ముప్పయి సంవత్సరాలలోపు అయితేనే మీరిది చదవండి. గైనకాలజీలో అనేక డిగ్రీలు సంపాదించిన అమెరికన్ సర్జన్ కేవలం రెండు గంటలుమాత్రం మీ సమస్యకు పరిష్కారం చూడటానికి వెచ్చించటానికి హోటల్ న్యూ సఫైర్ లో విడిది చేశారు.

ఈ రోజు మధ్యాహ్నం రెండు గంటలనుండి నాలుగు గంటల వరకు మాత్రం వారి సేవలు మీరుపయోగించుకోగలరు. ఆ తర్వాత వారు

బొంబే ఫ్లైట్‌లో వెళ్ళిపోతారు. ఆసక్తి వున్నవారు సంప్రదించవచ్చును.

స్థలం: హోటల్ న్యూ సఫైర్,
రూం నంబర్ ఫార్టీఫోర్."

వసంత మనసు ఆనందంతో గంతులువేసింది. గోడ గడియారం వంక చూసింది. పన్నెండు గంటలు దాటి పదినిమిషాలయింది. ఫరవాలేదు, యింకా సమయం వుంది. అదృష్టవశాత్తు యీ ప్రకటన తన కళ్ళబడింది. అదీ గడువుకు ముందుగానే. తనకి సరిగా అక్కరకొచ్చే ప్రకటన! తన వయసు ముప్పయి ఏళ్ళలోపే!

ఆమె చకచక తయారయింది. భర్త మధ్యాహ్నం లంచ్‌కి యింటికి రాడు. బాక్స్‌లో టిఫిన్ పట్టుకు పోతాడు. మళ్ళీ యిల్లు చేరేది సాయంత్రం అయిదు తర్వాతనే. అతనికి చెప్పి వెళ్ళేటంత వ్యవధిలేదు.

హోటల్ న్యూ సఫైర్ అమీర్ పేట్ నుండి సికింద్రాబాద్ పోయే రోడ్డున వుంది. దాదాపు నలభై నిమిషాలు పైగానే పడుతుంది సిటీబస్ ప్రయాణం. ఆటోలో వెళ్ళాలన్నా అంతకు తక్కువపట్టదు. బేగం పేట్ ఏర్‌పోర్టు అక్కడికి దగ్గర అనే ఉద్దేశంతో ఆ డాక్టర్ ఆ హోటల్లో దిగివుండాలి!

వసంత తను రావడం ఆలస్యమైతే భర్త కంగారు పడతాడని ఓ స్లిప్ రాసి డ్రస్సింగ్ టేబిల్ మీద పౌడర్ టిన్ను బరువుపెట్టి వుంచింది. సాధారణంగా అతను లేని సమయంలో తను యిల్లు విడిచి వెళ్ళదు ఎప్పుడూ. ఏదో చదువుతూనో అది బోర్ కొడితే టేపులు పెట్టుకొని వింటూనో లేదా కాసేపు నిద్రపడటమో ఆమె కలవాటు. తాళాలు పక్క ఫ్లాట్‌లో యిచ్చి

రోడ్ మీద కొచ్చింది.

రెండు గంటలకు పదినిమిషాలుండగానే ఆమె ఎక్కిన ఆటో హోటల్ న్యూ సఫైర్ ముందాగింది. మీటర్ ఛార్జి చెల్లించి చకచక నలభైనాలుగో గదివైపు నడిచింది.

అప్పటికే చాలామంది ఆడవాళ్ళు అక్కడ గుమిగూడి వున్నారు. కారిడార్‌లో వరసగా బల్లలు వేయబడి వున్నాయి. వాటిమీద కూచున్నారు. దాదాపు అందరు యిరవైఅయిదు ముప్పయి ఏళ్ళ మధ్య వయసున్న యువతులే!

ఓ అమ్మాయి వసంత దగ్గరకొచ్చి విష్‌చేసి ఆమె చేతికో చిన్న స్లిప్ యిచ్చింది. వసంత దానివైపు చూసింది. నంబరు రెండువందలతొమ్మిది. అంటే అందరికీ వరుస నంబర్లిచ్చారన్నమాట. తను చాలా ఆలస్యంగా రావటంవల్ల చాలా చివరి నంబరొచ్చింది.

రెండు గంటల వ్యవధిలో రెండువందల మందిని పరీక్షించి వారికి సలహాలివ్వటం చాలా కష్టం! ఆ లెక్కన తనదాకా ఛాన్స్ వస్తుందంటే నమ్మకం లేదు. తను దురదృష్టవంతురాలు. ఆ ప్రకటన కనీసం పదిగంటల ప్రాంతాల చూసినా బావుండేది! ఉదయం వంటపనితో తనకి తీరిక చిక్కదు. లేకుంటే ఆరు గంటలకే గుమ్మంలో పడే పేపరు తను పన్నెండు గంటలవరకు చూడలేక పోవటం దురదృష్టం కాదూ!?

మరో పదినిమిషాలకి నాలుగవుతుందనగా ఆమెకు లోపల్నుంచి పిలుపొచ్చింది. ఇందాకా స్లిప్ యిచ్చిన అమ్మాయి నవ్వుతూ పిలిచింది. అప్పటికే అందరు వెళ్ళి పోయినట్టున్నారు. కారిడార్ ఖాళీ అయిపోయింది.

తనకి ఛాన్స్ రావటం యింకా ఆమె నమ్మలేకపోతోంది. భగవంతుడు తన మొరాలకించాడు.

వసంత ఆనందంగా లేచి లోపలకి అడుగు పెడుతుండగా మెరుపులా వచ్చిందో ఆలోచన. కొద్దిమంది తప్ప లోపలికి వెళ్ళిన ఆడవాళ్ళంతా పరీక్ష పూర్తయ్యాక మళ్ళీ బయటికి రావటం తను చూళ్ళేదు! ఆ గదినుంచి అవతలకు వేరే ద్వారం వుందా? లేక....

ఆమె వెనకనే తలుపులు మూసుకుపోయాయి.

# 3

డిటెక్టివ్ కిరణ్, ఇన్‌స్పెక్టర్ శ్రీనివాస్, సార్జంటు రాజా, శివం, మరో నలుగురు కానిస్టేబుల్స్‌తో హోటల్ న్యూ సఫైర్ చేరుకున్నారు.

మేనేజర్ పరుగెత్తుకుని వచ్చాడు. కిరణ్ హోటల్ రిసెప్షన్ కౌంటర్ దగ్గరికి సరాసరి నడిచాడు. ఇన్‌మేట్స్ రిజిష్టర్ తీసుకుని పంధొమ్మిదో తేదీన నలభై నాలుగో నంబరు గది ఎవరి పేర బుక్ అయిందో చకచక వెరిఫై చేశాడు.

విలియమ్స్‌గార్డు అనే అమెరికన్ డాక్టరు పేర బుక్ చేయబడి వుంది.

కిరణ్ రిసెప్షనిస్టుని, "పంధొమ్మిదో తేదీ కౌంటర్లో ఎవరున్నారు?" అనడిగాడు.

"నేను కాదు సార్. ప్రసాద్ అనే మరొకతను."

కిరణ్ మేనేజర్ వంక చూసి, "అతన్ని రప్పించండి" అన్నాడు.

మేనేజర్ నీళ్ళు నమిలాడు. "అతను నిన్న వుదయమే తమ స్వంతవూరు సెలవుమీద వెళ్ళాడు సార్. అతని తల్లికి సుస్తీగా వుందని టెలిగ్రాం వచ్చింది" అన్నాడు.

"అతనిదే వూరు?"

"నెల్లూరు దగ్గర ఏదో పల్లెటూరు సార్!"

కిరణ్ తలపంకించి, "పంధొమ్మిదో తేదీన అంటే— మొన్న మీ హోటల్లో నలభై నాలుగో నంబరు గదిలో యెవరు బసచేశారో చెప్పగలరా?" అనడిగాడు.

"ఆ రోజు ఆమెరికానుంచి ఎవరో గైనకాలజీ సర్జన్ వచ్చారు సార్. విలియమ్స్ అనుకుంటా ఆయన పేరు. ఆ రోజంతా మా హోటల్ పెద్ద తిరణాలలాగా వుంది. దాదాపు రెండువందలమంది ఆడవాళ్ళు అతని గదికొచ్చి పరీక్ష చేయించుకున్నారు."

"ఎన్ని గంటలనుంచి ఎన్ని గంటలవరకు?"

"ఆడవాళ్ళు మధ్యాహ్నం పన్నెండునించే రావటం మొదలెట్టారు సార్. నాలుగయ్యేసరికి వెళ్ళిపోయారు."

"ఆడవాళ్ళు తిరిగి వెళ్ళటం మీరు చూశారా?"

మేనేజరు రెండు క్షణాలు మాట్లాడలేదు. "నేనయితే చూడలేదుగాని మా స్టాఫ్ చూసి వుంటారు సార్!" అన్నాడు.

"ఎవరు చూశారో పిలవండి. ముఖ్యంగా రూం బాయ్స్."

మేనేజర్ రూం బాయ్స్‌ని పిలిపించాడు.

నలభైనాలుగో రూం సర్వ్ చేసిన బాయ్ తను చూశానని చెప్పాడు. "ఆ గది పక్కనుంచి కారిడార్ చివర మెట్లున్నాయి సార్. వాటిగుండా ఆ ఆడవాళ్ళు దిగి వెళ్ళిపోయారు సార్!"

"అందరూ ఒకేసారి వెళ్ళిపోయారా? వారి వెంట యెవరైనా వెళ్ళారా?"

"హోటల్ రెండో ద్వారం పక్కగా అంబులెన్స్‌లో

తడవకి పదిమంది లెక్కన యెక్కడికో వెళ్ళారు సార్! పదినిమిషాలకోసారి అంబులెన్సు వాళ్ళను దింపివచ్చి మళ్ళీ మరో పదిమందిని తీసుకుని వెళ్ళేది. అలా ఓ ఇరవై సార్లయినా ఆ అంబులెన్సు కారు తిరిగి, ఆడవాళ్ళందరినీ తీసుకుపోయింది సార్. వారి వెంట ఓ ఇరవయ్యేళ్ళ అమ్మాయి వెళ్ళి వచ్చేది. చివర్లో డాక్టరుగారు, ఆ అమ్మాయి కలిసి వెళ్ళిపోయారు సార్ అంబులెన్సులో.

ఆడవాళ్ళని యెక్కడికి తీసుకు వెళ్ళారని నేనడిగాను సార్ ఆ అమ్మాయిని. ఏవో పరీక్షలకోసమని హాస్పిటల్లో వదిలి వచ్చామని చెప్పేది సార్ ఆమె. చివర్లో డాక్టరు గారు నాకు గది అప్పగించి, బిల్లు సెటిల్ చేయమని రెండొందల రూపాయలు నాకిచ్చి చిల్లర నన్నే తీసుకోమని చెప్పి హడావిడిగా వెళ్ళిపోయారు సార్. డాక్టరు గారు ఏర్‌పోర్టుకి వెళ్ళాలని చెప్పారు. బొంబే విమానంలో వెళ్తామని చెప్పారు" అన్నాడు రూం బాయ్.

కిరణ్‌తో బాటు అక్కడున్న వాళ్ళందరు చాలా ఆసక్తిగా విన్నారు బోయ్ చెప్పిన కథనం. కిరణ్ కి జరిగిన సంగతంతా తను స్వయంగా చూసినట్టే అనిపించింది. అంబులెన్సులో హాస్పిటల్ కి తీసుకు వెళుతున్నామనే మిషతో ఆడవాళ్ళందర్నీ ఓ సంకేత స్థలంలో దాచిపెట్టాడు డాక్టరు. ఆ తర్వాత వాళ్ళందర్నీ ఏం చేశాడు? వాళ్ళెవరూ ఇంతవరకు ఇళ్ళకు తిరిగి రాలేదు. ఇంతకీ ఎవరీ విలియమ్స్‌బర్డు?

"నువ్వా డాక్టర్ని చూస్తే గుర్తుపట్టగలవా?"

"ఎందుకు గుర్తించలేను సార్... ఎంతమంది మధ్యన వున్నా గుర్తుపడతా."

"ఆ అమ్మాయి, డాక్టరు—యిద్దరేనా ఆ గదిలో

దిగింది?"

"అవును సార్. పదెనిమిదో తేదీ మధ్యాహ్నం దిగారు. పంధొమ్మిది సాయంత్రం నాలుగ్గంటలకు ఖాళీ చేసేశారు."

"డాక్టర్ని, ఆ అమ్మాయిని వర్ణించగలవా?"

"డాక్టరు ఎర్రగా, రక్తంగడ్డలా వున్నాడు సార్! ఆరడుగులు పైనే పొడవున్నాడు. తెల్లటి షర్టును అంత కన్న తెల్లని పాంటులో యిన్ షర్టు చేశాడు. పిల్లిగడ్డం, సన్నని మీసం గడ్డంలో కలిసిపోయేలా నైస్‌గా కటింగ్ చేయించాడు. సుమారుగా ఏభై ఏళ్ళుండొచ్చు. ఆ అమ్మాయి సన్నగా పొడవుగా తెల్లగా వుంది సార్! చాలా అందంగా వుంది. ఇరవయ్యేళ్ళలోపే వుంటుంది వయసు" చెప్పాడతను.

"ఆ గది యే అంతస్తులో వుంది?"

"సెకండ్ ఫ్లోర్ సార్!"

మేనేజర్ వెంటనే, "రండి సార్ చూద్దురుగాని" అంటూ ముందుకు దారితీశాడు.

"డాక్టర్ ఖాళీచేశాక ఓ జంట దిగారు సార్ ఆ గదిలో. ఆదివారం ఉదయం దిగారు. సోమవారం అంటే నిన్న ఉదయం ఖాళీచేసేశారు...." చెప్పాడు మేనేజర్.

కిరణ్ సార్జంట్ రాజును పిలిచి ఏదో చెప్పాడు. సార్జంట్ శివాన్నికూడా పనిమీద పంపాడు.

శ్రీనివాస్‌తో "వేలిముద్రల నిపుణుణ్ని, ఫోటోగ్రాఫర్ని పిలిపించు. యేదయినా ఉపయోగపడే సమాచారం దొరకవచ్చును" అన్నాడు.

శ్రీనివాస్ కామన్ హాల్లో వున్న ఫోన్ వైపు నడిచాడు.

12

రూం బాయ్ తలుపు తెరిచాడు. మేనేజర్ అతని వెనుక కిరణ్ గదిలోకి అడుగు పెట్టాడు. చాలా పెద్ద గది. అధునాతనమైన సామగ్రి, ఫోన్, మ్యూజిక్ ఛానెల్, సింక్, ఎటాచ్డ్ బాత్ లావెట్రీ, మొజాయిక్ ఫ్లోరింగ్, మధ్య కొంత మేర కాశ్మీర్ తివాచీ, రూఫ్ నించి వేలాడుతున్న షాండ్లియర్ —గదంతా చాలా రిచ్ నెస్ తో అందంగా వుంది.

గదికి వెనక పక్కగా మరో గుమ్మం వున్నది. కిరణ్ ఆ గుమ్మం తలుపులు తెరిచాడు. వెనకపక్క కారిడార్ లోకి దారితీసింది ఆ ద్వారం. ఓ చివరగా కారిడార్ అంతమై కిందికి మెట్లు ప్రారంభమయ్యాయి. ఆ యువతుల్ని ఆ మెట్లగుండానే కిందికి తీసుకువెళ్ళి హోటల్ వెనక ద్వారం నించి అంబులెన్స్ లో దాటించారని గ్రహించాడు కిరణ్. కారిడార్ నించి కిందికి రోడ్ మీదికి చూశాడు. సన్నటి రోడ్డు. అంబులెన్స్ ఆగటానికి, రివర్సు చేసుకోవటానికి హోటల్ కి కొంత దూరంలో ఖాళీ జాగా వున్నది.

కిరణ్ తలపంకించి తిరిగి గదిలోకి వస్తూండగా కింది నుంచి మెట్లమీదుగా సార్జంట్ రాజు వచ్చాడు.

"శనివారం మధ్యాహ్నం రెండు గంటలనుండి నాలుగు గంటల మధ్యకాలంలో తెల్లటి అంబులెన్స్ కారు దాదాపు యిరవైసార్లు అటు యిటు తిరిగి ఆడ వాళ్ళని తీసుకు వెళ్ళిందని కిళ్ళీబంక్ అతను చెప్పాడు సార్. రూం బాయ్ చెప్పింది నిజమే!" అన్నాడు.

కిరణ్ తల విదిలించాడు. రూం బాయ్ చెప్పిన ప్రకారం పదినిమిషాల కొకసారి అంబులెన్స్ కారు ఆడ వాళ్ళని తీసుకువెళ్ళింది. అంటే అయిదు నిమిషాల్లో వెళ్ళి

మరో అయిదు నిమిషాల్లో వచ్చేదనుకోవాలి. ఆ లెక్కన చూస్తే యిక్కడైసారు తిరగటానికి రెండుఖండల నిమిషాలు పట్టివుండాలి. కాని ఆ కార్యక్రమమంతా మధ్యాహ్నం రెండునుంచి నాలుగు గంటల లోపల అంటే రెండు గంటల వ్యవధిలో జరిగిపోయింది. ఇదెలా సాధ్యం?

అంటే, అంబులెన్సులు రెండు గాని, అంతకన్న యెక్కువగాని తిరిగి వుండాలి!

ఈలోపల సార్జెంట్ శివం వెళ్ళొచ్చాడు.

"సార్, అంబులెన్సు అయిదు నిమిషాల్లో యెంత దూరం ప్రయాణించగలదో అంతదూరం వెరిఫై చేశాను. చిన్న హోటల్స్. షాపులు తప్ప ఆ రోడ్డులో హాస్పిటల్ గాని లేక యిళ్ళుగాని యేవీ లేవు. కనీసం చిన్న కారు కూడా రివర్సు చేసుకోవటానికి వీల్లేనంత సన్నటి సందు లాంటి రోడ్ సార్" అన్నాడు.

కిరణ్ కి సమస్య విడిపోయింది. "మీరిద్దరు నాతో రండి" అంటూ మెట్లమీదుగా కిందికి దిగాడు. వాళ్ళిద్దరు అనుసరించారు.

అంబులెన్సు రివర్సు చేసుకోటానికి సరిపడే ఖాళీ జాగా వున్నవైపుగా అడుగులు వేశాడు. ఆ సన్నటి రోడ్డు తూర్పు పడమరలుగా సాగింది. రూం బాయ్ చెప్పిన ప్రకారం అంబులెన్స్ తూర్పు దిక్కుగా వెళ్ళి తిరిగొచ్చేది.

ఖాళీజాగా కెదురుగా డ్రైక్లీనింగ్ షాపుంది.

కిరణ్ షాపతన్ని కలుసుకుని, "శనివారం మధ్యాహ్నం 2, అంబులెన్స్ కారు యిక్కడ రివర్సు చేసుకుని హోటల్ న్యూ సఫైర్ ముందు ఆగి ఆడవాళ్ళని తీసుకు

వెళ్ళింది. ఆ కారు ప్రతిసారీ యిక్కడ రివర్స్ చేసుకుని వెళ్ళిందా? గుర్తుచేసుకుని చెప్పండి!" అన్నాడు.

అతనేదో గుర్తుచేసుకుని, "అవును సార్! చాలా సార్లు రివర్స్ చేసుకున్నారు డ్రైవర్లు!" అన్నాడు.

"డ్రైవర్లు అంటున్నారు. డ్రైవర్ ఒకడు కాదా?"

"కాదు సార్. ప్రతిసారీ ఓ కొత్త డ్రయివర్. మధ్య మధ్య ఒకే రకంగా వున్న మరికొన్ని అంబులెన్స్ కార్లు ఈ సందులోనించి వచ్చి హోటల్ వెనకపక్క ఆగుతూండేవి!" అన్నాడతను పడమర వైపుగా వున్న సందు చూపించి.

శ్రీనివాస్ హడావిడిగా కిరణ్ దగ్గరకు పరిగెత్తుకొచ్చి "ఇప్పుడే స్టేషన్నుంచి రైటర్ ఫోన్ చేశాడు. నలుగురు ఆడవాళ్ళు ఇళ్లు చేరినట్లు వాళ్ళ భర్తల దగ్గర్నుంచి ఫోన్ కాల్స్ వచ్చాయట!" అన్నాడు.

కిరణ్ తల పంకించి, "మనం వెంటనే ఆ నలుగుర్నీ చూడాలి!" అన్నాడు.

# 4

స్టేషన్లో రైటర్ నలుగురి అడ్రసులు నోట్ చేసి వుంచాడు. శ్రీనివాస్, కిరణ్ ఆ అడ్రసుల ప్రకారం ఒక్కొక్కరి యింటికీ వెళ్ళారు.

మొదటి కేసులో యువతి యేం అడిగినా సమాధానం చెప్పకుండా పిచ్చిపిచ్చిగా చూసింది. యేదో షాక్లో వున్నట్టు అనిపించింది.

"ఈమె యింటికెలా చేరారు?" అనడిగాడు కిరణ్ ఆ స్త్రీ భర్తను.

"నేను ఆఫీసునించి యింటికొచ్చేప్పటికి తాళం వేసి వున్న గుమ్మం ముందు కూచుని తనకి తనే యేదో గొణు

క్కుంటూ కనిపించింది సార్. ఏం అడిగినా సమాధానం చెప్పటం లేదు. వెంటనే మీకు ఫోన్ చేశాను!" అన్నాడతను.

ఆమెని ఎంతగా ప్రశ్నించినా సమాధానమే లేదు. డిటెక్టివ్ లిద్దరు విసిగిపోయారు.

"రెండో కేసు దగ్గర వెళ్దాం" అన్నాడు శ్రీనివాస్, అడ్రసు కాగితం పైకి తీసి చూసుకుంటూ.

రెండో కేసు మరీ చిత్రంగా వుంది. "నా పేరేమిటి, నేనిక్కడికెలా వచ్చాను?" అంటూ శ్రీనివాస్ని ఎదురు ప్రశ్నించిందామె.

శ్రీనివాస్ కిరణ్ వంక అయోమయంగా చూశాడు.

ఆమె భర్త కూడా మొదటి కేసులో లాగానే చెప్పాడు. అయితే తమయింట్లో కాక పక్కింట్లో కూచుని యెదురుచూస్తోందామె. ఎలా వచ్చావు ఇన్నాళ్ళు యెక్కడున్నావు, అసలేం జరిగింది? అంటూ అతను భార్యను ప్రశ్నల వర్షంలో ముంచెత్తాడు. కాని, ఆమె వాటికి సమాధానాలు చెప్పకపోగా నా పేరేమిటి, నేనిక్కడి కెలా వచ్చాను? అంటూ శ్రీనివాస్ని అడిగినట్టే ఆమె భర్తనికూడా అడిగిందట. అతను బేజారెత్తిపోయి స్టేషన్కి ఫోన్ చేసి చెప్పాడు.

"ఈమెను జాగ్రత్తగా కనిపెట్టుకుని వుండండి. ఏమయినా ముఖ్యమైన సమాచారం చెపుతుందేమో ప్రయత్నించండి. మేము మళ్ళీ వస్తాం" అని చెప్పి బయటకొచ్చేశాడు కిరణ్.

శ్రీనివాస్ మూడో కేసు కోసం వెళ్తుండగా ఉండబట్టలేక అడిగేశాడు. "ఏమిటి బ్రదర్, ఇద్దర్లో ఒక్కరికీ మతిస్థిమితం లేకుండా పోయిందే? అసలేం జరిగిందో

తెలిసిపోతుందని, ఆ ముఠా ఆచూకీ కనిపెట్టవచ్చునని ఆశపడ్డాను!" అని.

కిరణ్ యేమీ మాట్లాడలేదు.

మూడో కేసు విషయం కూడా అలాగే వుంది. ఇంకో సంగతేమిటంటే, ఆమెకు కొత్తగా చెముడు వచ్చింది. గట్టిగా అరిచి మాట్లాడితే తప్ప ఆమె రియాక్టు కాలేదు. కిరణ్, శ్రీనివాస్‌లు అడిగిన ఏ ఒక్క ప్రశ్నకూ సమాధానం చెప్పలేదామె కూడా.

నాలుగో ఆమె ప్రవర్తన కూడా తక్కిన ముగ్గురిలాగానే వున్నది. అయితే ఆమె యేదో గుర్తుకు తెచ్చుకోవటానికి చాలాసార్లు ప్రయత్నించింది. కాని యేమీ చెప్పలేక పోయింది.

కిరణ్ ఆమె నోటినుంచి చిన్న ధ్వనికూడా బయటకి రాకపోవటం గమనించాడు.

ఆమెకి మాట పడిపోయింది!

కాని ఆ విషయం గ్రహించికూడా పైకి అనలేదు కిరణ్. ఆమె భర్తకిది పెద్ద షాక్ అవుతుందని అతనికి తెలుసు! అందరికీ చెప్పినట్టే అతనికి కూడా ఆమెను జాగ్రత్తగా కనిపెట్టుకుని వుండమని చెప్పి కిరణ్, శ్రీనివాస్‌లు స్టేషన్‌కి తిరిగొచ్చారు.

"చాలా బాడ్‌లక్ బ్రదర్! క్లూ అందినట్లే అంది మిస్సయింది. నలుగుర్లో ఒక్కరైనా అసలేం జరిగిందో చెప్పలేక పోయారంటే, యిదేదో యింద్రజాలంలాగా వుంది. ఆ డాక్టరు కావాలనే వీళ్ళకు మతి స్థిమితం పోగొట్టాడనిపిస్తోంది" అన్నాడు శ్రీనివాస్.

కిరణ్ తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. అతని కళ్ళలో ఆ నలుగురు స్త్రీల అమాయక వదనాలు పదే పదే మెదు

లున్నాయి. సంతానం కోసం స్త్రీ ఎంతగా తపిస్తుంది? ఎన్ని త్యాగాలైనా చెయ్యటానికి సిద్ధపడుతుంది! కాని అదే దక్కనపుడు ....?

ఫోన్ మ్రోగింది. శ్రీనివాస్ ఫోన్ ఎత్తి విని, "మైగాడ్! మరో కేసు. ఓ అయిదునిమిషాలక్రితం మరో కామె ఇల్లు చేరుకుందిట. వెళ్ళి చూద్దామా?" అన్నాడు.

"అతను ఆమె కండిషన్ గురించి చెప్పలేదా?" అడిగాడు కిరణ్.

"చెప్పాడు. ఎంత అడిగినా ఆమె యేమీ చెప్పటం లేదట. వెంటనే మనకి ఫోన్ చేశానన్నాడు."

కిరణ్ తలూపి, "నువ్వెళ్ళి చూసిరా. నేను సార్జంట్సు శివం, రాజులకు పనులప్పగించాను. వాళ్ళ కోసం ఎదురుచూస్తున్నాను" అన్నాడు.

శ్రీనివాస్ "అలాగే! ఓ అరగంటలో వచ్చేస్తాను" అంటూ హేట్ తగిలించుకుని చేతికర్ర ఊపుకుంటూ హడావిడిగా బయటకి పరుగెత్తాడు.

# 5

సార్జంటు శివం స్టేషన్‌లో అడుగు పెడుతూనే కిరణ్‌తో. "అంబులెన్స్ కార్లు సికింద్రాబాద్ పెరేడ్ గ్రౌండ్సు వైపుగా వెళ్ళినట్లు ఎంక్వయిరీలో తేలింది సార్! ఒకదాని తర్వాత మరొకటి కొద్ది నిమిషాల వ్యవధిలో వచ్చి పోతూ వుండటంవల్ల చాలామంది యీ విషయాన్ని ఆసక్తిగా గమనించారట! అయితే అవి గాంధీ హాస్పిటల్‌కి వెళుతూండవచ్చునని కొందరు భావించారట- నిజానికి ఎక్కడికి వెళ్ళినదీ సరిగ్గా ఎవరూ చెప్పలేక పోయారు" అన్నాడు.

18

కిరణ్ లేచి, "సార్జంటు రాజును స్టేషన్‌లోనే కని పెట్టుకుని వుండమని చెప్పు. ఇన్‌స్పెక్టర్ శ్రీనివాస్‌ని కూడా స్టేషన్‌లో వుండమని చెప్పు. నేనో గంటలో తిరిగొస్తాను" అంటూ రెండంగల్లో బయటికొచ్చి తన టయోటా స్టార్టుచేసి సికింద్రాబాద్ వైపు పరుగెత్తించాడు.

సికింద్రాబాద్ పెరేడ్ గ్రౌండ్స్ పదినిమిషాల్లో చేరాడు కిరణ్. అక్కడ రోడ్ చీలిపోయింది. ఓ రోడ్ రైల్వేస్టేషన్ వైపు, మరొకటి ఏర్‌ఫోర్స్ క్వార్టర్సు వేపు మరొకటి మారేడ్‌పల్లి వైపు, నాలుగోది బేగంపేట్ వైపు సాగిపోతున్నాయి. ఆ నాలుగో రోడ్ మీదుగానే ఆడవాళ్ళను హోటల్లోనించి తీసుకొచ్చారు దుండగులు.

కిరణ్ టయోటాని జంక్షన్‌లో ఓ నిమిషం ఆపి, ఆ తర్వాత మారేడ్‌పల్లి రోడ్‌వైపు పోనిచ్చాడు.

ఓ అయిదు నిమిషాల ప్రయాణం తర్వాత విశాలమైన మైదానం కనిపించింది.

కిరణ్ టయోటా ఆపి, ఓక్షణం కారులోనే కూచుని చుట్టూ పరిశీలనగా చూశాడు. ఎక్కడా జనసంచారం లేదు. ఉండి ఉండి ఒకో వాహనం పోతోంది రోడ్‌న.

కిరణ్ తలుపు తెరిచి రోడ్‌మీద కాలు పెట్టాడో లేదో, సర్రున అతని చెవిపక్కగా దూసుకుపోయింది బుల్లెట్ — కిరణ్ చటుక్కున కార్లో కూచుని తలుపు వేసుకున్నాడు. అద్దాల్లోంచి ముందు వెనకలకు చూశాడు. దూరంగా వెనక నుండి ఓ కారు అప్పుడే స్టార్టయి వెళ్ళిపోతోంది.

కిరణ్ యేమాత్రం ఆలస్యం చెయ్యకుండా కారుని రివర్స్‌చేసి ముందుకి ఉరికించాడు. కాని చిత్రంగా ఆ కారు అంతలోనే మాయమయిపోయింది.

కిరణ్ కారుని బాక్ చేసుకుని, మళ్ళీ మారేడ్‌పల్లి జంక్షన్ దగ్గర కొచ్చాడు. కార్లో కూచునే పరిసరాల్ని జాగ్రత్తగా గమనించసాగాడు.

దగ్గర్లో ఎలాంటి భవనాలుగాని, అనుమానించదగ్గ స్థలంగాని లేదు. చుట్టూ కొన్ని వందలమీటర్ల పరిధిలో అంతా ఖాళీ ప్రదేశమే!

తన అంచనా తప్పయిందేమో ననిపించిందో క్షణం! కాని, అది కేవలం అనుమానమేనని మరుక్షణమే తేలి పోయింది.

మైదానంలోని యిసుకమీద ఎన్నో కార్లు కలగాపుల గంగా తిరిగినట్టు టైర్ల గుర్తులు స్పష్టంగా కనిపించాయి. మైదానం మీద ట్రాఫిక్ వుండే అవకాశం లేదు. పక్క నుంచి నున్నటి తారురోడ్డు వెడల్పుగా పరచుకుని వుంటే మైదానంలో యిసకలో కారుప్రయాణం చేసే అవివేకి వుండడు!

కిరణ్ కారుని కొద్ది మీటర్లు ముందుకు పోనిచ్చి నేల సునిశితంగా పరిశీలించాడు. స్పష్టంగా కనిపిస్తున్నాయి టైర్ల గుర్తులు! నిన్నో యీ రోజో కార్లు తిరిగినంత స్పష్టంగా వున్నాయి.

ఆడవాళ్ళని యీ పరిసరాల్లోనే ఎక్కడో దాచి వుంటారు. మతిస్థిమితం తప్పిన ఆడవాళ్ళని మాత్రం వాళ్ళ యిళ్ళకు చేర్చేశారు. బహుశా వాళ్ళు హోటల్ రూంలోకి ప్రవేశించినప్పుడే ప్రతివారి యింటి అడ్రెస్సూ ముందుగానే నోట్ చేసుకుని వుంటాడా డాక్టరు.

కిరణ్ కాలు కింద పెడదామా వద్దా అని కొద్ది క్షణాలు ఆలోచించాడు. ఇంతలోనే పెనుభూతంలా ఓ పెద్ద లారీ అతని కారుమీదికి దూసుకు వచ్చింది. ఏ

మాత్రం అజాగ్రత్తగా వున్నా అతని కారు నుగ్గునూచయి పోయిందేది!

కిరణ్ రెప్పపాటు కాలంలో ఇంజన్ రైజ్ చేసి కారును పక్కకు తోశాడు. లారీ మళ్ళీ కారుమీదికి అదే వేగంతో వచ్చేస్తోంది. కిరణ్ కారును రివర్సు చేస్తూనే కారు అద్దాలన్నీ మూసేశాడు. లోపలకి గాలికూడా చొరకుండా జాగ్రత్తలు తీసుకున్నాడు. లారీనుంచి లాఘవంగా తప్పించుకున్నాడు. తన కారు బోనెట్ ముందు అమర్చుకున్న తుపాకీని స్టీరింగ్ దగ్గర్నుంచే ఆపరేట్ చేశాడు.

అంతే! ఎదురుగా పర్వతంలా వచ్చి విరుచుకు పడబోతున్న లారీ యింజన్‌లోకి రెండు గుళ్ళు దూసుకు పోయాయి. టైర్లను రెండు గుళ్ళు పంచర్ చేసేశాయి. లారీ పెద్ద శబ్దం చేస్తూ ఎక్కడిదక్కడే టైరు నేలకి కరచుకుని కీచుమంటూ ఆగిపోయింది. అయితే, అదే సమయంలో అతని కారును వెనకనుంచి ఓ పెద్ద ట్రక్ వచ్చి డాష్ యివ్వబోయింది.

కిరణ్ రియర్ వ్యూ మిర్రర్ లోనుంచి క్షణంలో సంభవించ నున్న ప్రమాదాన్ని గ్రహించాడు. ఎడమచేత్తో ఇగ్నిషన్ బోర్డు కిందున్న బటన్ నొక్కాడు. టయోటా వెనకవైపు అద్దం ఓ మెరుపు మెరిసింది. అంతే, ట్రక్ డ్రైవర్ శాశ్వతంగా గుడ్డివాడయి పోయాడు. ఈ లోపల కిరణ్ టయోటాను పక్కకు తప్పించాడు. ట్రక్ సరాసరి మైదానం మీదినుంచి రోడ్డెక్కి విపరీతమైన వేగంతో దూసుకుపోయి రోడ్ పక్కనున్న చెట్టును ఢీకొట్టి పెద్ద శబ్దంతో బోర్లా పడింది.

కిరణ్ టయోటాను యీసారి సరాసరి లారీ పక్కకు

తీసుకు వెళ్ళి ఆపాడు. కారు దిగి, జేబులోని రివాల్వర్ ని పైకితీసి డ్రైవరువైపు గురిచేసి డ్రైవరు పక్కనున్న తలుపు తెరిచిచూచి ఆశ్చర్యంతో అడుగు వెనక్కువేశాడు. సీట్లో డ్రైవర్ లేడు! తను ట్రక్ ప్రమాదం నుంచి తప్పించుకునే సమయంలో పారిపోయాడు.

కిరణ్ కి యేమూలో అనుమానం పొడసూపింది. చటుక్కున లారీ చక్రం మీదుగా బాడీలోకి తొంగిచూశాడు. బాడీ ఖాళీగా వుంది!

కిరణ్ పక్కలకు జాగ్రత్తగా చూసుకుంటూ చటుక్కున ఒంగి లారీ కింద చూశాడు. అక్కడా లేడు డ్రైవర్. క్షణాల్లో పారిపోవటానికి అది చాటు ప్రదేశం కాదు. విశాలమైన మైదానం! డ్రైవర్ ఎలా తప్పించుకున్నాడు?

కిరణ్ దూరంగా ట్రక్ ఏక్సిడెంట్ అయిన ప్రదేశంలో జనం గుమికూడటం గమనించాడు. అసలే ఆరోడ్డున జనం చాలా అరుదుగా మసలుతారు. అంత పెద్ద శబ్దానికి ఎక్కడినుంచో జనం వచ్చి చేరుతున్నారు. లేకుంటే ఏక్సిడెంట్ పట్ల ప్రజలు ఆసక్తి కనపరిచేటంత రద్దీ స్థలం కాదది! అందుకే ఆ స్థలాన్ని నేరస్తులు తమ అకృత్యాలకి ఎన్నుకున్నారు!

కిరణ్ మస్తిష్కం ఆలోచనలతో మరిగిపోతూంది. ఆడవాళ్ళందర్నీ విలియమ్స్ ఎక్కడ దాచాడు? వాళ్ళనేం చేయబోతున్నాడు? అందర్నీ సంతానంలేని ఒకే వయసున్న వర్గంలో నించే ఎందుకు ఎన్నుకున్నాడు? పోనీ ఆడవాళ్ళతో వ్యాపారం చేసే మనిషయితే కన్నెపిల్లల్ని, అందగత్తెల్ని, బాగా వయసులో వున్నవాళ్ళనీ ఎన్నుకో వచ్చునే!

దీన్నిబట్టి విలియమ్స్ ఆడవాళ్ళతో వ్యాపారం చేయుటానికి కాదు వాళ్ళని ఎత్తుకుపోయింది! ఎందుకో, చాలా ముఖ్యమైన పనికోసం!—ఏమిటా పని?

నేరస్తులు నగరంలోనే వున్నారు. పరిస్థితి చేయి దాటి పోలేదు. నగరందాటి పోకుండా అన్ని చర్యలు తీసుకోవలసిందిగా కమిషనర్ ఆఫ్ పోలీస్‌కి తెలియ చెయ్యాలి. అది తన తక్షణ కర్తవ్యం!

కాని, యిక్కడి రహస్యాన్ని ఛేదించకుండా తను వదిలిపెట్ట దలచుకోలేదు. నేరస్తులు ఎక్కడే ఎక్కడో పొంచివున్నారని తన సిక్స్త్‌సెన్స్ చెపుతోంది. ఇక్కడే యెక్కడో....?

కిరణ్ మైదానం చివరివరకు ప్రతీ అంగుళం జాగ్రత్తగా వెతుకుతూ పరిశోధించాడు. యేదైనా నేలమాళిగ వంటిది వుండొచ్చునని అనుమానించాడు. కాలితో నేలను గట్టిగా తట్టుతూ తిరిగాడు. కాని, అనుమానాస్పదమైన స్థలం యెక్కడా కనిపించలేదు.

మైదానం చివరివరకు పరిశోధించి తిరిగి వెనక్కువచ్చి, టయోటా యెక్కబోతూ, మెరుపు వేగంతో కిందికి దిగిపోయాడు. యేదో వాసన వేస్తోంది. వైరు కాలిన వాసన. ఇగ్నిషన్ బోర్డు దగ్గరనుంచి వస్తోంది వాసన.

ఎవరో ప్రేవులు పాడుచేశారు. వైరు కావాలనే కలిపేసి ఇగ్నిషన్ కీ తిప్పగానే మంటలేచి పెట్రోలు టాంకు అంటుకునేలా యేర్పాటు చేశారు. కిరణ్ చకచక వైరు తప్పించి, ప్రేవులు సరిచేశాడు.

వెంటనే రివ్వున లారీ దగ్గరకు పరుగెత్తాడు. మోకాళ్ళ మీద వంగి లారీ కిందకు చూశాడు. ఈసారి అతని అంచనా తప్పలేదు. లారీ అడుగు భాగానికి బల్లిలా

కరుచుకుని వున్నాడు డ్రైవర్.

"కమ్ అవుట్ రాస్కెల్!" అంటూ అరిచాడు కిరణ్ చేత్తో ఓ రివాల్వర్ మరో చేత్తో ఫోర్ సెల్ టార్చి పట్టుకుని ఫోకస్ చేస్తూ.

డ్రైవర్ మెరుపులా పని చేశాడు. బయటికివస్తూన్నట్టు నటిస్తూనే గుప్పెట్లో దాచిన వస్తువేదో గుటుక్కున మింగాడు.

లారీ బయటకి వస్తూనే నేలమీద పడిపోయి నురగలు కక్కుకుని చనిపోయాడు.

సైనేడ్ క్యాప్సూల్ మింగాడని అర్థమయిపోయింది కిరణ్ కి. ముందుగా ఊహించి వుంటే అతను ఆ పనికి సిద్ధపడకుండా అపగలిగేవాడు. దొరికిన ఆధారం పనికి రాకుండా పోయింది!

కిరణ్ నిట్టూర్చి, అతని దుస్తుల్లో చకచక వెతికాడు. యెలాంటి ఆధారమూ దొరకలేదు. లారీ కేబిన్ లో టార్చితో వెతికాడు. యేవో పాత గుడ్డ పేలికలు, ఓ టార్చి లైట్ తప్ప యేమీ కనపడలేదు.

ఆలోచిస్తూ టయోటా దగ్గర కాసేపు నిల్చున్నాడు. చుట్టూ ప్రశాంతంగా వుంది. తుఫాను వచ్చే ముందుండే ప్రశాంతతలాగా వుంది! యే క్షణంలోనైనా ప్రళయం విరుచుకు పడుతుందేమోనన్నట్టుగా వుంది వాతావరణం!

సరిగ్గా అప్పుడే గాల్లోంచి మాటలు వినిపించాయి. మొదట్లో ఆ మాటలు ఎక్కడ్నుంచో వస్తున్నాయను కున్నాడు కిరణ్. కాని అది లారీ హారన్ లోనుంచి వస్తున్నట్టు గ్రహించాడు. ఇంగ్లీషులో వినిపించాయి మాటలు.

"మిస్టర్ కిరణ్, చూశావుగా నా ప్రతాపం! ఇక

ఎప్పుడూ యీ ఛాయలకు రావటానికి ప్రయత్నించకు. ప్రస్తుతానికి ప్రాణాలతో వదులుతున్నాను. వెళ్ళిపో!" అని.

కిరణ్ రక్తం సలసల మరిగింది.

"నువ్వెవరివోగాని, ఎదుటికివచ్చే ధైర్యంలేని పిరికి వాడవని నాకర్థమయ్యింది. నీ ప్రతాపం నాకింతకుముందే తెలిసింది. నా ప్రతాపానికి ప్రత్యక్ష నిదర్శనం నీ ట్రక్ డ్రయివర్‌తోపాటు నాశనం కావటం, నీ లారీడ్రయివర్ నరకానికి సరాసరి నడచిపోవటం! ధైర్యముంటే నా ముందుకిరా! ఆ స్త్రీలందర్నీ యేం చేశావో, యెందుకు అపహరించావో చెప్పు. వారిని మర్యాదగా మాకప్ప గించు. లేకుంటే నువ్వు వాళ్ళని యెక్కడ దాచినా నేను వాళ్ళని విడిపించి తీరతాను. నిన్ను చట్టాని కప్పగిస్తాను."

"అది నీ తరంకాదు. నన్ను పట్టుకోవటంగాని, కనీసం నేనెక్కడున్నానో తెలుసుకోవటం కనిపెట్టడం నీ శక్తికి మించిన పని! నేనంత తేలిగ్గా పట్టుబడను. అంత శక్తిపరుడివే అయితే నేనెందుకు బయటపడాలి? నువ్వే వెతుక్కో!"

"అదెలాగూ తప్పదు. అప్పుడు విసిగిపోయిన, హిం సింపబడ్డ ఆ స్త్రీల బంధువులు, ప్రజలు నిన్ను ఖండ ఖండాలుగా చీల్చి కాకులకు, గద్దలకు వేయకపోరు. బి కేర్‌ఫుల్!"

"అదీ చూద్దాం. నేను నగరంలోనే వుంటాను. ఎక్కడికీ పారిపోను. చేతనైతే బంధించు. ఈలోపల ఒక్కొక్కరుగా ఆ స్త్రీలందరు వాళ్ళ యిళ్ళకు చేర వేయబడుతునే వుంటారు."

"నువ్వు రాక్షసుడివి. ఆ ఆడవాళ్ళనెందుకలా మతి

పోగొట్టి, మూగవాళ్ళుగా చేసి హింహిస్తున్నావు? వాళ్ళు నీకు చేసిన అపచార మేమిటి? ఎందుకలా కక్ష తీర్చు కుంటున్నావు?"

అవతల్నుంచి పెద్దగా నవ్వు వినిపించింది తెరలు తెరలుగా.

"ఎందుకా? ఆడవాళ్ళంటే నాకు కక్ష! ముఖ్యంగా ఆ వయసులో వున్న పెళ్ళయిన ఆడవాళ్ళంటే అసహ్యం. ఎందుకో తెలుసా? నా భార్య ఆ వయసులోనే నన్ను మోసంచేసి పారిపోయింది. నా భార్యకూ పిల్లల్లేరు. అందుకే పిల్లల్లేని ఆ వయసు ఆడవాళ్ళని హింసించి మానసికానందం పొందుతున్నాను. వాళ్ళు పిచ్చివాళ్ళయిపోయినా, చెవిటి మూగ గుడ్డివారయి పోయినా నేను లెక్క చెయ్యను. నాక్కావలసింది వాళ్ళని హింసించటం, దట్సాల్!"

"అయినా నీ భార్య నీలో యేదో లోపం చూసి వెళ్ళిపోతే పరాయి ఆడవాళ్ళు, అందునా మా దేశం లోని ఆడవాళ్ళు తేరగా దొరికారా నీకు కక్ష సాధించ టానికి. నీ దేశం ఆడవాళ్ళకి గొడ్డుపోయిందా? అదేదో నీ దేశంలోనే వినోదించక పోయావా? భారతదేశం, అందునా ఆంధ్ర రాజధానికెందుకొచ్చావు?....ఇకనైనా నీ అకృత్యాలు కట్టిపెట్టి ఆ స్త్రీలందర్నీ సురక్షితంగా మా కప్పగించు."

"బెదిరిస్తున్నావా?"

"హెచ్చరిస్తున్నాను. నీ నాశనం నువ్వే కోరి తెచ్చుకో వద్దంటున్నాను."

"థాంక్యూ ఫర్ యువర్ ఎడ్వైజ్! గుడ్ లక్ అండ్ గుడ్ నైట్!" మాటలు మరి వినిపించలేదు.

కిరణ్ మరి కొద్ది నిమిషాలు యెదురు చూశాడు. అంతటా నిశ్శబ్దంగా వుంది. అప్పుడు అప్పుడు ఓ స్కూటరో, ఆటోనో రోడ్డున పోతోంది దూరంగా.

కిరణ్ ఆ మాటలు యెక్కడ్నుంచి వచ్చాయా అని ఆలోచిస్తున్నాడు. విలియమ్స్, అతని సహచరులు తనని, తన చర్యల్ని వేయి కళ్ళతో కనిపెట్టి చూస్తున్నారు. ఆ విషయంలో ఏమీ అనుమానం లేదు. కాని తనని విలియమ్స్ హెచ్చరించటం దేనికి? చంపటానికి ప్రయత్నించిన విలియమ్స్ యిప్పుడు హెచ్చరికల్లోకి బెదిరింపుల్లోకి యెందుకు దిగుతున్నాడు. రాయబారానికొస్తున్నాడా? అతను తలచుకుంటే యే చోటునుంచో తనని హతమార్చవచ్చును కదా! తనవాళ్ళు యిద్దరు అర్ధాంతరంగా చచ్చిపోయినా, అతడు కోపం తెచ్చుకుని తనకేం హాని తలపెట్టక పోవటం చాలా చిత్రంగా అనిపిస్తోందతనికి.

లారీ దగ్గరకు నడిచి వెళ్ళాడు. లారీ హెడ్‌లైట్స్ మధ్యగా బిగింపబడి వున్నది హారన్. దాన్నుంచి విలియమ్స్‌కి వైర్లెస్ సంబంధాలున్నాయన్నమాట. డ్రైవర్‌కి ఆదేశాలివ్వటానికి ఆ హారన్ ద్వారానే మెసేజ్ పంపి వుండొచ్చు.

కిరణ్ వాడి చూపులకు హారన్‌కి వెనకపక్కగా రేడియేటర్‌కి ముందు బంపర్‌కి అమర్చబడ్డ సూక్ష్మమైన వైర్‌లెస్ సెట్ కనిపించింది. తన మాటల్ని కూడా యీ సెట్ ఆకర్షించి విలియమ్స్‌కి అందించింది. అందుకే విలియమ్స్ తనని చూస్తూన్నంత సమీపం నుంచే మాట్లాడినట్టు తనకి అనుభూతి కలిగింది. నిజానికి తను విలియమ్స్‌కి

కనిపించకపోయుండవచ్చు. తన మాటకే అతను జవాబిచ్చాడని అర్థం చేసుకున్నాడు కిరణ్.

# 6

"వాట్, విలియమ్స్ బర్డుతో మాట్లాడావా? చెప్పవేం, ఆ మైదానాన్ని నాలుగు వైపులనుంచి ముట్టడించి ఆ విలియమ్స్ ఎక్కడున్నాడో పట్టుకునే వాళ్ళం కదా?" అన్నాడు శ్రీనివాస్, కిరణ్ చెప్పింది విని.

"విలియమ్స్ నువ్వనుకునేటంత తెలివితక్కువవాడు కాదు నీకు అంత తేలిగ్గా పట్టుబడటానికి!? ఆ మైదానం ప్రతి అంగుళం పరిశీలించాను నేను. అక్కడ రహస్య మార్గాలుగాని, నేలమాళిగలుగాని యేవీ లేవు. కాకపోతే ఆ మైదానాన్ని వాళ్ళు యిప్పటిదాకా తమ కార్యకలాపాలకు ఓ సంకేత స్థలంగా వాడుకున్నారు. అంబులెన్స్లో ఆడవాళ్ళని అక్కడినుంచి వేరే వాహనాల్లో మరెక్కడికో తరలించారు. అది యెక్కడో అంత తేలికగా తెలియనిస్తారా? ఇప్పుడు మరింత జాగ్రత్త పడతారు."

"మరి నిన్ను ఆ మైదానంలో ఎందుకు అటకాయించారు? వాళ్ళ రహస్యాలేవో బయటపడిపోతాయనే కదా నిన్ను చంపటానికి ప్రయత్నించారు?"

"వాళ్ళ ఉద్దేశ్యం మొదట్లో నన్ను చంపాలనే. కాని వాళ్ళ అనుచరులిద్దరు చచ్చాక ఎందుకో విలియమ్స్ తన అభిప్రాయం మార్చుకున్నాడు. అవకాశం వున్నా నా జోలికి రాలేదు. అదే నాకంతుబట్టడంలేదు."

"అతను ఆడవాళ్ళను హింసించటానికి చెప్పిన కారణం సహేతుకంగా అనిపించటంలేదు. తన భార్య ఆ ఏబీ గ్రూప్ ది, పిల్లలు లేనిది అయినంత మాత్రాన

అమెరికా నుంచి ఆంధ్రదేశం వచ్చి మన ఆడపడుచుల్ని ఎందుకు చెరబడతాడు? వాళ్ళని చెవిటి, మూగ, పిచ్చి వాళ్ళగా ఎందుకు మారుస్తాడు? అసలు కారణం వేరే యేదో వుందనిపిస్తోంది."

కిరణ్ మందహాసంచేసి, "నీ పోలీసు బుర్రకి కూడా ఆలోచనలొస్తున్నందుకు సంతోషం మెడియర్ యిన్స్పెక్టర్! నువ్వు నీ అనుమానం బయట పెట్టేసుకున్నావు, నేను బయటపడలేదు. అంతే తేడా! ప్రస్తుతానికి సహేతుకంగా లేకపోయినా ఆడవాళ్ళ అంతర్థానానికి యిదే కారణంగా బయట ప్రచారం జరగనివ్వు" అన్నాడు కిరణ్.

శ్రీనివాస్ యేదో చెప్పబోయేంతలో ఫోన్ గణగణ మోగింది. శ్రీనివాస్ రిసీవర్ ఎత్తి విని, "అలాగే అడ్రసు చెప్పండి" అంటూ అడ్రసు నోట్ చేసుకుని, "ఇప్పుడే బయల్దేరి వస్తున్నాం" అంటూ ఫోన్ పెట్టేశాడు.

"వసంత అనే ఆమెను కూడా వదిలేశారట. ఆమె భర్త ఉమాపతి ఫోన్ చేశాడు. వసంత మామూలుగా నే మాట్లాడుతోందట" అన్నాడు శ్రీనివాస్ గొంతు తగ్గించి.

కిరణ్ ఉత్సాహంగా లేచి, "పద, యీ కేసుకి ఓ పరిష్కారం దొరికింది" అన్నాడు.

పది నిమిషాల్లో పోలీసు జీపు ఉమాపతి యింటికి పరుగులుతీసి ఆగింది.

## 7

సార్జంట్ను తక్కిన పోలీసుల్ని జీప్‌లో వుండనిచ్చి కిరణ్, శ్రీనివాస్ మాత్రం ఉమాపతి ఇంట్లోకి వెళ్లారు.

ఉమాపతి ఎదురొచ్చి విష్ చేశాడు.

కిరణ్ అతనితో "మీ భార్య ఇంటికి తిరిగొచ్చినట్టు చుట్టుపక్కలవారు చూశారా?" అనడిగాడు.

"చూశారండి. కాని యింకా ఎవరినీ లోపలికి ఎలవ్ చెయ్యలేదు. ముందుగా మీకే ఫోన్ చేశాను" అన్నాడు ఉమాపతి.

అప్పుడు రాత్రి తొమ్మిది గంటలు దాటింది.

"దట్స్ గుడ్! ఆమె ఎలా వచ్చారు? ఎవరు తీసుకొచ్చారు?"

"పిలుస్తానుండండి" అంటూ ఉమాపతి వసంతను వెంటబెట్టుకు వచ్చాడు. బాగా యేడ్చినట్టు ఉబ్బిపోయి వున్నాయి కళ్ళు. నాలుగు రోజులుగా ఎక్కడో వున్న భార్యను రిసీవ్ చేసుకోవటానికి ఉమాపతి యిబ్బంది పెట్టే పరుషమైన మాటలతో ఆమెను బాధించలేదుకదా అనిపించింది చూస్తున్న వాళ్ళకు. కాని అతను ఆమెపై రవంతకూడా అనుమానం పెట్టుకోలేదని ఆ తర్వాత వెంటనే గ్రహించారు వాళ్ళిద్దరు.

వసంత డిటెక్టివ్‌లకి నమస్కరించింది.

"జరిగిన సంగతంతా వివరంగా చెప్పండమ్మా!" అన్నాడు కిరణ్.

శ్రీనివాస్ వెళ్ళి వీధి తలుపు గడియపెట్టి వచ్చాడు. వసంత సాఫీగా వుండటానికి ప్రయత్నిస్తూ, "నేను మతి చలించినదానిలా నటించి అక్కడ్నుంచి బయట పడ్డాను. లేకుంటే నన్నొదిలి వుండేవాళ్ళు కాదు....

పంధొమ్మిదో తేదీ శనివారం మధ్యాహ్నం నేను ఆశోపించిన పత్రికలోని ప్రకటన ప్రకారం హోటల్ న్యూ సఫైర్ కి వెళ్ళాను. నాలుగు గంటలకి పదినిమిషా

లుందనగా నాకు లోపలికి పిలుపొచ్చింది.

"లోపల విలియమ్స్బర్డ్ అనే పేరుగల అమెరికన్ సర్జన్, కూర్చుని వున్నాడు. ఓ పక్కగా ఎనిమిదిమంది ఆడవాళ్ళు — నాముందు పరీక్ష చేయించుకోవటానికి లోనికి వచ్చినవాళ్ళు—కూచుని వున్నారు. వాళ్ళందరు చాలా ఆనందంగా వున్నారు. డాక్టర్ నన్ను చూసి ఆదరంగా నవ్వి, నా పేరు, అడ్రసు, నా వివాహం అయిన తేదీ, నా వెంట ఎవరైనా వచ్చారా, మొదలైన వివరాలు రాసుకున్నాడు.

తర్వాత స్టెతస్కోప్‌తో నన్ను పరీక్షించి, కను రెప్పలు చూసి స్నేహపూర్వకంగా నవ్వి 'నీకు సంతానం కలుగుతుందమ్మా!' అన్నాడు ఆంగ్లంలో. నాకు చాలా ఆనందమయ్యింది. 'తక్కిన పరీక్షలు దగ్గర్లోనే వున్న మా మిషనరీ హాస్పిటల్లో చేయాల్సి వుంటుంది. అక్కడికి వెళ్ళటానికి మీకు అంగీకారమేనా?' అనడిగాడు ఎంతో మర్యాదగా. నాకు ఆ ఆనందంలో అతను చెప్పినదానికి కాదనాల్సిన అవసరం కనపడలేదు.

ఆ ఎనమండుగురు స్త్రీలను, నన్ను తీసుకొని డాక్టర్ రిసెప్షనిస్టుగా వ్యవహరించిన అమ్మాయి కింద సిద్ధంగా వున్న అంబులెన్స్‌లో తీసుకుపోయారు. అంబులెన్స్ సికిందరాబాద్‌లోని పెరేడ్ గ్రౌండ్స్ దగ్గరకొచ్చాక ఆగిపోయింది. పెరేడ్ గ్రౌండ్స్ ఆదివరలో నేను చూశాను. మావారితో రిపబ్లిక్ డే ఉత్సవాలు చూశా నిదివరలో.

డాక్టర్ మాతో 'అంబులెన్స్ ట్రబులిచ్చింది. మరో అంబులెన్స్‌లో మిమ్మల్ని హాస్పిటల్ కి చేరుస్తాం' అన్నాడు. అందరం మంచి ఉత్సాహంగా వున్నాం.

సంతోషంగా తలలూపాం.

ఇంతలో ఓ అంబులెన్స్ వచ్చింది. మమ్మల్నందర్నీ అందులోకి ఎక్కించారు. ఆ అంబులెన్స్ కిటికీలకు దట్టమైన అద్దాలున్నాయి. మేము బయటకుగాని, బయటి ప్రపంచం మాకుగాని కనిపించనంత దట్టంగా వున్నాయి.

అంబులెన్స్ అలా గంటకు పైగానే నడిచింది. ఎక్కడో ఆగింది. మాలో మేం భయం భయంగా చూసుకున్నాం. చివరికి అంబులెన్స్ ఆగాక అడగబోయాం. కాని డాక్టర్ మా వైపు తిరిగి ఓ రబ్బరు సాధనంతో మా మొహాలమీదకు యేదో ద్రవం స్ప్రే చేశాడు. తియ్యటి వాసన. మాకు స్పృహ తప్పింది. మేము తెలివి తెచ్చుకుని చూసేసరికి ఓ పెద్ద విశాలమైన హాల్లో వున్నాం. హాస్పిటల్లో వచ్చే స్పిరిటు వాసన, యింకా యేవో రకరకాల మందుల వాసనలు అది హాస్పిటలనే భ్రాంతి కలిగించాయి.

అక్కడ దాదాపు యిరవైమంది ఆడ వాళ్ళం వున్నాం. తక్కిన వాళ్ళంతా యెక్కడున్నారో తెలియలేదు. డాక్టరు మమ్మల్నుద్దేశించి, "మీరందరు ఎలాంటి గొడవ చెయ్యకుండా మాతో సహకరించాలి. మీకు చాలా రకాల పరీక్షలు చెయ్యాలి. ఒకటి, రెండు రోజుల్లో పంపేస్తాం" అన్నాడు.

మేమందరం యేక కంఠంతో, 'అదేం కుదరదు. మేం మా యిళ్ళలో చెప్పకుండా వచ్చాం. మేం వెళ్ళితీరాలి. రెండు రోజులుకాదు, రెండు గంటలుకూడా వుండటం వీలుకాదు' అని చెప్పాం. కాని మాది అరణ్యరోదనే అయింది.

మా అంగీకారాలతో నిమిత్తం లేకుండానే ఆ

రాత్రికి భోజన సదుపాయాలు, నిద్రపోవటానికి చాపలు, దిళ్ళలాంటివి సరఫరా చేశారు. మేం తినలేదు, నిద్ర పోలేదు. భయంతో, విచారంతో కుంగిపోయాం. మాలాగే తక్కిన వాళ్ళందర్నీ అంటే మొత్తం రెండు వందలతొమ్మిది మందినీ వివిధ గదుల్లో నిర్బంధించారని తర్వాత తెలుసుకున్నాం.

మరునాడు మాకేవో యింజక్షన్లు చేశారు. ఓ రోజంతా ఏవేవో పరీక్షలు చేస్తూనే వున్నారు. మూడో రోజున ఒకామెకి పిచ్చిపట్టింది. మరొకామెకి మాట పడిపోయింది. ఇంకొకామెకి చెవుడు వచ్చింది. మరొకామె గుడ్డిదై పోయింది. వాళ్ళని వెంటనే బయటకి తరలించేశారు. వాళ్ళ యిళ్ళలో వదిలేశారని తర్వాత తెలిసింది.

నేనా నరకం నించి బయటపడటానికి మతి స్థిమితం తప్పిన దానిలా నటించాను. పిచ్చి పిచ్చిగా సమాధానాలు చెప్పాను. నా నటన నిజమేనని నమ్మేశారు. నన్ను కళ్ళకు గంతలు కట్టకుండానే బయటికి తీసుకొచ్చారు. అదే ప్రదేశమో గుర్తుపట్టడానికి ప్రయత్నించాను. కాని సాధ్యం కాలేదు.

అంతదాకా నేనున్న స్థలం ఓ ఫ్యాక్టరీ అని గ్రహించాను. బయటికి రాగానే క్రూసిబుల్స్ తయారు చేసే మూసలు, ఫ్యాక్టరీ గొట్టం కనిపించాయి. బయట కార్మికులు తమ పనుల్లో నిమగ్నమయి వున్నారు.

అదేదో యిండస్ట్రియల్ యేరియా అని గ్రహించాను. తరవాత నన్ను అంబులెన్స్‌లో యెక్కించారు. అదే దట్టమైన అద్దాలున్న అంబులెన్స్‌లో అరగంట తర్వాత నన్ను పెరేడ్ గ్రౌండ్స్ దగ్గర దించారు. నేను ప్రయాణించి

నంతసేపు పిచ్చిదానిలా నాలో నేను గొణుక్కుంటూనే వున్నాను.

పెరేడ్ గ్రౌండ్స్‌లో ఓ అంబాసిడర్ కారు సిద్ధంగా వుంది. అక్కడ ఓ లారీకూడా వుంది. నేనొచ్చిన దార్లో ఓ ట్రక్కు చెట్టుకు కొట్టుకొని బోల్తాపడి వుంది. చెదురు మదురుగా జనం వున్నారు. అప్పుడు సమయం రాత్రి యేడున్నరయింది. సరిగ్గా అరగంటలో నన్ను మా ఇంటికి నాలుగైదు గజాల దూరంలో దింపేసి కారు దూసుకు పోయింది.

నేను రెండడుగుల్లో మా యింట్లోకి వచ్చి పడ్డాను. మావారు ముందు గదిలోనే విచారంగా కూచుని వున్నారు. నన్ను చూసి పరుగున వచ్చి "ఏమయింది? యెక్కడున్నా విన్నాళ్ళూ? కులాసాగా వున్నావా?" అంటూ ప్రశ్నల వర్షం కురిపించారు — నేను చెప్పింది విన్న వెంటనే ఎదురింటి వకీలుగారింట్లోంచి మీకు ఫోన్ చేశారు. ఇదీ జరిగిన సంగతి" అని ముగించింది.

కిరణ్, శ్రీనివాస్ చాలా శ్రద్ధగా ఆమె చెప్పిందంతా విన్నారు. కిరణ్‌కి చాలా ఆశ్చర్యంగా వున్నది.

ఏడుగంటలవరకు తను గ్రౌండ్స్‌లోనే వున్నాడు. తనని అక్కణ్ణుంచి పంపెయ్యటానికి విలియమ్స్ ఎందుకు కంగారు పడ్డాడో, ఎందుకు తనపట్ల మౌనం వహించాడో కిరణ్‌కి అర్థమయ్యింది. తను వెళ్ళిపోయిన అరగంటకు వసంతను అంబులెన్స్‌లో తీసుకొచ్చి గ్రౌండ్స్‌లో దించేశారు.

కిరణ్ వసంతవంక ప్రశంసాపూర్వకంగా చూసి, "మీరు చాలా తెలివిగా ప్రవర్తించారు. వాళ్ళ స్థావరం

గురించి సరయిన సమాచారం సమయానికి యిచ్చి చాలా మేలు చేశారు..ఇంతకీ ఆ డాక్టర్ మీకెన్ని ఇంజక్షన్స్ చేశాడు? ఎలాంటి పరీక్షలు చేశాడు? అభ్యంతరం లేక పోతే చెప్పగలరా?" అన్నాడు.

వసంత రెండు నిమిషాలు ఆలోచించి, "చెప్పటానికి అభ్యంతర మేముంటుంది? నా తోటి స్త్రీలను రక్షించ టానికి నా సమాచారం ఉపయోగపడటమే నాకు కావల సింది!.... మొదట యూరిన్ టెస్ట్ చేశారు. ఆ తర్వాత బ్లడ్ ఎగ్జామినేషన్ చేశారు. ఎనిమా యిచ్చారు రెండు సార్లు. నడుముకి స్పైనల్ కార్డ్‌కి-ఎనిస్తీషియా ఇచ్చారు. ఆ తర్వాత నాకు మగత వచ్చింది. కాని వాళ్లేం చేస్తున్నదీ స్పష్టంగా తెలుస్తూనే వుంది.

తర్వాత పొత్తి కడుపుమీద ఓ అరంగుళం మేర కోశారు. ఏదో పరికరంతో ఓసారి పరీక్ష చేసి మళ్ళీ ఓ యింజక్షనిచ్చి కోసిన ప్రదేశంలో ఓ కుట్టు వేశారు. ఆ మర్నాడు ఎక్స్‌రే తీశారు. ఈ రోజు యేంచేసేవారో, నేను ఉదయంనించీ మతిస్థిమితం కోల్పోయినదానిలా నటించడంవల్ల నా జోలికి రాలేదింక" అన్నది.

కిరణ్ మస్తిష్కంలో యేదో మెరిసింది.

"థాంక్సమ్మా, మీరు చాలా విలువైన విషయాన్ని చెప్పారు. ఇక యీ రాత్రితో ఆ డాక్టరు నిజస్వరూపం బయటపెట్టి వాడి ఆట కట్టిస్తాం. ఆడపడుచులకి వాడి చెర విడిపిస్తాం" అన్నాడు.

తర్వాత ఉమాపతితో, "మీరు అన్యథా భావించక పోతే నాకు తెలిసిన లేడీ డాక్టరుతో వసంతగారిని ఓసారి చెకప్ చేయటానికి అంగీకరిస్తారా?" అనడిగాడు కిరణ్.

ఉమాపతి వెంటనే "దానిదేం భాగ్యం? పరీక్ష చేయించటానికి నేనే గైనకాలజీస్ట్ దగ్గరకు తీసుకు వెళ్లాలనుకుంటున్నాను. వాళ్ళ మందులవల్ల తనూ ఆరో గ్యానికేమైనా ప్రమాదం జరగబోతుందేమోనని నాకు భయంగా వుంది" అన్నాడు.

"వసంతగారు బయటకి వెళ్ళనక్కరలేదు. డాక్టర్ నే యిక్కడికి రప్పిస్తాను" అని కిరణ్ సార్జంట్ శివంతో పోలీస్ జీప్ లో వెళ్ళి డాక్టర్ విమలని తీసుకురమ్మని కబురు పంపాడు.

# 8

"మనం వెంటనే మాలాలీ వెళ్లాలి. ఇండస్ట్రియల్ యేరియాలోనే యెక్కడో ఆడవాళ్ళని దాచిపెట్టిన విషయం నిర్వివాదాంశం. ఈ రాత్రికే విలియమ్స్ ఆట కట్టించాలి!" అన్నాడు కిరణ్ శ్రీనివాస్ తో.

ఇద్దరు పోలీసు స్టేషన్ లో యెదురెదురుగా కూచు న్నారు.

"ఆలస్యం దేనికి? సిబ్బందిని వెంటబెట్టుకొని వెళ్దామా?'

"వద్దు. ముందుగా నేను వెళ్తాను. తర్వాత ఓ గంట పోయాక నానుంచి మెసేజ్ రాకపోతే అప్పుడు సిబ్బందిని తీసుకురా! అందరం వెళ్తే మొదటికే మోసం వస్తుంది."

"ఓ గంటలో నీ దగ్గర్నుంచి వైర్లెస్ మెసేజ్ వస్తుందని ఎదురుచూస్తూంటాం!"

"సర్టెన్లీ. నేను వెళ్తున్నాను. సిటీ బస్ లో వెళ్తాను. నేను లొకేషన్ కనిపెట్టి తర్వాత అది యెక్కడుందో నీకు ముందుగా మెసేజ్ పంపుతాను. నేనేం చేయబో

తున్నదీ చెపుతాను. పరిస్థితి విషమిస్తే వెంటనే తెలియ పరుస్తాను.

"అప్పటికి మేము సికింద్రాబాద్ స్టేషన్ ప్రాంతాలకు చేరుకుంటాం. ముందునించీ జాగ్రత్తపడకపోతే ఎమర్జన్సీ అయితే మరి యింతదూరం ప్రయాణించి వచ్చేసరికి ఫలిత ముండకపోవచ్చు!" సూచించాడు శ్రీనివాస్.

"ఆల్ రైట్! పెరేడ్ గ్రౌండ్స్ మీదుగా కాకుండా ముషీరాబాద్ మీదుగా సికింద్రాబాద్ స్టేషన్ పరిసరాల్లో వెయిట్ చెయ్యండి. యూనిఫారాల్లో వద్దు. పూర్తిగా మఫ్టీలో, వీలయితే మంచి వేషాల్లో రావటం మంచిది. పోలీస్ జీవ్ వాడొద్దు. మన స్నేహితుల కారేదయినా తీసుకో!"

"గుడ్ అయిడియా."

కిరణ్ బయల్దేరుతూ, "ఎట్టి పరిస్థితుల్లోనూ మన ప్లాన్ బయటికి లీక్ కానివ్వద్దు" అన్నాడు.

# 9

కిరణ్ మాలాలీ చేరుకునేసరికి రాత్రి పదకొండు గంట లయింది.

వసంత చెప్పిన గుర్తుల ప్రకారం ఇండస్ట్రియల్ యేరియాలో అడుగుపెట్టాడు. అతని వేషం పూర్తిగా మారిపోయింది. సికింద్రాబాద్ స్టేషన్నించి తోపుడు బండి తోసుకువెళ్ళే అరటిపళ్ళు అమ్ముకునే మనిషిలా వేషం మార్చి, బండి తోసుకు వెళుతున్నాడు. అతని సన్నిహితులుకూడా అతన్ని అతిసమీపం నించి చూసినా గుర్తుపట్టలేనంత పకడ్బందీగా వేషం మార్చేశాడు.

ఇండస్ట్రియల్ యేరియా సగానికి పైగా దాటి పోయాక గౌతమీ క్రూసిబుల్ కంపెనీ అన్న పేరు

నయినానందకరంగా కనిపించింది.

కిరణ్ చుట్టూ పరీక్షగా చూశాడు. ఫ్యాక్టరీల్లో మిషను శబ్దాలు మెల్లిగా వినిపిస్తూన్నాయి. నైట్ షిఫ్టులు పని చేస్తున్నాయి. ఫ్యాక్టరీలచుట్టూ ఎత్తయిన ప్రహారీగోడలు, గోడలకి పెద్ద యినప గేట్లు అమర్చబడి వున్నాయి. గేటులోపల సెక్యూరిటీ గార్డులు కాపలా వుంటారు.

కిరణ్ క్రూసిబుల్ కంపెనీ పరిసరాల్ని చాలా జాగ్రత్తగా గమనించాడు. ఆ కంపెనీకి కుడిపక్కగా టైర్ల ఫ్యాక్టరీ వుంది. ఎడమపక్కగా వున్న బోర్డు అతన్నాకర్షించింది.

'డిస్టిల్డ్ వాటర్' తయారుచేసే ఫ్యాక్టరీ అది. పైకి ఫ్యాక్టరీలా కనిపించినా పొగ గొట్టాలుగాని, మెషీన్ల చప్పుడుగాని యే విధమైన శబ్దాలుగాని వినిపించకుండా ప్రశాంతంగా వుంది. తక్కిన ఫ్యాక్టరీలకి భిన్నంగావుంది. ప్రహారీగోడ చాలా ఎత్తుగా వుంది. బలమైన డిజైన్డ్ కటకటాల గేటుంది.

కిరణ్ చుట్టూ పరిశీలనగా చూశాడు. ఎవరూ తనని గమనించటంలేదని రూఢి చేసుకున్నాడు. కాంపౌండ్ వాల్ చుట్టి వెనకవైపుకి నడిచాడు. కారు గేరేజ్ కనిపించింది. మూసివున్న తలుపుల్లోనుంచి తెల్లటి రంగుగల వేన్ కనిపించింది. రెడ్ క్రాస్ గుర్తు అస్పష్టంగా కనిపించింది. అంబులెన్స్!

కిరణ్ కి సన్నగా యీలవెయ్యాలనిపించింది.

జేబునించి పాకెట్ మనీపర్సులా వున్న వైర్లెస్ సెట్ తీసి నేలమీద గొంతుకూచుని, లొకేషన్ గుర్తించినట్టు శ్రీనివాస్ కి మెసేజ్ పంపాడు.

తర్వాత వైర్లెస్ సెట్ని పేంటులోకి తోసేసి, లేచి నించున్నాడు. ప్రహరీగోడ వెనక భాగంలో ఓ చివర గుత్తయిన బండరాళ్ళున్నాయి. బండరాళ్ళ మీదుగా ప్రహరీ దాటడం పెద్ద కష్టంకాదు.

కిరణ్ బండరాళ్ళమీది కెగబాకి, కాంపౌండ్ వాల్ అంచు అందుకున్నాడు. వెంటనే దుమికెయ్యకుండా లోపలికి తొంగిచూశాడు. కింద రెండు అల్సేషియన్ కుక్కలు కొదమ సింగాల్లా ఆవరణలో తిరుగుతున్నాయి.

కిరణ్కేం చెయ్యాలో ఓ క్షణం అంతుబట్టలేదు. తనేమాత్రం తొందరపడినా యీపాటికి వాటికి ఆహార మయిపోయుండేవాడు.

కిరణ్ నాలుగు గులకరాళ్ళు ఏరాడు. కుక్కల దృష్టిని మరలించటానికి రాళ్ళను మెయిన్ గేటువైపు విసిరాడు. గేటుకి తగిలేలా జాగ్రత్త తీసుకున్నాడు. ఖంగున చప్పుడయ్యింది. అల్సేషియన్ కుక్కలు గుర్రు మంటూ ఒక్క అంగలో గేటు దగ్గరకు పరుగెత్తు కెళ్ళాయి.

కిరణ్ ఒక్క గెంతులో ప్రహరీదూకి గోడదూకి ఆవరణ లోకి ప్రవేశించాడు. కుక్కలు తనని యేమాత్రం పసి కట్టినా తన చావు తథ్యం!

కిరణ్ క్షణాలమీద ఆవరణలో ఓ పక్కగా తెరచి వున్న తలుపు దగ్గరకు రెండంగల్లో చేరుకున్నాడు. కుక్కలు తిరిగొస్తున్నట్టు వాటి ఒగర్పునిబట్టి గ్రహిం చాడు. తలుపు ఓ పక్కనుంచి లోపలకుతొంగి చూశాడు. వరసగా గదులు కనిపించాయి. చటుక్కున ఆ ద్వారం లోనించి లోపలకు ప్రవేశించి తలుపులు గడియపెట్టే శాడు. కుక్కలు తనని పసిగట్టినా లోపలకు రాలేవు!

అక్కడ గోడ చాలా ఎత్తుగా వున్నది.

కిరణ్ చీకటిగా వున్న ప్రదేశం చూసుకుని కీనీడలో నించుని నడవా వంక దృష్టిసారించాడు. అక్కడంతా నిశ్శబ్దంగా వుంది. బహుశా వసంత చెప్పిన గదులు అవే అయ్యుండాలి. వాటిలోనే అంతర్ధానమైన యువతులు అజ్ఞాతవాసం చేస్తున్నారు.

కిరణ్ కీనీడలోనించి కదలబోయాడు. ఇంతలో ఎవరో వస్తూన్న అలికిడి విని, తన ప్రయత్నం విరమించుకుని ఊపిరి బిగబట్టి చూడసాగాడు. గూర్ఖాలాంటి వ్యక్తి చేతిలో టార్చి, లాఠీకర్ర పట్టుకుని అటు వచ్చాడు. మనిషి చాలా బలంగా వున్నాడు. నడుముకి రివాల్వర్ కట్టి వున్నది.

ఆ మనిషి తలుపులు మూసి వుండటం చూసి ఆశ్చర్యంగా వాటివైపు అడుగులు వేశాడు. కిరణ్ ఆ అవకాశాన్ని సద్వినియోగం చేసుకున్నాడు. జేబునించి రివాల్వర్ తీసి మడమతో అతని తలమీద కొట్టాడు. కిక్కురుమనకుండా గూర్ఖా నేలమీద పడిపోయాడు.

అతని మెడనరంమీద మరోసారి రివాల్వర్ మడమతో కొట్టాడు కిరణ్. అతను పూర్తిగా స్పృహతప్పిపోయాడని నిర్ధారణ చేసుకుని అతన్ని కీనీడలోకి లాగి చకచక అతని ఖాకీ గుడ్డలు తను వేసుకున్నాడు. హాట్ తీసి కళ్ళమీదుగా గుర్తు తెలియకుండా పెట్టుకున్నాడు. నడుముకి రివాల్వర్ వున్న బెల్టు కట్టుకున్నాడు. తన రివాల్వర్ని జేబులో పెట్టుకుని, లాఠీ, టార్చి రెండు చేతుల్లోను పట్టుకుని నడవాలో నడుస్తూ ఆ చివరివరకు వెళ్ళాడు.

ఎవరూ తనని గమనించటంలేదని నిర్ధారణ చేసు

వున్నాడు. గదులదగ్గర ఆగాడు. గూర్ఖా పేంటుజేబులో ఆ గదుల తాళాలగుత్తి వున్నది. దాంతో ఓ గది తాళం తెరిచాడు. లోపల దాదాపు యిరవైమంది ఆడవాళ్ళు పొడవాటి బల్లలమీద పరుండి వున్నారు. వాళ్ళు నిద్ర, మగతకాని స్థితిలో వున్నారు.

కిరణ్ వాళ్ళవంక జాలిగా చూశాడు. తలుపులు దగ్గరగా మూసి, తాళం పెట్టకుండా వదిలేశాడు. అలాగే తక్కిన గదుల తాళాలుతీసి చూశాడు. పది గదుల్లోను రెండువందలమూడుమంది ఆడవాళ్ళు పొడవాటి బల్లల మీద పరుండి వుండగా చూశాడు కిరణ్. తక్కిన ఆరు గుర్ని విలియమ్స్ వాళ్ళ యిళ్ళకు యిదివరకే పంపేశాడు. అంటే అందరు మహిళలు అక్కడే బందీలుగా వున్నారు. ఎక్కడికీ తరలించబడలేదు. అంతవరకు అదృష్టమే!

"జ్వాలాసింగ్, క్యాకర్ రహేఁ!" అని వినిపించింది వరండాలోనించి. కిరణ్ తృళ్ళిపడ్డాడు. గూర్ఖా పేరు జ్వాలాసింగ్ అయివుండాలి! ఆ గొంతు తనకు చిరపరిచిత మయినదే! అవును, సాయంత్రం తనకి గ్రౌండ్స్‌లో విని పించిన విలియమ్స్ గొంతు అది!

కిరణ్ పక్కగా అతన్ని చూసి, "లాక్ కర్ రహాఁ సాబ్!" అన్నాడు. జ్వాలాసింగ్ గొంతు తను వినలేదు. లోస్వరంలో అర్థం అయీ కాకుండా అన్నాడు.

ఆ కాస్త భేదాను విలియమ్స్ గుర్తించడని కిరణ్ భ్రమపడ్డాడు. కాని విలియమ్స్ ఆ భేదాని స్పష్టంగా గుర్తించాడని అతని ముఖం చూడగానే అర్థమయి పోయింది.

"హూ ఆర్యూ?" అన్నాడు విలియమ్స్. అతని గొంతులో ఉరుములు ఉరిమాయి.

# 10

కిరణ్ ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా రివాల్వర్ విలియమ్స్‌కి గురిచూసి, "స్టాప్ దేర్! ఐ విల్ షూట్ యూ!" అన్నాడు తీవ్రంగా.

విలియమ్స్ పగలబడి నవ్వాడు. "సింహం సరాసరి బోనులోకే నడిచివచ్చిందన్నమాట. సహభాష్ మిస్టర్ కిరణ్! బతికి బయటపడగలననే అనుకుంటున్నావా?" అన్నాడు.

క్షణాలమీద పదిమంది వ్యక్తులు చేతుల్లో తుపాకులు ధరించి వలయంలా వారిచుట్టూ నించున్నారు. కిరణ్ విస్తుపోయాడు. కాని వెంటనే నిలదొక్కుకున్నాడు.

"హల్లో ఇన్‌స్పెక్టర్" అన్నాడు విలియమ్స్ తల మీదుగా చూస్తూ కిరణ్.

విలియమ్స్‌తోబాటు పదిమంది అనుచరులు ఉలిక్కిపడి ద్వారంవేపు చూశారు.

స్ప్లిట్ సెకండ్!

ఒక్క అంగలో విలియమ్స్ వెనక్కి వచ్చేసి అతని కణతలకి రివాల్వర్‌ని గురిపెట్టి, "మిస్టర్ విలియమ్స్! నీ మనుషుల్ని తుపాకులు నేలమీద పడేసి వరసగా ఆ గోడపక్కగా చేతులెత్తి నించోమని ఆదేశించు. క్విక్!" అన్నాడు కిరణ్.

విలియమ్స్ పళ్ళు పటపట కొరికాడు. అతని కంఠం చుట్టూ కిరణ్ ఉక్కుచేయి బిగుసుకుంది. మరో చేతిలోని రివాల్వర్ అతని కుడి కణతకి గురిపెట్టి వున్నది. జీవన్మరణ సమస్య!

విలియమ్స్ ఆదేశం ప్రకారం అతని అనుచరులు గన్స్ నేలమీద పడేసి వరసగా పోయి గోడపక్కగా నించు

న్నారు.

విలియమ్స్ గింజుకోబోయాడు. "డోంట్ బి సిల్లీ విలియమ్స్. నీ చావును నువ్వే కోరి ఆహ్వానించకు" అన్నాడు కిరణ్.

ఇంతలోనే కిరణ్ వెన్నుమీద చల్లగా తగిలింది. అది రివాల్వర్ మొన అని అతనికి బాగా తెలుసు.

సన్నటిస్వరం, వీణ మీటినట్టులేదు, కర్కశంగావుంది. "మిష్టర్ కిరణ్! విలియమ్స్‌ని వదిలిపెట్టు. లేకుంటే నీ ప్రాణాలు నీవి కావు" అని వినిపించింది.

కిరణ్ మెరుపుకన్న వేగంగా ఆలోచిస్తున్నాడు.

ఆమె రిసెప్షనిస్టుగా పరిచయమయిన యువతి అయివుండాలి! బహుశా విలియమ్స్‌కి అన్ని విషయాల్లోను పార్ట్‌నర్ అయ్యుండొచ్చు.

కిరణ్ రివాల్వర్ నేలమీదకు వదిలేశాడు. ఎడమ చేయిపట్టు సడలించాడు.

అనుచరులు గోడపక్కనుంచి కదలబోయారు.

కాని యింతలోనే ఊహించని విధంగా జేబులోనించి తన రివాల్వర్ తీసి ఆమె చేతిమీద గట్టిగా కొట్టాడు కిరణ్.

అంతే, ఆమె చేతిలోని రివాల్వర్ ఎగిరి అవతల పడింది. దుడుకుగా ప్రవర్తించబోయిన ఓ అనుచరుడ్ని నిర్దాక్షిణ్యంగా కాల్చేశాడు కిరణ్. తక్కినవాళ్ళు సాహసించలేదు.

కిరణ్ విలియమ్స్ పక్కకి ఆమెనుకూడా లాగి నించోబెట్టి, "మిస్—నువ్వే తెలివయినదానివి కావు. నిన్ను మించినవాళ్ళు, నీ ప్రియుడ్ని తలదన్నేవాళ్ళు లోకంలో చాలామంది వున్నారని గుర్తుంచుకో!" అన్నాడు.

ఆమె సూటిగా చూసింది. ఆలేషియన్ కుక్కలు ఆవరణలో గట్టిగా మొరుగుతున్నాయి. కిరణ్ తన కోడ్‌వర్డు ఇన్‌స్పెక్టర్ శ్రీనువాస్‌కి చేరిందని గ్రహించాడు. ఆపదలో పడితే 'హల్లో ఇన్‌స్పెక్టర్!' అనే కోడ్‌వర్డు పంపుతానని ముందుగానే చెప్పాడు కిరణ్. జేబులో చెయ్యిపెట్టి వైర్లెస్ సెట్ ఆన్‌చేసి కోడ్‌వర్డు చెప్పాడు యిందాక. అప్పుడే విలియమ్స్‌తోబాటు అనుచరులుకూడా ద్వారంవైపు చూశారు. ఆ వర్డ్ రెండు విధాలా ఉపయోగపడింది.

"ఎవ్వరూ వున్నచోటునుంచి కదలొద్దు!" అంటూ మెల్లగా ద్వారంవైపు జరిగాడు కిరణ్. ఆవరణలో రెండుసార్లు కాల్పులు వినిపించాయి. కుక్కలు మొరగటం మానేశాయి. ఆ మరునిముషంలో తలుపుమీద చప్పుడయింది టకటకమని!

కిరణ్ తలుపులు తెరిచాడు.

ఇన్‌స్పెక్టర్ శ్రీనివాస్‌తోబాటు మఫ్టీలో వున్న పోలీసులు బిలబిలమంటూ లోనికొచ్చేశారు.

శ్రీనివాస్ విలియమ్స్ వంక నవ్వుతూ చూసి, "వెరీ గ్లాడ్ టు అరెస్ట్ యూ!" అన్నాడు.

విలియమ్స్ ముఖం కోపంతోను, అవమానంతోను ఎర్రగా అయిపోయింది.

పోలీసులు అనుచరుల్ని, ఆ యువతిని అదుపులోకి తీసుకున్నాక, విలియమ్స్‌ని చూసి అన్నాడు కిరణ్.

"లోపలి గదుల్లో వున్న ఆడవాళ్ళందరికీ వెంటనే విరుగుడు యింజక్షన్‌లు చెయ్యి. నువ్వు చెయ్యకపోయినా మా డాక్టర్లచేత చేయించగలను. డాక్టరుగా చివరిసారిగా నీ వృత్తికి న్యాయం చెయ్యి" అన్నాడు.

విలియమ్స్ తలవంచుకున్నాడు.

"మిస్టర్ విలియమ్స్బర్డ్! నువ్వు చేయతలపెట్టిన పని ఎంత హేయమైనదో, చట్టవిరుద్ధమైనదో ఒక్క క్షణం ఆలోచించావా? డాక్టరువై వుండి పవిత్రమైన ఆ వృత్తికి కళంకం ఆపాదించావు. నీకు మొదట్నుంచీ ఫెర్టిలిటీమీద పరిశోధించటం హాబీ అయితే కావచ్చు. దాన్ని యే కుందేలుమీదనో, కోతిమీదనో మరే జంతువుమీదనో ప్రయోగంచేసి చూడాల్సింది బదులు మానవ శరీరాల మీదే నీ ప్రయోగాలు ప్రారంభించావు. పచ్చటి కాపురాల్లో చిచ్చుపెట్టావు.

నీ ప్రయోగాలు వికటించి నలుగురు స్త్రీలు నాశనమయిపోయారు. ఇంకా నీ ప్రయోగం పాలబడ్డ యీ రెండువందల స్త్రీలలో యెంతమంది ఉన్మాదులు, మూగవాళ్ళు, బధిరులు శాశ్వతంగా గొడ్రాళ్ళు అయిపోతారో తెలియదు.

నీ ప్రయోగం బారినుంచి తెలివిగా తప్పించుకున్న వసంత అనే గృహిణిద్వారా మాకు నిజాలు తెలిశాయి. ఆమెను పరీక్షించిన ప్రసిద్ధ గైనకాలజిస్టు అసలు విషయం చెప్పింది.

నువ్వు స్త్రీలలో వంధ్యత్వం ఎలా వస్తుంది, దాన్ని ఎంతవరకు సరిచేయవచ్చును. అనే విషయమై పరిశోధనలు చెయ్యటానికి యీ స్త్రీలపై ప్రయోగాలు చేస్తున్నావని ఆమె చెప్పింది. అందుకోసమని వాళ్ళ యూటరస్ ఓపెన్ చేసి ఫెలోపియన్ ట్యూబ్స్ లోపలికి ఒక విధమైన రసాయనాన్ని ఇంజెక్టు చేసి ఫలితాలకోసం ప్రయోగాలు చేస్తున్నావని, అది వికటిస్తే ఆ స్త్రీలకు మతి స్థిమితం తప్పటం వంటి కాంప్లికేషన్స్ వస్తాయని ఆ డాక్టరమ్మ

చెప్పింది.

నువ్వు చేస్తూన్న ప్రయోగం ఎంత ప్రమాదకరమైనదో తెలిసికూడా ఆడవాళ్ళని మోసంచేసి, వాళ్ళకి సంతాన యోగముందో లేదో చెపుతానని ఆకర్షించుకుని ఇక్కడకు తెచ్చి నిర్బంధంగా ప్రయోగాలు చేస్తున్నావు. మొదట్లో నువ్వు అమెరికన్ డాక్టరువనుకున్నాను. కాని నువ్వు గత సాయంత్రం నన్ను బెదిరించినపుడు మాట్లాడిన ఆంగ్లం అమెరికన్ ఏక్సెంట్ కాదని అర్థంచేసుకున్నాను. నార్త్ ఇండియన్ ఏక్సెంట్ అని గుర్తించాను.

నీ పేరు విలియమ్స్ ర్డు కాదని ఘంటాపథంగా చెప్పగలను. డిస్టిల్డ్ వాటర్ తయారుచేసే మిషమీద ఇక్కడ రహస్యంగా యీ ప్రయోగాలు చేస్తున్నావు. నీ పరిశోధన ఫలితాలను హెచ్చు మొత్తంలో బహుశా కొన్ని కోట్ల రూపాయలకు విదేశాలకు అమ్ముకోవటానికి యిదంతా చేస్తున్నావు, అవునా?" అడిగాడు కిరణ్ సూటిగా విలియమ్స్ కళ్ళలోకి చూస్తూ.

విలియమ్స్ మౌనంగా తలూపాడు.

ఆ తర్వాత తన స్టేట్‌మెంట్‌లో, "నా పేరు జోషి. 'ఫ్రిజిడిటీయిన మేరీడ్ ఉమన్' అనే అంశంమీద పరిశోధన చేయటానికి అక్రమ మార్గంలో, పెళ్ళయి సంతానంలేని ఆడవాళ్ళని మోసపు ప్రకటనద్వారా రప్పించి చట్టవిరుద్ధ చర్యలకు పాల్పడ్డాను. పేరు, దాంతోపాటు కొన్ని కోట్ల విదేశీ మారక ద్రవ్యం అక్రమంగా సంపాదించాలనుకున్నాను. కాని ఘోరంగా విఫలమయ్యాను" అని చెప్పాడు.

—: అయిపోయింది: —

# సముద్రపు దొంగల ముఠా

కె. వి. రమణ

మధ్యధరా సముద్ర జలాలను రెండుగా చీలుస్తూ భారంగా ముందుకు సాగుతోంది 'సాగరకన్య' నౌక. నౌకలో ఇంజిన్, జనరేటర్లు చెవులు హోరెత్తే ధ్వనితో నిర్విరామంగా పనిచేస్తున్నాయి.

నౌక గమనాన్ని, వాతావరణ పరిస్థితిని ఒకమారు చూసుకొని తృప్తిగా తలపంకించాడు కెప్టెన్ రాజు. విశ్రాంతికోసం తన గది చేరాడు రాజు. సగం చదివి విడిచిన ఇంగ్లీషు నవలను తిరిగి చేతబట్టి సోఫాలో చతికిలబడ్డాడు.

కెప్టెన్ రాజు వయసు ముప్పైఅయిదేళ్ళు. అంత చిన్న వయసులో నిండా పదేళ్ళు సర్వీసు పూర్తికాకమునుపే నౌకలో అత్యున్నత స్థానమయిన కెప్టెన్ పదవి చేపట్టాడు రాజు. అరుదయిన ఈ విషయాన్ని కేవలం తన శక్తి సామర్థ్యాల మూలంగానే సాధించగలిగాడతను.

దీక్షగా నవలలో మునిగిపోయాడు రాజు. కథ రస

వ త్తరంగా సాగుతోంది. ఇంతలో "బజ్....జ్...." మంటూ గొడవచేసింది ఫోను. నవల ప్రక్కన పెట్టి ఫోనెత్తాడు రాజు. ఎటువంటి పరిస్థితిలోనూ విసుగూ, కోపం దరిచేరని వ్యక్తి రాజు. నిజానికి అతని విజయ రహస్యం కూడా అదే అంటారు అతణ్ణి తెలిసిన వ్యక్తులు.

రిసీవర్ చెవికానించి "హలో!" అన్నాడు రాజు.

"సర్! హెడ్‌క్వార్టర్స్ నుండి అర్జంట్ మెసేజ్. మీరు రావాలి" అదుర్దాగా పలికాడు చీఫ్ ఆఫీసర్ బల్వంత్ రాయ్.

"వస్తున్నాను!" ఫోన్ పెట్టి క్షణాలమీద వీల్ హౌస్‌లో వాలాడు రాజు.

హెడ్‌క్వార్టర్స్‌నుండి ఆ మెసేజిని స్వయంగా విన్నాడు రాజు. రాజుతోబాటు బల్వంత్, మరో ఇద్దరాఫీసర్ల మొహాలు గంభీరమయ్యాయి ఆ వార్త విన్న వెంటనే.

"ప్రస్తుతం 'సాగరకన్య' ప్రయాణం చేస్తున్న సముద్ర ప్రాంతం ఇక కొద్ది గంటల వ్యవధిలో భయంకరమయిన తుఫాను తాకిడికి గురికానున్నది" ఇదీ ఆ వార్త సారాంశం.

ఈ విషయం క్షణాలమీద సిబ్బంది అందరికీ తెలియ జేయబడింది. అందరూ లైఫ్ జాకెట్లు ధరించారు. సాగర జలాలు నౌకలో ప్రవేశించకుండా అన్ని ప్రవేశ ద్వారాలూ మూసివేయబడ్డాయి. కిటికీల అద్దాలు బిగించ బడ్డాయి. ఇవన్నీ నౌకలో ఒక నీటిచుక్కను సయితం పోనివ్వని విధంగా రూపొందించబడతాయి.

నౌక సిబ్బంది నిమిషాలు లెక్క పెడుతున్నారు. ఎవరూ పెదవి విప్పి మాటాడడం లేదు.

వాతావరణం క్రమేపీ మార్పు చెందసాగింది. ఆకాశం కారుమబ్బులు కమ్మింది. చిన్నగా ప్రారంభమయిన గాలీ-వానా కొద్దిసేపటికే వుధృతరూపాన్ని దాల్చింది. హోరుమనే శబ్దంతో వీస్తున్న గాలి బ్రహ్మాండమయిన ఆ నౌక గమనాన్ని క్షణానికొక దిశకు మారుస్తోంది. సముద్ర కెరటాలు ఒకదాని కొకటి పోటీపడుతూ 'సాగరకన్య' డెక్ మీద వీరవిహారం చేస్తున్నాయి.

సాగరకన్య పడుతూ లేస్తూ రెక్కలు తెగినపక్షిలా కొట్టుమిట్టాడుతోంది. ప్రకృతి బీభత్సానికి ఆ దృశ్యం పరాకాష్ట. ఇంతలో సముద్రంలో సుమారు రెండు తాడిచెట్ల ఎత్తున ఓ బ్రహ్మాండమయిన పోటు కెగటం సాగరకన్యకు ఓ ప్రక్కగా వచ్చి పైన పడింది.

అంతే! నౌక మొత్తం ఒకేసారి నీటిలోకి నొక్కి వేయబడింది.

## 2

కెప్టెన్ రాజా నీటిలో తేలేందుకు శక్తికొద్దీ ఈదుతున్నాడు. "కెప్టన్ సాబ్" వినపడిందో గొంతు దూరం నుండి అస్పష్టంగా. అటు తిరిగాడు రాజా.

పెద్ద కర్రదుంగను పట్టి వేలాడుతూ కనిపించారు బల్వంతిరాయ్. ప్రకాష్‌లు. వారిద్దరూ ఆ దుంగను రాజా దిక్కుగా తోసుకు వచ్చేందుకు శక్తికొద్దీ ప్రయత్నిస్తున్నా గాలీ కెరటాలు వారి ఉద్దేశానికి అడ్డు కట్ట వేస్తున్నాయి.

రాజా శక్తిని కూడగట్టుకొని అటు ఈదాడు. ఎట్టకేలకు దుంగను చేరుకోగలిగాడు. అదృష్టం ఆ రూపంలో వచ్చి వుండకపోతే రాజా పని ఇక అంతటితో సరి.

ఆ ముగ్గురూ కలిసి రవి, సునీల్ అనే మరో ఇద్దర్ని

కాపాడగలిగారు. మిగిలినవారు యేమయ్యారో, ఎటు కొట్టుకుపోయారో తెలియదు. ఐనుగురూ దుంగను అలా అంటిపెట్టుకొని గాలివాటున పోతున్నారు.

దారీ తెన్నూ లేని అనంత సాగర జలాలు! అకలిదప్పులు! ఆశనిరాశలు! ఎన్ని రాత్రులు ఎన్ని పగళ్ళు! లెక్క పెట్టే ఓపిక లేనేలేదు. అవసరం అంతకన్నా లేదు. ఎటు చూసినా నీరు....నీరు....నీరు. అందుకే కళ్లే తెరవడం మానుకున్నా రందరూ.

ఒక రాత్రి వేళ! సమయం వారిలో ఎవరికీ తెలియదు. దుంగను అంటి జీవచ్ఛవంలా వేలాడుతున్న ఒకరి కాళ్ళకు గట్టిగా తగిలిందేదో. త్రుళ్ళిపడుతూ తడిమిచూశాడు కాలివ్రేళ్ళతో ఇసుక నేల! నమ్మకం చాలక కాలితో తన్నాడు గట్టిగా. వుక్కిరి బిక్కిరవుతూ చుట్టూ చూశాడు. చెట్టు చేమలతో నిండిన ప్రకృతి. ఎత్తయిన కొండలు ఆ చీకటిలో లీలగా కనపడుతున్నాయి.

మొత్తంమీద తామేదో తీరాన్ని చేరుకున్నారు. లేని ఓపిక తెచ్చుకుంటూ ఆనందంతో అరచాడు గట్టిగా. మిగిలిన నలుగురూ వులిక్కిపడుతూ కళ్ళు తెరచారు.

"మనం తీరం చేరాం....తీరం చేరాం...అవిగో కొండలు. నేనిప్పుడు నేలమీద నిలబడి వున్నాను....హాహా హా...."
వావావా
దుంగను వదిలి గంతులు వేస్తున్నాడు బల్వంత్

బల్వంత్ మాటలు నమ్మలేనట్టు చుట్టూ చూశారంతా. నిజమే!

చెట్లు గాలికి వూగిసలాడుతూ వారికి స్వాగతం చెబుతున్నాయి. అవేవో పక్షులు కర్ణకఠోరంగా అరుస్తున్నాయి. అయినా ఆ స్వరాలు వారికి ఆ క్షణంలో

యెంతో వినసొంపుగా వున్నాయి. చీకటినిండి భయాన్ని రేకెత్తించే ఆ ప్రకృతి నయనానందకరంగా వుంది.

నీరసాన్ని ప్రక్కనపెట్టి వురుకులు పరుగులమీద తీరాన్ని చేరారంతా. గట్టిగా అరుస్తూ చిన్న పిల్లల్లా కేరింతలాడుతూ ఒకరినొకరు కౌగలించుకున్నారు. అయితే ఆనందపు సమయాన్ని అంతకుమించి ఎక్కువసేపు అనుభవించే అవకాశం వారికి లేకపోయింది.

కారణం! విపరీతమయిన చలి! శరీరాన్ని కోసుకుపోతున్నట్టు వీస్తున్న చలిగాలుల ధాటికి అప్పటికే నీటిలో బాగా నాని ఒరుసుకుపోయిన వారి శరీరాలు ఏమాత్రం తట్టుకోలేక పోతున్నాయి. వృత్తిరీత్యా వారందరూ నౌకలలో తిరుగుతూ ఎన్నో చలిప్రదేశాలను చూసివున్నారు. కానీ యింతటి దారుణమయిన చలి గాలుల్ని వారెన్నడూ చూడనేలేదు. ఇంతా చేసి మనుషుల్ని క్షణాలమీద గడ్డకట్టేటున్న మైనస్ డిగ్రీల టెంపరేచర్లో వున్న ఆ ప్రదేశంలో యెక్కడా ఒక మంచుగడ్డ సయితం లేకపోవడం విచిత్రం.

చలిబాధనుండి తమను కాపాడుకునేందుకు అప్పటికప్పుడు వారికో ప్రావరం అవసరమయింది. లేకుంటే గంటల్లో అందరి చావూ ఖాయం. ఒక వంక చలిలో గజగజలాడుతూనే తీర ప్రాంతంలోవున్న పర్వత సానువులను వారు గాలించారు.

ప్రకాష్ "అల్లదిగో అటు చూడండి, అక్కడేదో గుహలా వుంది" అనగానే అంతా అటు పరుగుతీశారు.

అదృష్టవశాత్తూ అదొక చిన్న గుహ! అందరు లోనికి ప్రవేశించారు. అయినా చలిగాలులు గుహలోకీ వీస్తున్నాయి. చెప్పాలంటే ఆ గుహ సయితం ఓ ఏ. సి.

రూమ్‌ని మించి వుంది.

"బల్వంత్ ముందా గుహ ద్వారాన్ని మూయాలి మనం. లేకుంటే ఈ చలి మన ప్రాణాల్ని తోడేస్తుంది" అన్నాడు రాజు. అదీ నిజమే! అప్పటికే వారి శరీరాలు వంకరులు పోతున్నట్టున్నాయి.

గుహ ముఖద్వారం అంత పెద్దదేం కాదు. అందరూ కలసి తలో రాయి పెద్ద పెద్దవి తెచ్చి గుహ ద్వారానికి అడ్డంగా గోడలా పేర్చేశారు. ఇప్పుడు గుహలోకి దూసుకువచ్చే చలిగాలులు బాగా తగ్గిపోయాయి.

తలో మూలకుపోయి కాళ్ళూ చేతులూ ముడుచుకు కూర్చున్నారు. గుహ అప్పటికే బాగా చల్లనయి వున్న కారణంగా వారికి ఇంకా చలిబాధ తీరలేదు. రాజు లేచి గుహంతా కలయతిరిగాడు. గాలివాటున లోపలికి కొట్టుకువచ్చిన ఎండుటాకులు కాళ్ళకు ఒత్తుగా తగులుతున్నాయి.

రాజు ఓపిగ్గా వాటిని ఏరి ఒకచోట పోసాడు. పెద్ద కుప్ప తయారయింది. రెండు రాళ్ళు గట్టివి ఏరి తెచ్చి కొద్దిపాటి ఆకులమీద ఆ రాళ్ళను రాపాడించి మంట సృష్టించాడు. అందరూ మంట చుట్టూ చేరారు. కొద్ది కొద్దిగా ఆకుల్ని మంటలో వేస్తూ చలికాగారంతా. కొద్ది సేపట్లో గుహకూడా బాగా వెచ్చనయింది. చలిబాధ తీరింది.

ఆ వెంటనే నేనున్నానంది ఆకలిబాధ. అయినా తిరిగి గుహ బయటికి వెళ్ళాలంటే వీలుపడేదేం కాదు. ఆ వెచ్చదనమే అప్పటికి తమ పెన్నిధిగా తృప్తిపడుతూ కడుపుల్లో కాళ్ళుపెట్టుకు నిద్రపోయారంతా.

# 3

తెల్లవారింది. అంత చలీమంత్రం వేసినట్టు మాయమయింది. గుహా ద్వారానికి అడ్డం పెట్టిన రాళ్ళను తొలగిస్తూ బయటపడ్డారంతా. తిండి తిని ఎన్నిరోజులయిందో కడుపులో మంటలు రేగుతున్నాయి.

ఆహారాన్ని వెతుకుతూ బయల్దేరారు. చూడగా అదో విచిత్ర ద్వీపంలా వుంది. కంటపడ్డే వృక్షజాతులన్నీ ఇంచుమించు వాళ్ళకు తెలిసినవే. కాని వాటిలో కొన్ని ప్రత్యేకతలున్నాయి. ఆకులు బాగా తక్కువగా వుండి చెట్లన్నీ దాదాపు మోడుల్లా వున్నాయి. పక్షులూ అంతే! పావురాలు సయితం కర్ణకఠోరంగా భయంకరంగా అరుస్తున్నాయి. కింద నడుస్తున్న రాజు బృందాన్ని తీక్షణంగా నిర్లక్ష్యంగా చూస్తున్నాయి.

"శేట్వెన్ సాబ్! చూశారా వాటిని. ఇక్కడ పరిస్థితి నాకేం అర్థం కావడంలేదు" అన్నాడు బల్వంత్.

నవ్వాడు రాజు. "కొత్తవాళ్ళంగదా యెవరికయినా తేలికే మరి" అన్నాడు.

"ఇంతకూ ఈ దీవి యే ప్రాంతానికి చెందినదో మీ రేమయినా చెప్పగలరా?" అడిగాడు బల్వంత్.

పెదవి విరిచాడు రాజు. "నా వుద్దేశ్యం ఇది ఇంతవరకూ వెలుగులోకి రాని ప్రాంతం. చూడగా మనుషులెవరూ వుండే అవకాశం లేదనిపిస్తోంది" అన్నాడు.

నడుస్తున్నవాడల్లా చటుక్కున ఆగి మాట్లాడవద్దన్నట్టు సైగచేశాడు రాజు. అందరూ ఎక్కడివారక్కడే నిలబడిపోయారు. నల్లని కుందేళ్ళు రెండు కాస్సంత దూరంలో పొదల చేరువన నిద్రపోతూ కనిపించాయి. రూపంలో తప్ప మామూలు కుందేళ్ళకూ వీటికీ పరిమా

ణంలో పోలికే లేదు. ఒక్కొక్కటీ యెంతలేదన్నా ఇరవై కేజీల బరువుంటుంది.

బల్వంత్ "మై గాడ్! ఎంత పెద్దదో" అన్నాడు ఆశ్చర్యంగా గొణుగుతూ.

రాజు సైగచేయగా బల్వంత్ ప్రకాష్‌లు ఒక దిక్కు రవి సునీల్ మరో దిక్కు వెళ్ళారు. రాజు ఒక్కడే ముందుకు కదిలాడు నెమ్మదిగా. ఆ రెండు జట్లూ పొదల వెనకనుండి కమ్ముకు వస్తున్నారు. కుందేళ్ళు ఎటు పరుగెత్తినా వారికి చిక్కక తప్పదు.

బల్వంత్ జట్టు ఓ అడుగు ముందు చేరిందక్కడికి. వారిద్దరూ కుందేళ్ళను తామే పట్టాలన్న ఉత్సాహంతో ఒకేసారి వాటిమీద పడ్డారు. నిద్రలో వున్న కుందేళ్ళు చటుక్కున్న కళ్ళు తెరచి మెరుపుతీగల్లా ప్రక్కకు గెంతాయి. బల్వంత్, ప్రకాష్‌లు నేలమీద బోర్లా పడ్డారు.

ఇక ఆ క్షణంలో కుందేళ్ళు తమ బారినుండి తప్పించుకు పోయినట్టేనని భావించారంతా. కానీ కుందేళ్ళు పారిపోలేదు సరికదా వారంతా నిశ్చేష్టులయ్యేట్టు గుర్రుపెడుతూ వారిమీద తిరగబడ్డాయి. అప్పటికే నేలమీద వొర్లి మోచేయి మడుకులూ కొట్టుకుపోయిన బల్వంత్ ప్రకాష్‌లమీద పడ్డాయవి.

అందిన చోటల్లా వారిద్దరినీ గోళ్ళతో రక్కుతూ పండ్లతో కండలు చీల్చివేసే ప్రయత్నం చేస్తున్నాయి. బల్వంత్ ప్రకాష్‌లు ఊహించని రీతిలో కుందేళ్ళు తమ మీదకు దాడి జరపడంతో పరిస్థితిని తట్టుకోలేకపోతున్నారు.

అప్పటికి ఆశ్చర్యంనుండి తేరుకున్న మిగిలిన ముగ్గురూ

వెనకనుండి కుందేళ్ళమీద పడ్డారు. అయినా బెదరలేదవి. అందరికీ సమాధానం చెబుతూ పొట్టేళ్లలా కలయతిరుగుతున్నాయి కుందేళ్ళు. రాజుకి వాటిని ఒకేసారి నరికి పారేయాలన్నంత కోపం వచ్చింది. అప్పుడే జ్ఞాపకం వచ్చిందతనికి తన జేబులో అహర్నిశలూ వుండే ఫోల్డింగ్ నైఫ్.

క్షణమయినా ఆలస్యం చేయక చాకుతీసి కుందేళ్ళను దొరికినచోటల్లా పొడిచేశాడు రాజు. కుందేళ్ళు రెండూ నిర్జీవంగా నేలమీద పడిపోయాయి.

బల్వంత్ ఒంటికి అంటిన దుమ్ము దులుపుకుంటూ "థాంక్యూ కెప్టెన్ సాబ్! మీ దగ్గర ఆ చాకు వుండడం నిజంగా మన అదృష్టమే. లేకుంటే ఈ పాడు మృగాలు మనలో కొందర్ని పీక్కుతినేవి" అన్నాడు.

"అది సరే! ఇంతకూ ఇదేం వింత. కుందేళ్ళకు ఇంత సాహస మేమిటి?" ఆశ్చర్యంగా అన్నాడు ప్రకాష్.

చాకుకు అంటిన రక్తాన్ని చెట్ల ఆకులకు తుడుస్తూ "బహుశా అది ఈ దీవి మహాత్యం కావచ్చు" అన్నాడు రాజు.

అప్పటికప్పుడు నిప్పు తయారుచేసి కుందేళ్ళను కాల్చి తిన్నారు. అందరూ కడుపునిండా తినగా ఇంకా మిగిలిపోయింది మాంసం. "దెబ్బలుతింటే ఏం కుందేళ్ళు మాంసం అద్భుతం" అన్నాడు బల్వంత్ దేక్కుపోయిన ముడుకులు తడుముకుంటూ.

ఆకలి బాధ తీరింది. కానీ అంతలోనే మరో బాధ వచ్చి పడింది. సూర్యుడు పైకి వస్తున్నకొద్దీ వాతావరణం క్రమేపీ వేడెక్కుతూ గాడ్పులు ప్రారంభమయ్యాయి.

మిట్టమధ్యాహ్నమయ్యేసరికి వాతావరణం దారుణంగా

మారిపోయింది. చెట్ల నీడలో వున్నా ప్రయోజనం లేక పోతోంది. వేడిగాలులు శరీరాన్ని వుడికిస్తున్నాయి.

రాజు బృందం పూరకే పిచ్చికుక్కల్లా తిరుగుతున్నా రక్కడికక్కడే. చెప్పాలంటే రాత్రి చలిబాధను మించిపోయింది బాధ. ఆ వేడికి తగ్గట్టు శరీరం యే మాత్రం చెమటపోసినా కొంత ఉపశమనం కలిగేది. కానీ అదేం విచిత్రమో అంత వేడిలోనూ చెమటపట్టలే దెవరికీ.

వారందరి బాధా ఒక ఎత్తూ! బల్వంత్ రాయ్ బాధ మరింత హెచ్చు. అతడిది ఎనభై అయిదు కేజీల భారీ విగ్రహం మరి. అపసోపాలు పడుతూ "ప్రపంచంలో కెల్లా అధిక ఉష్ణోగ్రతను కలిగిన సహారాలోని అజీజీయా ఈ లెక్కన చల్లని ప్రదేశం" అన్నాడాయన. ఆ రోజంతా గడిపి సాయంత్రాన్ని చూసేసరికి వారికి తాతలు దిగివచ్చారు.

సాయంత్రం కాగానే చలిభూతం నేనున్నా నంటూ అప్పుడే వారలు పంపుతోంది. చిన్నగా ప్రారంభమయ్యాయి చలిగాలులు. అందుకు వారంతా ముందుగానే సిద్ధపడుతూ ఓ గుహను వెదకి కగ్రాకంపా చేరవేసారందులో. చీకటి పడుతుండగా చలిగాలులు వుధృతమయ్యాయి. గుహలో సెగడు ప్రారంభమయ్యింది.

మంటలో ఒక్కొక్క కర్ర వేస్తూ "ఈ వాతావరణంలో మనం ఇలా ఎన్నాళ్లో బ్రతకలేమిక్కడ. ఇది మరీ మారుమూల దీవి కాబట్టి మనకు బయటనుండి సహాయం వచ్చే మాటకూడా కల్లగా తోస్తోంది నాకు. అందుకని మనం ఇక్కడే ఏదోలా కాలం వెళ్ళబుచే. కన్నా దీవి లోపలికి వెళ్ళడం మంచిదని నా ఉద్దేశం.

లోపల ఈ వాతావరణమయినా మారొచ్చు. మన అదృష్టం బాగుండి మరొక చేదన్నా జరగవచ్చు" అన్నాడు రాజు అందరివంకా చూస్తూ మీరేమంటా రన్నట్టు.

బల్వంత్ రాయ్ తల ఊపుతూ "నా మనసులో మాట కూడా అదే కేప్టెన్ సాబ్" అన్నాడు మిగిలిన ముగ్గురూ అంగీకారంగా తలవూపారు.

రాజు "మంచిది. మనమంతా ఒకే అభిప్రాయాన్ని కలిగివుండడం సంతోషం. అయితే ఇక్కడ మనం గమనించవలసిన విషయం ఒకటుంది. వుదయం కండేళ్ళ పరిస్థితిని బట్టి ఈ దీవిలో మిగతా జంతువుల సాహసాన్ని మనం అంచనా వేసుకోవచ్చు. అందుకు కారణం ఇక్కడి అసాధారణ వాతావరణమేనని నా ఉద్దేశం. దారుణమయిన ఇక్కడి పరిస్థితులకు అనుకూలంగా మనమూ మారాలి. తప్పదు. ఎటువంటి కష్టాన్నయినా అందరం కలిసే ఎదర్కోవాలి. చావో బ్రతుకో అందరం ఉమ్మడిగానే స్వీకరిద్దాం" అన్నాడు.

అందరూ రాజు మాటలకు అంగీకారం తెలుపుతూ చేతులెత్తారు. "కేప్టెన్ సాబ్! మేమంతా మీమాటను అనుసరిస్తాం. మృత్యువు తప్ప మనల్ని వేరుచేసేది ఏదీ లేదు" అన్నారంతా.

"మంచిది. మనం తిరిగి మన దేశంలో అడుగు పెడతా మన్నది నా దృఢ విశ్వాసం. అయితే ఒకమాట. ఇక మీదట మనలో భేదాలు హెచ్చుతగ్గులు వుండకూడదు. కాబట్టి మీరంతా నన్ను మీలో ఒకడిగానే భావించి రాజు అని పిలవండి. సాబ్ గీబ్ వద్దు" అన్నాడు రాజు నవ్వుతూ.

బల్వంత్ రాయ్ హుషారుగా "అచ్ఛా సాబ్!" అంటూ వెంటనే పొరపాటు గ్రహించి నాలుక కరచుకున్నాడు. రాజుతో సహా అందరూ నవ్వేశారు పెద్దగా.

## 4

రాత్రి గడచి కొద్దిగా వెలుతురు వస్తుండగానే గుహ వదలి పెట్టారంతా.

అప్పటికి చలి కొంచెం ఎక్కువగానే వుంది. ఎండ ఎక్కువ కాకమునుపే సాధ్యమయినంత దూరం వెళ్ళాలన్నది వారి ఉద్దేశం. రాజు ఓ మోస్తరు బలమయిన చెట్టుకొమ్మల్ని విరిచి వాటి ఒక కొనను తనవద్దనున్న చాకుతో సూదిగా చెక్కాడు. వాటిని తలా ఒకటి పట్టుకున్నారు ఆయుధాలుగా.

దారిలో లేళ్ళూ దుప్పులూ అటూ యిటూ తిరుగుతూ కనిపిస్తున్నాయి. ఒకొక్కటి మన ప్రాంతంలో వుండేదున్నల్లా బలిసి వున్నాయి. తల ఎత్తి చెవులు రిక్కిస్తూ తమ మధ్యకొచ్చిన ఈ వింత ప్రాణుల్ని ఆశ్చర్యంగా చూస్తున్నాయవి. అంతే తప్ప బెదిరి పారిపోలేదవి. ఒకచోట వారి దారికడ్డంగా వున్న అటువంటి జంతువుల్ని తప్పుకు పోతున్నారు. వాటిని అలా చూస్తుంటే కడుపులో కదులాడే ఆకలి గుర్తొచ్చి బాధగా వుంది వారికి. కానీ రాజు ముందే చెప్పాడు వారికి.

"మరీ తప్పనిసరి పరిస్థితుల్లో తప్ప ఏ జంతువు జోలికీ పోవద్దు మనం. అలాగని మనం ప్రతిదానికీ భయపడుతున్నామని మీరు చిన్నబోనవసరంలేదు. ప్రస్తుతం మనలో ఎవరూ గాయపడే పరిస్థితిని కోరి తెచ్చుకోకూడదు. అదే జరిగినవాడు మిగిలిన వాళ్ళకు ఇబ్బందేగాక తొంద

రగా కోలుకునే పరిస్థితి కూడా లేదు" అన్నాడు.

సాధ్యమయినంతవరకూ తిండికోసం పళ్లూ కాయలు దుంపల మీదే ఆధారపడే ప్రదేశంతో దారిలో ఎదురయే అటువంటి వాటిని పోగుచేస్తూ ముందుకు సాగుతున్నారు వారు.

సూర్యుడు క్రమేపీ పైకెక్కుతూ వుండగా గాలి వెచ్చదనాన్ని పుంజుకోసాగింది. దారిలో చెట్లు సమృద్ధిగా వున్నచోట ఆగిపోతూ "ఇప్పటికి ఇక్కడే ఆగిపోవడం మేలు" అన్నాడు రాజా.

అంతా చెట్లనీడలో విశ్రమించి దారిలో సంపాయించిన పళ్ళూ కాయలూ పంచుకుతిన్నారు. ఇంచుమించు మూడు గంటలు గడిచేవరకూ వేడిమిలో నరకయాతనపడ్డారు. తర్వాత వేడిగాలులు తగ్గుముఖం పడుతుండగా ప్రయాణం కొనసాగింది.

ఓ అరగంట నడిచారలా. ఇంతలో గజిబిజిగా కొన్ని విచిత్ర స్వరాలు వినపడ్డాయి వారికి. చెవులు రిక్కించారంతా. వెనక్కి తిరిగి చూశారు. వారు నడిచి వచ్చిన దారిలో ధూళి రేగుతూ తమ దిక్కుగా కదలివస్తోంది.

"ఏమిటది?" అడిగాడు బల్వంత్ ఆందోళనగా.

అతడి మాటలు పూర్తికాకమునుపే ఆ స్వరాలు స్పష్టంగా వినపడ్డాయి.

రాజా పెద్దగా "పరుగెత్తండి. క్విక్. అవి తోడేళ్ళు" అని అరిచాడు. అసరికే తోడేళ్ళ మంద స్పష్టంగా కనిపించింది వారికి. తోడేళ్ళు వాయువేగంతో వస్తున్నాయి. వాటికి మనుషుల గాలి సోకినట్టుంది. వేగాన్ని పెంచాయి.

ప్రాణాలు అరచేతుల్లో వుంచుకొని పరుగుతీస్తున్నారంతా. కనుచూపుమేరలో చెట్లేవీ లేవు. అంతా రాళ్ళూ

రప్పలతో నిండిన మిట్టప్రాంతమది. తోడేళ్ళు ఇంచు మించు దగ్గరకొచ్చేసాయి. వాటితో సమానంగా పరుగెత్తగల శక్తి మనుషుల కెక్కడిది? అలాగే లెక్కకు మించి వున్న ఆ మందను యెదిరించే అవకాశమూ లేదు. గుంపులుగా తిరిగే సింహాలు సయితం ఆకలిబాటలో సాగే తోడేళ్ళ మందకు అడ్డుగా వెళ్ళే సాహసం చెయ్యవు.

చుట్టూ చూశాడు రాజు. బాగా ఎత్తయిన బండరాతిని చూపిస్తూ "అంతా దాన్ని ఎక్కండి" అన్నాడు. సుమారు ఏదెనిమిది అడుగులు ఎత్తులో వుందాబండ. తోడేళ్ళ బారినుండి తమనుతాము రక్షించుకు నేందుకు అంతకుమించి మరో దారే లేదక్కడ. అందరూ ఆ వూపున ఎగిరి బండరాతిమీదకు చేరిపోయారు.

బల్వంత్ ఒక్కడే భారీ శరీరం కారణంగా ఎక్కలేకపోయాడు. బండమీద జారిపోతున్న అతని చేతుల్ని పట్టుకున్నాడు రాజు. మిగిలిన ముగ్గురూ బల్వంత్ చేతుల్ని పట్టి అతన్ని పైకిలాగే ప్రయత్నంలో వుండగా అదే సమయానికి మందలో ముందున్న తోడేళ్ళు అతన్ని సమీపించేసాయి.

ఒక తోడేలు బల్వంత్ పేంటు చివర్న పట్టుకుంది. అయినా పట్టు విడవకుండా తోడేలును బల్వంత్ తో సహా పైకి లాగేసారు ఆ నలుగురూ. పేంటు మధ్యలో చిరిగి ఆ ముక్కతో బాటు కింది పడింది తోడేలు.

తోడేళ్ళు బండరాతిమీదకు ఎగిరేందుకు ప్రయత్నిస్తున్నాయి. అవి ఇంచుమించు పైకి వచ్చిరావడంలో తిరిగి కిందకు జారిపోతున్నాయి. పరుగెత్తే కార్యక్రమంలో అందరి చేతుల్లో వుండే సూదికర్రలు దారిలోనే

జారిపోయాయి. రాజు ఒక్కడి దగ్గరే వుంది చాకు. వారందరికీ వున్న ఆయుధం అదొక్కటే ఇప్పుడు. రాజు చాకును చేతబట్టి అందరికీ ముందున్నాడు.

తోడేళ్ళు రెండు ఏదోలా కష్టపడి బండ మీదకు రాగలిగాయి. రాజు ఏమాత్రం ఆలస్యం చేయక వాటిని అందిన ప్రతిచోటా పొడిచేశాడు. బల్వంత్ అదే సమయంలో వాటిని తిరిగి మందలోకి తన్ని తోశాడు. రక్తధారల మధ్య గిలగిల కొట్టుకుంటున్నాయి ఆ తోడేళ్ళు రెండూ. కొద్ది క్షణాల్లో తోడేళ్ళ మంద రాజు బృందంమాటే మరచి మృత్యుముఖంలో వున్న తమ నేస్తాలమీద విరుచుకుపడింది. ఒకదానితో ఒకటి పోటీపడుతూ తోడేళ్ళన్నీ ఆ రెండు తోడేళ్ళనూ చీల్చుకు తినసాగాయి.

అదే తాము తోడేళ్ళ బారినుండి తప్పుకుపోయే సమయమని భావించి రాజు బృందం చడీ చప్పుడు లేకుండా వెనకనుండి బండరాయి దిగి పరుగు అందుకుంది. తీవ్రమైన ఎండనూ వేడిగాలుల్ని లెక్కచెయ్యకుండా ఇక ముందుకు అడుగు వేయడం సాధ్యపడదన్నంతవరకూ వారలా పరుగెడుతూనే వున్నారు.

చిన్న సెలయేరొకటి ప్రవహిస్తూ వారి దారి కడ్డం వచ్చింది. ఏరుదాటి అవలి ఒడ్డు చేరారంతా. కడుపు నిండా నీళ్ళు తాగి వేడి తాపం తగ్గేలా స్నానాలు చేశారు. దాపున వున్న చెట్ల నీడలో విశ్రమించారు. వారి దృష్టి మాత్రం అనుక్షణం తాము వచ్చిన తోవమీదే వుంది. అయితే తోడేళ్ళు కానరాలేదెక్కడా.

“ప్రస్తుతానికిక వాటిప్రమాదం మనకు లేనట్టే” అన్నాడు రాజు. అంతా దీర్ఘంగా నిట్టూర్చారు.

వేడి తీవ్రత కొద్దిగా తగ్గగానే తిరిగి ప్రయాణం కొన

సాగింది. సాయంత్రం వరకూ ఏ అడ్డంకీ లేకుండా గడిచింది. "ఇక యే గుహో గూడో చూసుకోవాలి" నిట్టూరుస్తూ అన్నాడు బల్వంత్ రాయ్. అప్పటికి చలిగాలులు తమ రాకను కొద్దికొద్దిగా ప్రారంభించాయి.

## 5

వెతికి వెతికి ఒక కొండచరియలో వున్న గుహను కనిపెట్టారు.

గుహ బయట అంతా గడ్డి, చిన్న చిన్న మొక్కలూ గజిబిజిగా వుంది ఆ ప్రదేశం. రాజు ముందు నడుస్తున్నవాడల్లా గుహ ప్రవేశ ద్వారం ఇంకా ఓ పదడుగులు వుందనగా ఆగిపోయాడు. నేలమీద ఏదో జంతువు పాదాల గుర్తులు! అవన్నీ ఇంచుమించు గుహలోకే దారితీశాయి.

చీకటి పడేందుకు ఇక ఎంతో వ్యవధి లేదు. ఆ పరిస్థితిలో మరో గుహను వెదుక్కోవడం కష్టంతో కూడిన పని. అలాగని గుహలో అడుగుపెట్టేందుకు ధైర్యమూ చాలడంలేదు.

ఈ గుర్తులు యే మృగానివో తెలియదు. అడుగుల్ని బట్టి చాలా పెద్ద జంతువే అనిపిస్తోంది. కొంచెం కష్టపడితేనేం మరో గుహను వెతుక్కోవడమే క్షేమం. ఆ భావనతో అందరూ వెనక్కి తిరిగేంతలో వూహించిన ప్రమాదం రానే వచ్చింది గుహ లోపలినుంచి.

సుమారు మూడడుగుల ఎత్తూ ఐదడుగుల పొడవూ వున్న సింహం జూలువిదిలిస్తూ నిలిచి వుంది. ఏనుగుతలంత వుంది దాని తల. శరీరంలో ఎక్కడా ఎముక కనపడనంత బలిష్టంగా భయంకరంగా వుంది. పట్టణాలలోని సర్కస్ సింహాలను మాత్రమే చూసివున్న వాళ్ళంతా ఆ సింహాన్ని

చూసి అదిరిపోయారు. ఎవరికీ ఏదీ తోచక ఎక్కడి వాళ్ళక్కడ కొయ్యబారిపోయారు.

సింహం అప్పుడే ఆహారంకోసం బయల్దేరినట్టుంది. బాగా ఆకలిమీద వున్నట్టు దాని వాలకమే చెబుతోంది. రెండడుగులు ముందుకు వేసింది.

"ఎవరూ వెనుతిరిగే ప్రయత్నం చెయ్యొద్దు." సింహం మీదనుండి దృష్టి మరల్చకుండానే అన్నాడు రాజు హెచ్చరికగా. సింహం మరీ చేరువలో వుంది. వెన్ను చూపితే దానికి మరింత లోకువ కావడం తప్ప తమలో కొందరయినా హతంకాక తప్పరు. ఈ పరిస్థితిలో దానితో వీరోచితంగా పోరాడి చావడమే మేలు. ఒకరిద్దరు మిగిలినా ఏదో నాటికి ఇలాంటి దిక్కుమాలిన చావే తప్ప మరో దారేదీ లేదిక్కడ. అందరి ఆలోచనలూ ఒకేలా వున్నాయి. ఎవరూ ఓ అడుగన్నా వెనక్కి నడవలేదు.

సింహం గడ్డిదుబ్బుల మీదుగా మరో రెండడుగులు వేసింది. ప్రత్యర్థులు స్థిరంగా నిలుచోవడం దానికీ అయోమయంగా వుంది. సింహం మరో అడుగువేసింది. కోరలు చాచి గుర్రుమంది.

హఠాత్తుగా గడ్డిపొదలో ఏదో కదలిక "బుస్స్.... స్స్...."మనే గాలిచప్పుడూ వినపడింది. సింహం ఉలిక్కిపడుతూ ప్రక్కకు గెంతింది. అదే సమయంలో గాల్లోకి విసురుగా లేచిన నల్లని సర్పాకృతి సింహం ముంగుకాలు మీద తన తలతో రెండుసార్లు పొడిచింది. దెబ్బతిన్న సింహం కోపంతో గర్జిస్తూ సర్పంమీదకు దూకింది.

కారు నలుపులో ఉండే ఆ విషసర్పం మోచేతి లావున ఏడూ లేక ఎనిమిదడుగుల పొడవున నిగనిగ

లాడుతోంది. సింహం దాని తలను చటుక్కున కొరికి పారేసింది. విషసర్పం తలా మొండెం వేరయి కొట్టుమిట్టాడుతూ ఉండగా విజయగర్వంతో రాజు బృందం కేసి తిరిగింది సింహం.

విషసర్పం కాటుపడిన కాలు ఎక్కడిదక్కడే ఉండిపోగా సింహం ప్రక్కకు పడిపోయింది. సింహం తిరిగి లేచేందుకు ప్రయత్నించింది. ఫలించలేదు. సింహం ఆకృతిలో అప్పటికే మార్పు వచ్చేసింది. బూడిదరంగు వర్ణం క్రమేపీ నల్లబడి పోతోంది. విషం క్షణాలమీద పనిచేసింది. సింహం నురగలు కక్కుతూ ప్రాణాలు విడిచింది.

రాజు బృందం హాయిగా నిట్టూర్చింది. "మనం చాలా అదృష్టవంతులం. చెప్పాలంటే ఈ సింహం చేతిలోనో, పామువల్లనో మనలో కొందరయినా చావాల్సిన వాళ్ళం" అన్నాడు బల్వంత్ రాయ్ నుదుటపట్టిన చెమటను తుడుస్తూ.

రాజు గుహలో వెళుతూ వుండగా "ఇంక లోపల ఏమీ లేవకదా?" అన్నాడు ప్రకాష్ అనుమానంగా.

రాజు నవ్వుతూ "ఆ భయమేదీ అక్కర్లేదు. సింహం నివసించే గుహలో మరో ప్రాణి అడుగుపెట్టదమే!" అన్నాడు.

రాజు చెప్పినట్టుగానే లోపల మరే జంతువూ లేదు. కాకపోతే ముక్కులు అదిరే గబ్బు వాసన దారుణంగా ఉంది. అయినా తప్పదు. బయట చలిలో చచ్చేకన్నా ఇది నయమే కదా. కొద్దిసేపట్లోనే వారు ఆ వాసనకు అలవాటు పడిపోయారు.

## 6

అలా నాలుగయిదు రోజులు సాగింది వారి ప్రయాణం.

ఈ లోగా వాతావరణంలో చెప్పుకోదగ్గ మార్పు వచ్చింది. మునుపటిలా చలీ వేడీ లేదిక్కడ. అంతా ఎర్రని బుగ్గి నేల. గాలివీ నేచాలు పైకి లేస్తోంది ఎర్రని ధూళి. ఆ ప్రదేశంలో ఓ అరగంట నడిచినందుకే అందరూ ఎఱ్ఱమట్టిలో కొట్టుకుపోయినట్టు తయారయ్యారు.

"ఛీ! ప్రపంచంలోని దరిద్రమంతా ఈ దీవి పుణికి పుచ్చుకుంది...." చిరాకుపడిపోయాడు బల్వంత్. ఇంతలో రణగొణ ధ్వనులతో కొన్ని పరిచిత స్వరాలు వినపడి ఉలిక్కిపడ్డారంతా.

"చచ్చాం! ఆ పిశాచాలు మనల్ని వదల్లేదింకా. పరుగెత్తండి" అరిచాడు బల్వంత్ ఆందోళనగా.

బల్వంత్ తన మాటల్ని పూర్తిచేస్తున్నంతలో ప్రత్యక్షమయ్యాయి తోడేళ్ళు. పొట్టలు వెన్నముకకు అంటివుండగా చోరలు విరుచుకొని వాయువేగంతో దూసుకువస్తున్నాయి.

రాజు బృందం శక్తికొద్దీ పరుగుతీస్తోంది. చెట్టూ చేమ మాటేలేదు. కనీసం రాయి రప్పయినా జాడలేదు. ఈసారి తోడేళ్ళ బారినుండి పడక తప్పదేమోననే భయం రాజు బృందాన్ని పీడిస్తోంది. అయినా బ్రతుకు తీపి వారిని ముందుకు పరుగెత్తిస్తోంది. తోడేళ్ళు తమ వేగాన్ని క్రమేపీ పెంచుతున్నాయి.

తోడేళ్ళకూ రాజు బృందానికీ మధ్యదూరం బాగా తగ్గిపోయింది. ఐదుగురూ ఆయాసంతో రొప్పుతున్నారు. కాళ్ళు బిగుసుకుపోయి అడుగులు తడబడుతున్నాయి

"తమ పని అయిపోయిందిక" అనుకున్నారంతా.

ఇంతలో వారి దారికి అడ్డంగా ప్రవహిస్తూ ఒక నది ప్రత్యక్షమయింది. నదిలో నీరు కొంచెం ఎర్రగా వుంది. సుమారు నూటయాభై అడుగుల వెడల్పుంటుందా నది. నదికి అవల కోటగోడల్లా నిలువుగా వున్నాయి నలభై యాభై అడుగుల ఎత్తులో కొండరాళ్ళు. అవతల వాటిని ఎలా అధిరోహించాలనే ఆలోచనే లేకుండా రాజు బృందమంతా వరుసగా నదిలో దూకేసారు.

తోడేళ్ళు ఓ క్షణం ఆలస్యంగా ఒడ్డు చేరాయి. రాజు వెనక్కి తిరిగి చూశాడు. తోడేళ్ళుకూడా నదిలో దిగితే తమకిక వేరే దారిలేదు. అయితే ఏం అదృష్టమో తోడేళ్ళు నీటి ఛాయలకే రాలేదు. "బ్రతుకు జీవుడా" అనుకున్నారంతా.

ఈదుతూ ముందుకు సాగుతున్నారు. ఇప్పుడు వారి ఆలోచనంతా నిట్టనిలువుగా వున్న ఆ కొండరాళ్ళను ఎక్కడెలా? అనే.

అయితే, తోడేళ్ళబారినుండి తప్పించుకునే ఆత్రంలో నదిలో దిగుతూ, ఒడ్డున దట్టంగా ఉన్న పొదల్ని వారు గనక మొదటే గమనించి వుంటే నదిలో దిగడంకన్నా తోడేళ్ళతో పోరాటమే నయమనే వారు. ఏమయితేనేం ఇప్పుడు వారికా అవకాశమేలేదు. నదిలో కలిగిన అల జడికి పొదలమధ్య నిస్త్రాణంగా నిద్రపోతున్న మొసళ్ళలో అలజడి చెలరేగింది.

ఇంచుమించు పదిహేనూ ఇరవై అడుగుల పొడవున్న మొసళ్ళు ఓ పాతిక వరకూ వున్నాయక్కడ. వాటిల్లో ఓ పదికి తక్కువలేకుండా చకచకా ఉరికాయి నీటిలోకి.

నీటిమట్టానికి సమతలంగా బాణాల్లా తమ వెనక దూసుకువ స్తున్న ఆ మొసళ్ళను ముందుగా చూసింది రాజు. తోడేళ్ళు తమతోబాటు నది నీటిలో యెందుకు అడుగు పెట్టలేవో అప్పుడర్థమయిందతనికి.

"ఈదండి త్వరగా! మొసళ్ళు!" అరిచాడు రాజు.

అందరూ వులిక్కిపడుతూ తలలు వెనక్కి తిప్పారు. గుండెలు బేజారై తిపోగా మరింత వేగంగా ఈదసాగారు. ఎంతలేదన్నా తీరం ఓ అరవై అడుగుల్లో ఉంది. మొసళ్ళు తమకంటే ఓ ఇరవై అడుగులు వెనకబడి ఉన్నాయి. మహా అయితే మరో నిమిషమో అరనిమిషమూ! అయిపోయింది తమ పని. ఇన్ని కష్టాలుపడి ఇంత దూరం వచ్చి చివరకు ఆ మొసళ్ళ నోటిలో దారుణమయిన చావు..వునూుమంటున్నాయి అందరి మనసులూ.

మొసళ్ళు దరిదాపు కొచ్చేసాయి. వినవస్తోంది నీటిలో వాటి చప్పుడు. వెనక్కి తిరిగి చూసే ధైర్యం లేదెవరికీ. ఆ చల్లని నీటిలో సయితం చెమటలుపట్టే అనుభూతి!

ఇంతలో వినవచ్చాయి "ఢాం....ఢాం...." అంటూ దిక్కులు అదిరేలా తుపాకీల చప్పుళ్ళు. గుళ్ళుఇంచుమించు వారికి వెనగ్గా సరాసరి దూసుకుపోతున్నాయి ఎడ తెరిపిలేకుండా. ఏం జరుగుతోంది. ఎక్కడి నుండి ఆ తుపాకీల మోత! అంతా అయోమయంగా వుంది.

ఆత్రంగా వెనక్కి తిరిగి చూశారంతా! మొసళ్ళు కొన్ని నీటిమీద తేలుతున్నాయి వెల్లకిలా. మరికొన్ని మృత్యువు వాతపడి గిజగిజలాడుతున్నాయి. ఆ ప్రదేశమంతా వాటి రక్తంతో ఎర్రనయి ఉంది. మొసళ్ళలోయే ఒక్కటీ మిగలకుండా చచ్చినట్టే లెక్క.

ఆనందం పట్టలేక రాజా బృందం ముందుకు సాగారు. కొండరాళ్ళ మీద నిలుచుని సుమారు పదిహేనుమంది వ్యక్తులు చేత తుపాకులు ధరించి వుండడం కనిపించింది. రాజు బృందం కృతజ్ఞతగా చేతులు ఊపారు. ఈదుతూ వారంతా బండరాళ్ళను సమీపించగానే పైనుండి తాటి నిచ్చెనలు వేశారా వ్యక్తులు. రాజా బృందం నిచ్చెనల ద్వారా పైకిచేరారు.

బాగా పెరిగిన గడ్డాలూ మీసాలూ....దృఢంగా వున్నారందరూ. ఛాతీకి అడ్డంగా తూటాలతో నిండిన బెల్టులు ధరించారు. ప్రతిఒక్కరి చేతిలోనూ తుపాకి, నడుముకు పెద్ద కత్తి వేలాడుతున్నాయి. ధరించిన దుస్తులు మట్టి కొట్టుకుపోయి వున్నాయి. ఏ ఒక్కరి మొహంలోనూ నవ్వు లేశమయినా లేదు. చూపులు కఠినంగా భయం గొలిపేట్టున్నాయి.

రాజా బృందం మొహాలమీద వెలిగే చిరునవ్వు మాయమయ్యింది. వీళ్ళు సముద్రపు దొంగలు! చెప్పాలంటే వీరికన్నా ఆతో దేళ్ళు, మొసళ్ళే ఒకింత నయం.

వారిలో ఒకడు ముందుకొచ్చి అర్థంకాని భాషలో ఏదో అడిగాడు. రాజు బృందం మొహాలు చూసుకున్నారు. వాడే తిరిగి "ఇంగ్లీష్!" అన్నాడు. అది మీకు తెలుసా అన్నట్టు. తెలుసన్నట్టు తలూపాడు రాజు. వాడు తన మనుషుల్లో మరొకణ్ణి పిలిచాడు.

ఆ వ్యక్తి ఇంగ్లీషులో "మీ రెవరు, ఇక్కడికెలా వచ్చారు" అని ప్రశ్నించాడు. రాజు అతడికి తమ కథ యావత్తూ సవివరంగా చెప్పాడు. ఆ వ్యక్తి మొదటి వ్యక్తికి రాజు చెప్పింది తమ భాషలో వివరించాడు. ఆ మాటలు అతనికి సంతృప్తి కలిగించినట్లున్నాయి.

మానంగా తల వూపుతూ ఏదో చెప్పాడు.

అతడు చెప్పిన మాటల్ని అనువదిస్తూ రెండో వ్యక్తి ఇంగ్లీషులో "మిమ్మల్ని మా బాస్ ముందు హాజరు పెడతాం. ఏం జరిగేదీ అతడే నిర్ణయిస్తాడు" అన్నాడు రాజుతో. రాజు నిట్టూరుస్తూ తల ఊపాడు. తల ఊపక చేసేదంలేదు. కాదంటే కాళ్ళూ చేతులూ నరికి తీసుకు పోతారు.

సముద్రపు దొంగలు రాజు బృందంలో ప్రతిఒక్కరినీ శోధించి రాజు దగ్గర వుండే ఒకే ఒక చాకును తీసుకున్నారు. ముందూ వెనక సాయుధులయిన సముద్రపు దొంగలు వారిని అనుసరించగా బయల్దేరారు.

ఇంచుమించు అంతా రాళ్ళూ పర్వతాలతో నిండిన ప్రదేశమది. పైకి కనపడని విధంగా ఆ పర్వత సానువుల్లో రహస్య స్థావరాలు నిర్మించబడ్డాయి. కీలకమయిన ప్రదేశాల్లో అక్కడక్కడా సాయుధులయిన వ్యక్తులు పహారా కాస్తున్నారు. సముద్రపు దొంగలు ప్రతిచోటా గుమిగూడి రాజు బృందాన్ని వింతగా చూస్తున్నారు.

అలా చాలాదూరం నడిచారు వాళ్ళు. ఓ ఫర్లాంగు దూరంలో సముద్రం కనిపిస్తోంది. "అంటే తామిప్పుడు దీవి అవలిఒడ్డు చేరామన్నమాట" పరిసరాలను ఆసక్తిగా గమనించసాగాడు రాజు.

వృక్షాలు అసలు ఎండ ఏమాత్రం చొరశక్యం కానంత దట్టంగా వున్నాయక్కడ. వాటి దిగువన కొన్ని పక్కా ఇళ్ళు నిర్మించబడ్డాయి. రాజు బృందాన్ని సముద్రపు దొంగలు అటువంటి ఒక గృహంలో బంధించి వెళ్ళిపోయారు. ఆ గృహాన్ని నలుగురు సాయుధులయిన వ్యక్తులు కాపలా కాస్తున్నారు.

కొంత సేపయ్యాక తిరిగి తెరవబడ్డాయి తలుపులు. పెద్ద పెద్ద పళ్ళాలతో లోనికి వచ్చారు కొందరు. వాటిని గదిలో వుంచి తలుపులు వేసేశారు. పళ్ళాలనిండా వేయించిన కోడి మాంసం, గుడ్లూ, పళ్లూ వున్నాయి. ఆకలి జ్ఞాపకం వచ్చింది వారికి. బాధలన్నీ మరచి వాటి మీద విరుచుకుపడ్డారు ఐదుగురూ.

## 7

మరుసటి రోజు ఉదయమే వారిని బాస్ దగ్గరికి తీసుకుపోయారు సముద్రపు దొంగలు.

రూసో! వారి నాయకుడు. పర్వతంలా వున్నాడు. ఏనాడూ దువ్వెన, నూనె అనే మాటే లేనట్టు ముళ్ళ పొదలా వుందా తల. గడ్డం మీసాలూ అంతే! తెగ బారెడున్నాయి.

రూసోకి వివరాలన్నీ ముందే తెలిసినట్టున్నాయి. "మీలో కేప్టెన్ ఎవరు?" అని ప్రశ్నించాడు. నేను అన్నట్టు తలూపాడు రాజు. మిగిలిన వాళ్ళను సయితం పరిచయం చేశాడతనికి.

"గుడ్!" నవ్వాడు రూసో.

"కేప్టన్! మాకిది నిజంగా నమ్మశక్యం కాని విషయం. వెదుకపోయిన తీగ కాళ్ళకు తగిలినట్టుంది. చెప్పాలంటే మేమిప్పుడు మీలాంటి వాళ్ళకోసం ఎన్నో విధాలుగా ప్రయత్నిస్తున్నాం. విచిత్రంగా మీరే మా వద్దకు వచ్చారు" అన్నాడు రూసో ఇంగ్లీషులో.

రూసో మాటలు వారెవరికీ అర్థంకాలేదు. అయోమయంగా చూశారతని వేపు. రోసో నవ్వుతూ "మీకంతా వివరంగా చెబుతాను. నా వెంటరండి" అంటూ కుర్చీలో నుండి లేస్తూ "ఒక విషయం. మీరిప్పుడు మా గెస్టులు.

ఎటువంటి భయాలూ లేకుండా మీరిక్కడ నిశ్చింతగా వుండొచ్చు" అని చెప్పి నడిచాడు ముందుకి.

రాజు బృందం అతన్ని అనుసరించింది. వారి వెంట సాయుధులయిన రూసో బాడీగార్డులు ఇద్దరు నడిచారు.

అలా నడుస్తూ వారంతా ఒక విశాలమయిన షెడ్డు ముందాగారు. రూసో ముందుగా నడుస్తున్న వాడు ఒక్కసారి వెనక్కి తిరిగి రాజుతో "ఇక్కడ మాకిదో పెద్ద ఎమ్యూజ్ మెంట్ ప్లేస్. మనసు మరీ చికాకుగా వున్నా, పట్టరాని ఆనందంతో నిండివున్నా ఇక్కడికి వస్తాను" అన్నాడు పెద్దగా నవ్వుతూ. రూసో నవ్వినపుడల్లా వారంతా ఉలిక్కి పడుతూనే వున్నారు. "వీడూ వీడి నవ్వూనూ ఎలుగ్గొడ్డు వెధవ" మనసులో విసుక్కున్నాడు బల్వంత్.

రూసో షెడ్ లో అడుగుపెట్టాడు. రాజు బృందం అతని వెంట నడిచింది లోనికి. చాలా పెద్ద హాలది. లోపల దృశ్యాల్ని చూసి కొయ్యబారి పోయారంతా.

రూసో మాటల్నిబట్టి అక్కడన్నీ యేవేవో సుందర దృశ్యాలను వూహించుకుంటున్న రాజు బృందానికి ఆ దృశ్యాలను చూసి నిజంగానే మతిపోయింది.

హాలు సగభాగం ఒడలు గగుర్పాటు చెందే దారుణ మయిన విషసర్పాలున్నాయి. అవన్నీ బలమయిన విశాల మయిన అద్దాల కేసుల్లో బుసలుకొడుతూ తిరుగుతున్నాయి. ఒకచోట ఇనపవూచల బోనులో సుమారు పదిమీటర్లు పొడవున బ్రహ్మాండమయిన కొండ చిలువ అప్పుడే బోనులో వదలిన పొట్టేలుమీద పడబోతోంది.

కొండచిలువ బలమయిన అరటిబోదెను మించిన లావుంది. పొట్టేలు తెల్లని బొచ్చుతో అందంగా వుంది.

కొండచిలువ బారినుండి తప్పించుకుపోయే ప్రయత్నంలో బోను చుట్టూ పరుగులు పెడుతోంది.

కొండచిలువ పొట్టేలును తన తోకతో కాళ్ళమీద కొట్టింది. బలమయిన వ్యక్తి మోచేతంత లావుంది దాని తోక చివర. పొట్టేలు దభీలున పడింది కింద. పొట్టేలు తిరిగి లేచేలోగా కొండచిలువ తన తోక భాగాన్ని దాని శరీరానికి నాలుగు చుట్లు చుట్టింది.

పొట్టేలు దీనంగా అరుస్తోంది. రూసో ఆనందం పట్టలేక చప్పట్లు చరిచాడు. షెడ్డు పై కప్పు ఎగిరేలా నవ్వసాగాడు.

కొండచిలువ తోకను తనవద్దకు లాక్కుంటోంది. పొట్టేలు శరీరం చుట్టూ కొండచిలువ శరీరం చుట్లు మరింత ఎక్కువయ్యాయి' చుట్లు బిగుసుకుంటున్నాయి బలంగా. పొట్టేలు శరీరం వాటిల్లో నలిగి నుజ్జయిపోయింది. కొండచిలువ తన నోటిని చాచింది. కోరలూ నాలుకా వెలువడి ఆ నోరు పర్వత గుహలా యెర్రగా మెరుస్తోంది. కళ్ళు జ్యోతుల్లా మెరుస్తున్నాయి.

పొట్టేలు ఆ నోటిలో సునాయాసంగా పట్టేసింది. కొండచిలువ శాంతించింది. నెమ్మదిగా సర్దుకొని ఓ మూలకు చేరి ప్రశాంతంగా ఏమీ ఎరగనట్టు, అసలీ లోకమే తనకు తెలియనట్టు నిద్రపోతోంది.

“అద్భుతం కదూ!” సంబరంగా అన్నాడు రూసో. రాజు బృందం యెవరూ మాట్లాడలేదు. తలలు ప్రక్కకు తిప్పుకున్నారు.

రూసో నవ్వుతూపోయి ఓ అద్దాల షో కేసులాంటి దానిముందు నిలుచున్నాడు. నల్లని అకుపురుగుల్లాంటివి, వేల సంఖ్యలో షో కేసు లోపల అద్దాలమీద ప్రాకుతూ

అసహ్యంగా వున్నాయి చూసేందుకు. సుమారు అంగుళం పొడవూ అరంగుళం మందం వున్నాయి.

ఇంతలో ఏడుపులు, అరుపులతో కూడిన స్త్రీ స్వరం వినపడింది. అంతా అటు తిరిగారు. ఇద్దరు దున్నపోతు ల్లాంటి వ్యక్తులు ఓ స్త్రీని బలవంతంగా ఈడ్చుకొస్తు న్నారు. ఆమె శరీరంమీద యెటువంటి ఆచ్ఛాదనా లేక దిగంబరంగా వుంది. ఆమె దుస్థితి చూసి రాజా పిడికిళ్ళు ఆవేశంతో బిగుసుకున్నాయి.

బల్వంత్ తొందర కూడదన్నట్టు తన చేతిని రాజా భుజంమీద వేసి నొక్కాడు. ఆ యువతి శరీరం యేదో పసరు పూసినట్టు పచ్చగా వుంది.

బల్వంత్ వణికే స్వరంతో చెబుతున్నాడు నెమ్మదిగా. "రాజా! ఇదొక పైశాచిక కృత్యం. అద్దాల కేసులో వున్నవి ఆఫ్రికా అడవుల్లో వుండే ఒక రకమయిన పురుగులు. నిజానికి అవి మనుషులకు హాని కలిగించేవేం కావు. అయినా వాటి స్పర్శ మానవ శరీరానికి నరక ప్రాయం. ఇపుడామె ఒంటిన పూసిన పసరు వాసన ఆ పురుగులకు మహా ప్రీతి. వాసనబట్టి పురుగులు శరీరం మీద ప్రాకుతూ వుంటాయి. ఆ స్పర్శ కారణంగా మనిషి శరీరం విపరీతమయిన సలుపూ మంటకు లోనవుతుంది. ఎలాంటి మనిషయినా తన శరీరంమీద ఇటువంటి పురుగును ఒక్కటంటే ఒక్కటి భరించలేని పరిస్థితుల్లో ఇన్ని పురుగులు ఒకేసారి పైనబడితే....ఓహ్....ఊహించు ఆ బాధ...." అన్నాడు బాధగా.

యువతి చేతుల్ని తాళ్ళతో కట్టి వాళ్ళిద్దరూ ఆమెను బలవంతంగా అద్దాల కేసులో తోసేసారు. ఆమె భయంతో పురుగుల్ని చూస్తూ అరుస్తోంది. పురుగులు

వందల సంఖ్యలో ఆమె శరీరాన్ని ఎగబ్రాకుతున్నాయి. ఆమె బాధ భరించలేక గెంతుతోంది. ఏడుస్తోంది. పురుగులు ఆమె శరీరాన్ని పూర్తిగా ఆక్రమించేసాయి. ఆ స్థితిలో రూసో ఆనందం మరి చెప్పనలవికాదు. సంతోషంతో వూగిపోతూ గంతులు వేస్తున్నాడు.

రాజా బృందం కళ్ళు మూసుకున్నారు బాధగా. అవతల ఆ యువతి అరచి అరచి స్పృహ తప్పి పడిపోయింది. ఆమె శరీరం కిందపడి ఎన్నో పురుగులు నలిగి నాశనమయ్యాయి. అయినా లెక్కచెయ్యకుండా వున్న ఆ పురుగులు ఆమె ఒంటిని ఇంకా అంటిపెట్టుకునే తిరుగుతున్నాయి.

సున్నితమయిన ఆమె శరీరం ఆ బాధను తట్టుకోలేక రెట్టింపు వాచిపోయింది. మల్లెపూవులాంటి దేహం కంది పోయి ఎర్రగా మారింది. నోటినుండి నురగలు వస్తున్నాయి. ఆ స్థితిలో ఆమెను లోనికి నెట్టిన వ్యక్తులు తిరిగి ఆమెను బయటకు తెచ్చారు. గ్లౌజులు తొడిగిన చేతులతో ఆమె ఒంటిమీద వున్న పురుగుల్ని ఏరి అద్దాల కేసులో వేసారు. ఇంత జరుగుతున్నా ఆమెలో ఉలుకూ పలుకూ లేదు. చచ్చిన దానిలా పడి వుంది.

"ఆమె చనిపోయిందా?" అనుమానం దాచుకోలేక అడిగాడు రాజా నెమ్మదిగా.

ఫకాలున నవ్వాడు రూసో. "ఒక్క రోజుకే ఈమె చనిపోతే మరి రోజా మాకు గడిచేదెలా?" అన్నాడు అదో పెద్ద జోక్‌లా తిరిగి మరోసారి నవ్వుతూ. వాణ్ణి అక్కడికక్కడే బట్టలు విప్పి ఆ అద్దాల కేసులో తోసేద్దామన్నంత కోపం వచ్చింది వారందరికీ. కోపాన్ని బలవంతాన నిగ్రహించుకొని రూసో పిలుస్తున్నా వినకుండా

బయటకు వచ్చేశారంతా.

రూసో వారిని వెన్నంటి వచ్చి బయట నిరాశగా "మీకు ఇంకా ఎన్నో చూపించాలనుకుంటే తొందరపడి వచ్చేసారు. ఏం చేస్తాం. మరి నడవండి. పోదాం" అంటూ ముందుకు దారితీసాడు. రాజు బృందం మాట్లాడకుండా అతణ్ణి అనుసరించింది.

రూసో ఈ దృశ్యాలను తమకిప్పుడు యెందుకు చూపించినట్టు? తను తమద్వారా ఏదో సాధించాలని చూస్తున్నాడు. అందుకు తాము అభ్యంతరం చెప్పకుండా వుండేందుకు ముందుగానే హెచ్చరిస్తున్నాడన్నమాట! ఇంతకీ యేమిటా కార్యం?

రూసో వారిని సముద్రతీరం వెంబడి నడిపించాడు. తీరాన్ని ఆనుకొని వున్న రెండు పర్వతాల మధ్య సముద్రపు నీటితో యేర్పడి వుందొక కాలువ. కాలువ అంచున సహజంగా కొండరాళ్ళతో జెట్టీలాంటిది వుంది. రాళ్ళమధ్య ఖాళీలను మట్టితో పూడ్చారు. ఆ జెట్టీకే కట్టబడి వుందొక డెస్ట్రాయర్ యుద్ధ నౌక. పేరు హెర్క్యులిస్. నౌకమీద సాయుధులయిన సముద్రపు దొంగలు పహారా కాస్తూ అటూ యిటూ తిరుగుతున్నారు. పర్వతాల మధ్య వున్న కారణంగా యుద్ధనౌక పైకి కనపడదు సాధారణంగా. అదీగాక పర్వతాలు సయితం దట్టమైన చెట్లతో నిండివున్నాయి.

రాజు ఆశ్చర్యపోతూ "ఇది మీకెలా లభ్యమయింది?" అన్నాడు.

ఆ ప్రశ్నకు పొట్టపెకిలిందికి లబలబలాడేలా పకపక నవ్వాడు రూసో. "సముద్రపుదొంగలకు నీటిలో అసాధ్యమంటూ వుండదు. ఇదొక అమెరికన్ యుద్ధ నౌక.

చెప్పాలంటే అదో పెద్ద కథ.

నిజానికి యుద్ధ నౌకలతో సహా ఎటువంటి నౌకలూ ఈ దీవి చుట్టుప్రక్కలకు రావు. సముద్రయానానికి అనుకూలంకాని ప్రమాదభరితమయిన మార్గమిది. ఇక్కడ సముద్ర గర్భంలో వుండే నూదికొండలు ఈ ప్రాంతానికి పరిచయమున్న వ్యక్తులకే తెలుస్తాయి. అలా పొరపాటున వచ్చిన నౌకలెన్నో నూదికొండలకు బలయిపోయాయి.

అందుకే నావికులు ఈ పరిసరాల పేరు చెబితేనే హడలిపోతారు. పూర్వం ఎప్పుడో బ్రిటిష్ సైన్యాలు ప్రాణాలకు తెగించి చిన్న చిన్న పడవలమీద దండెత్తి వచ్చి మా పూర్వీకుల్ని దొరికినవాడినల్లా చంపేసారు. పిల్లా పీచూ ముసలీ ముతకా అనే తేడా లేకుండా బ్రిటిష్ సైనికులతో వీరోచితంగా పోరాడారు మా వాళ్ళు.

బ్రిటిష్ సైనికులు సంఖ్యలో మా వాళ్ళను మించి వున్నారు. అధునాతనమయిన ఆయుధాలతో సర్వసన్నద్ధంగా వచ్చారు. వాళ్ళ ధాటికి తట్టుకోలేక మా వాళ్ళు చెల్లాచెదురయ్యారు. చచ్చిన వాళ్ళు చావగా బహు కొద్దిమంది మాత్రం తప్పించుకోగలిగారు. అటువంటి వారిలో మా తండ్రి ఒకడు. నాలుగేళ్ళ పసివాడినయిన నన్ను వీపున యెక్కించుకొని సముద్రంలో దిగిపోయాడు. అలా ఏకధాటిగా ఒక రాత్రంతా నన్ను వీపున మోస్తూ నీటిలో ఈదాడాయన. ఇక మా పని క్షణాల్లో వుందనగా తెల్లవారు జామున ఒక చిన్న బోటులో పోతున్న మా జాతివాళ్ళే మమ్మల్ని కాపాడారు.

నా తల్లీ తదితర స్త్రీలు ఈ దీవిమీదే బ్రిటిష్ సైనికులకు దొరికిపోయారు. వారందరినీ ఆ కసాయివాళ్ళు

సామూహికంగా చెరచి మరీ చంపేసారు.." ఆ మాటలు చెబుతూ రూసో ఆవేశంతో వణికిపోయాడు. పిడికిళ్ళు బిగించాడు....

"మిస్టర్ రాజా! అదే పని మావాళ్ళు చేస్తే క్రూరత్వమంటారు. అనాగరికమంటారు. కానీ ఆ నీచపు పని బ్రిటిష్ నాగరిక సైనికులు చేసింది గనక లోకమంతా వారిని మెచ్చుకుంటూ సముద్రపు దొంగలకు సరయిన శాస్తి జరిగిందని పండుగ చేసుకుంది.

నిజమే! మావాళ్ళు కసాయివాళ్ళే. అనాగరికులే. కాదనను. కానీ నాగరికులు మాత్రం చేసిందేమిటి? అందుకే చిన్నతనంనుండీ నేను ఈ నాగరిక లోకంమీద ద్వేషంతో పగతీర్చుకునే ఉద్దేశంతో పెరిగాను. కానీ అది నా ఒక్కడివల్లనూ జరిగే పనికాదని అనుభవం వలన గ్రహించి అతికష్టంమీద యెక్కడెక్కడో వున్న మావాళ్ళనందరినీ ఏకం చేసాను.

అందరం కలసి ఈ దీవి పైన మా పూర్వ నివాసాలను పునరుద్ధరించాం. పెద్ద చెక్కపడవ నొకదానిని సంపాదించి దారినపోయే నౌకలను దోచుకోసాగాం. కానీ ఎన్నాళ్ళిలా? సముద్రపు జీవితం చాలా చికాకులతో కూడినది. అనుక్షణం ప్రమాదకరమయింది. అందుకే ఈ జీవితాలకు స్వస్తిపలికి మేమందరం నాగరిక ప్రపంచంలో అడుగుపెట్టాలని నిశ్చయించుకున్నాం. అయితే అక్కడా మా పని దోచుకోవడమే! ఆ రకంగా మా చిరకాల వాంఛ.... అదే నాగరికులమీద పగతీర్చుకోవడంకూడా నెరవేరినట్టవుతుంది. జీవితంలో వెరైటీ సయితం వుంటుంది.

నాగరిక ప్రపంచంలో ఇంతమందితో కలసి మేం

నిలదొక్కుకోవాలంటే మాకు మొదట డబ్బు పెట్టుబడి బాగా వుండాలికదా? అందుకే సమయంకోసం ఎదురు చూస్తూ వున్నాం.

ఈ యుద్ధనౌక ఆ మధ్య నెలరోజులుగా సముద్రంలో తిరుగుతూ ఇంచుమించు ప్రతిరోజూ మాకు యెక్కడో ఒకచోట యెదురవుతూ వుండేది. మేం సముద్రంలో తిరిగేటపుడు ఏ నౌకమీదన్నా దాడిచేసేటప్పుడు తప్ప మిగిలిన సమయాల్లో చేపలు వేటాడే పడవల్లో జాలరుల్లా వుంటాం. అందుకే మమ్మల్ని గుర్తించలేదెవరూ.

ఇదిలా వుండగా మాకో వార్త తెలిసింది. ఒక పాసింజర్ నౌకద్వారా కనడా ప్రభుత్వానికి చెందిన సుమారు వందకోట్లు విలువచేసే బంగారం రవాణా కాబోతుందన్నదే ఆ వార్త సారాంశం. ఆ బంగారాన్ని యేదోలా స్వాధీనం చేసుకోగలిగితే చాలు మా జీవితాశయం నెరవేరే దారి దొరుకుతుంది.

బంగారం రహస్యంగా రవాణా అవుతోంది గనక పెద్దగా సెక్యూరిటీ వుండే అవసరం గురించి ఆలోచించలేదు. మహా వుంటే పది పదిహేనుమంది అదీ యే సివిల్ డ్రస్‌లోనో కాపలా వుంటారు. ప్రయాణీకుల నౌక గనక జనం ఎక్కువగా వుంటారు. వారినీ ఏదోలా మేనేజ్ చేసుకోవచ్చుననుకుంటే నౌకను ఆపడం ఎలా? అన్నదే సమస్య!

భారీ నౌక గనక, మా చెక్కబోటు ఒక విధంగా బలమయిందే అయినా దానిముందు నిలవలేదు. ఆ పరిస్థితిలో మాకు జ్ఞాపకం వచ్చిందీ యుద్ధనౌక. దీనిని గనక స్వాధీనం చేసుకోగలిగితే చాలా ప్రయోజనాలు చేకూరుతాయి. అందుకే బాగా ఆలోచించి ఓ పథకం

వేసి బయల్దేరాం. రెండ్రోజుల్లోనే యెదురయింది మాకిది.

అప్పటికి సాయంత్రమయి కొద్దిగా వెలుగు మిగిలి వుంది. మేం మా నౌకను ఆపి, సహాయపడవలసిందిగా జెండాలు ఎగరేసాం. మేము ఏదో ఆపదలో వుండి సహాయం కోరుతున్నామనుకున్నారు యుద్ధనౌకలో సిబ్బంది. మావాళ్ళుపైన పదిమందే వున్నారు. మిగిలిన వాళ్ళంతా సుమారు నూటనలభై మంది లోపల రహస్య గదుల్లో దాక్కొన్నారు. యుద్ధ నౌక మా ప్రక్కనే వచ్చి ఆగింది. అందరం జాలర్ల వేషాల్లో వున్నాం. మచ్చుకి కొన్ని చేపలు కూడా డెక్ మీద పడివున్నాయి.

'ఏమయింది?' అన్నాడు యుద్ధనౌక కేప్టన్.

'ఇంజిన్ చెడిపోయింది. ఏదన్నా తీరంచేర్చి పుణ్యం కట్టుకోమని' దీనంగా అడిగాం! యుద్ధనౌకలోనుండి పది మంది సాయుధులయిన సైనికులు మా ఓడమీదకు వచ్చి అంతా తనిఖీచేసి వెళ్ళారు. రహస్య గదులు చాలా పకడ్బందీగా వుంటాయి. మరో పదిమంది తనిఖీచేసినా బయటపడవవి.

మా ఓడ యుద్ధ నౌకకు జోడింపబడింది. రెండూ కలిసి బయల్దేరాయి. అర్ధరాత్రి గడిచాక యుద్ధనౌకలో అంతటా సద్దుమణిగింది. డెక్ మీద ఇద్దరు ముగ్గురు కాపలా సైనికులు మాత్రం వున్నారు. వాళ్ళను గుట్టుచప్పుడు కాకుండా కత్తులతో పొడిచి సముద్రంలో తోసేశాం. మావాళ్ళు ఒకరొకరే వెళ్ళి నౌకలో కీలక ప్రదేశాలు చేరి నా ఆజ్ఞలకోసం ఎదురుచూస్తున్నారు.

మొట్టమొదటగా కంట్రోల్ రూమ్, కమ్యూనికేషన్స్ పానల్ రెండుచోట్లా ఒకేసారి దాడి జరిపి వాటిని మా

స్వాధీనంలోకి తెచ్చుకున్నాం. వాటి సిబ్బందిని అక్కడి కక్కడే పొడిచి చంపేసాం. అప్పుడు మా వాళ్ళంతా యుద్ధనౌకలోని విశ్రాంతి గదుల్లో వున్న సైనికులమీద దాడిజరిపి ఒక్కడుకూడా మిగలకుండా తుపాకులతో కాల్చి చంపారు. మేం ఇంత పకడ్బందీగా పోరాటం జరిపినా మావాళ్ళు ఓ ఇరవై మంది చనిపోయారు. ఏమయితేనేం యుద్ధనౌక మా స్వాధీనంలోకి వచ్చింది.

వెంటనే యుద్ధనౌకకు సంబంధించి, నేవీ హెడ్ క్వార్టర్స్ కు; ఏదో ప్రమాదం హఠాత్తుగా సంభవించి హెర్క్యులిస్ సముద్రంలో మునిగిపోతున్నట్టు లాస్టు మెసేజ్ పంపాం.

నౌకల్ని నడపడంలో కాకలుతీరిన సమరులు మాలో ఓ ఆరుగురున్నారు. వారి ఆధ్వర్యంలో హెర్క్యులిస్ ఇదిగో ఇక్కడికి చేర్చబడింది. ఇంతకూ దురదృష్టమేమి టంటే ఆ ఆరుగురూ నాలుగురోజుల క్రిందట ఓ బాంబు ప్రమాదంలో మా కళ్ళముందే చచ్చారు. వారితోబాటు మరికొంత మంది చనిపోయారనుకోండి. అది అంత చెప్పు కోదగ్గ కష్టమేం కాదు.

ఎటొచ్చీ బంగారంతో కెనడా నౌక మరో ఐదు రోజుల్లో రాబోతుంది. ఈ సమయంలో హెర్కులిస్ ని నడిపే సమరులు మాకు లేరు. ఇదే చికాకుతో మేం సత మతపడుతున్నంతలో మీరు మాకు దొరికారు. మీ ఆధ్వ ర్యంలో హెర్క్యులిస్ ఈవాళ్టితో ఐదవ రోజున బయ ల్దేరుతుంది.

హెర్క్యులిస్ అమెరికన్ యుద్ధనౌక. అది ప్రమాద వశాత్తూ మునిగిపోయిందని భావిస్తోంది అమెరికన్ నేవీ. అయితే ఆ విషయమేదీ లోకానికి తెలియదు. మనం అదే

నాకలో వెళ్ళి పాసింజర్ నౌకను అడ్డగిస్తాం. మన వాళ్ళంతా అమెరికన్ నేవీ దుస్తులు ధరించి వుంటారు. పాసింజర్ నౌక సులువుగా మన స్వాధీనంలోకి వస్తుంది. బంగారాన్ని దోచుకొని నౌకని వదిలేస్తాం. దీవిచేరాక మందు పాతర పెట్టి హ్యార్యులిస్‌ని సముద్రంలో ముంచేస్తాం.

అమెరికా కెనడాలు ఆ తర్వాత తన్నుకుంటాయో తలలే పట్టుకుంటాయో! ఏం జరిగినా నాకు ఆనందమే. బంగారంలో కొంత వాటా మీకిస్తాను. అంతా అయ్యాక మీకు ఇష్టముంటే మాతో కలిసి రావచ్చు. కాదంటే మీకు నచ్చినచోట మిమ్మల్ని వదలి మా దారిన మేం పోతాం!" అన్నాడు రూసో.

"ఈ పని మాకిష్టం లేదంటే!" అనకూడదనుకుంటూనే అన్నాడు రాజు.

రాజు మొహంలోకి ఆశ్చర్యంగా చూసి పెద్దగా నవ్వాడు రూసో "వెల్ మిష్టర్ రాజు! ఒక వేళ అదే మీ నిశ్చితాభిప్రాయమయితే మిమ్మల్ని చూసి జాలిపడక తప్పదు. ఇంతక్రితం మీ కళ్ళముందే ఒక స్త్రీ దారుణ మయిన బాధకు గురయింది. పాట్రేలు సంగతి చెప్ప డానికే లేదు. వాస్తవానికి చెప్పాలంటే అవి లేలిక పాటి బాధలు. మీరు చూడలేదు గనక తెలియక అలా మాటాడారు తప్ప అదేచోట మరింత దారుణమయిన పరిస్థితులున్నాయి" అన్నాడు రూసో గంభీరంగా.

రాజు ఆ మాటలకు ఏ సమాధానము చెప్పలేదు.

రూసో అతని మౌనాన్ని గమనించి చిన్నగా నవ్వుతూ "నాకు తెలుసు. మనుషులెవరూ తెలిసి అటువంటి బాధల్ని ఆహ్వానించలేరు. అయినా ఒకమాట. కొందర

పడి ఏదో ఒకటి చెప్పాలనేం లేదు. ఈ రోజంతా మీ మిత్రులతో బాగా ఆలోచించి చెప్పండి" అన్నాడు.

# 8

మరుసటి రోజు ఉదయమే రూసో మనుషులు వచ్చి రాజు బృందాన్ని రూసో వద్దకు తీసుకుపోయారు. రూసో విశాలమయిన ఓ టేబిల్ ముందు కూర్చొని వున్నాడు. టేబిలుమీద అనేక రకాలయిన తీపి పదార్థాలు, పండ్లు, పాలు, రొట్టెలు వున్నాయి.

రూసో రాజుని ఉద్దేశించి గంభీరంగా "ఏమిటి మీ నిర్ణయం" అన్నాడు గంభీరంగా.

"నౌకను మేం నడిపిస్తాం. కానీ అక్కడ ఏ వ్యక్తినీ మీరు హింసించకూడదు" అన్నాడు రాజు.

రూసో అంగీకారంగా తల ఊపుతూ "ప్రతిఘటన లేనంతవరకూ మీ మరతుకు మేం లోబడి వుంటాం" అన్నాడు నమ్మకంగా. రాజు అంగీకారంగా తల ఊపాడు.

రూసో ఆ తర్వాత వారిని తనతోబాటు తినేందుకు ఆహ్వానించాడు. విందు సరదాగా గడిచింది. అంతా అయ్యాక రూసో వారితో "రేపే మన ప్రయాణం. సిద్ధంగా వుండండి" అన్నాడు.

రాజు బృందం భారంగా కదిలారు అక్కణ్ణుండి. తప్పని పరిస్థితుల్లో వారు రూసోకి సహాయపడేందుకు అంగీకరించారు. ఈలోగా ఎప్పుడు అవకాశం చిక్కినా రూసోని దెబ్బతీయాలన్నదే వారి ఆలోచన. అప్పటివరకూ ఎటువంటి పరిస్థితుల్లోనయినా ఆ విషయం రహస్యంగా వుంచాలని అంతా కలసి నిర్ణయం తీసుకున్నారు. కానీ

రూసో మరీ అమాయకుడేం కాదు. అతడి అనుచరులు అహర్నిశలూ వారిని వెన్నంటే వుంటున్నారు.

రాజు సారథ్యంలో మరుసటి రోజు సూర్యోదయానికి పూర్వమే బయలేరింది యుద్ధనౌక హెర్క్యులిస్. రూసో చెప్పినట్లు అక్కడ సముద్ర ప్రాంతం నౌక వేసే ప్రతి అడుగూ పరీక్షించేదే. నిత్యం బ్రహ్మాండమయిన అలలతో ఆటుపోటుల మధ్య తొణికిసలాడే నీటిలో యే ప్రక్క సూదికొండలు కాచుకకూర్చున్నవో గమనించడం కష్టం.

అనుభవజ్ఞులయిన రూసో అనుచరుల సూచనల మేరకు రాజు నౌకను చాకచక్యంగా ముందుకు నడిపిస్తున్నాడు. నౌకాయానంలో రాజు బుర్ర కంప్యూటర్ వంటిది. కీలకమయిన, అపాయకరమయిన ఆ ప్రాంతంలో నౌక తిరిగే మలుపులన్నీ ఎప్పటికప్పుడు ఆ బుర్రలో ముద్రింపబడుతున్నాయి. చెప్పాలంటే కారు చీకటిలో సయితం రాజు తానిప్పుడు దాటివచ్చిన దారిలో నౌకను తిరిగి తీసుకుపోగలడు.

మూడు రోజులు సముద్రంలో చక్కర్లు కొడుతూ కెనడా పాసింజర్ నౌకకోసం ఎదురుచూస్తూ వున్నారంతా. ఎట్టకేలకు తన గమ్యంలో పయనిస్తున్న ఆ నౌకను గుర్తించగలిగింది హెర్క్యులిస్. లొంగిపోవలసిందిగా యుద్ధనౌకలోనుండి రూసో చేసిన హెచ్చరికను లక్ష్యపెట్టకుండా ముందుకు పోతోంది పాసింజర్ నౌక "కరోలినా"

యుద్ధనౌకమీద ఫిరంగులు సింహగర్జన చేసాయి. కరోలినా నిలబడిపోతూ తెల్ల జెండా ఎగురవేసింది. హెర్క్యులిస్ నెమ్మదిగా కరోలినా సరసన చేరి ఆగింది. అమెరికన్ నేవీ సైనికుల వేషాల్లో వున్న రూసో అను

చరులు కరోలినాలో వున్న ప్రయాణీకులందరినీ ఒక చోట చేర్చారు.

ఒక అమెరికన్ యుద్ధనౌక సిబ్బంది సముద్రపు దొంగల్ని మించి జరుపుతున్న చర్యల్ని ప్రయాణీకులంతా విస్తుపోయి చూస్తున్నారు. కరోలినా కేప్టెన్ పరుగెత్తుకొచ్చి డెక్ మీద ఆజ్ఞలు జారీచేస్తున్న రూసో మీద విరుచుకుపడ్డాడు.

"స్టుపిడ్స్! మీరేం చేస్తున్నారో మీకు తెలియడం లేదు. త్వరలో దీనికి మీ ప్రభుత్వం సంజాయిషీ ఇచ్చుకోవాల్సి వుంటుంది. నేను మా హెడ్ క్వార్టర్స్‌కి ఈ విషయమై మెసేజ్ పంపి వస్తున్నాను....ఇంత దౌర్జన్యమా...." చడామడా వాగేస్తున్నాడు కరోలినా కేప్టెన్.

రూసో సమాధానంగా అతడి దవడమీద లాగిపెట్టి ఒకటిచ్చాడు. అంతే కళ్ళు బైర్లుకమ్మి చెవులు రెండూ మూసుకున్నాడు కేప్టెన్.

నౌకలో కాల్పులు చెలరేగాయి. బంగారానికి కాపలా వున్న సెక్యూరిటీ గార్డులు లొంగిపోయేందుకు ఇష్టపడలేదు. ఆ పదిమంది గార్డులు ఓ గంటసేపు నిర్విరామంగా పోరాడి రూసో అనుచరుల్ని సుమారు పాతిక మందిని నేల కూల్చారు. ఎట్టకేలకు రూసో అనుచరులు వారిని చుట్టుముట్టి దారుణంగా చంపేసారు.

ఆ వూపున రూసో అనుచరుల పాశవిక మనస్తత్వం విజృంభించింది. అదీగాక చెక్క పెట్టెల్లో దాచి పెట్టబడిన బంగారం చూసి మరింత పేట్రేగిపోయారు వాళ్ళు.

అందమయిన ఆడవాళ్ళను సిగ్గూ బిడియమనే మాటే లేకుండా ఎక్కడికక్కడ ప్రయాణీకు లందరి యెదుటా

ఘోరంగా మానభంగాలకు పాల్పడ్డారు. ఆవేశం పట్టలేక ముందుకు వచ్చిన పురుషులందరూ రూసో అనుచరుల తుపాకీ గుళ్ళకు బలయ్యారు. అంత్యదశలో వారూ వీరూ అనే భేదం లేకుండా అందరినీ చంపేసారు.

కళ్ళముందే ప్రారంభమయిన సముద్రపుదొంగల దురాగతాలను చూసి సహించలేక పోయారు రాజా బృందంలోని మిగిలిన నలుగురూ.

"దుర్మార్గులు! మాట తప్పారు. ఆ రూసోగాడి తల చితగ్గొట్టాలి. పదండి వెళదాం" అన్నాడు బల్వంత్ పిడికిళ్ళు బిగిసూ ఆవేశంగా.

"అంతే! అదే చేద్దాం! మనం చచ్చినా సరే" అన్నారు మిగిలిన ప్రకాష్, రవి, సునీల్.

రాజా తల అడ్డంగా వూపాడు. "ఫ్రెండ్స్! మనం యుద్ధనౌకను నడిపించి పెద్ద తప్పే చేసాం. రూసోని చంపడం లేదా మనం చావడం సమస్యకు పరిష్కారం కాదు. ఈ మారణకాండను ఇక ఆపడం కూడా మన తరంకాదు. ఆవేశం వదలి ఆలోచించండి. లోకానికి ఈ సముద్ర పిశాచాల గొడవ శాశ్వతంగా వదలిపోవాలి. ఆ కార్యక్రమంలో మన ప్రాణాలు పోయినా ఫరవాలేదు. కానీ ప్రస్తుతానికి శాంతించండి. సమయం దొరికేవరకూ వేచివుండండి" అన్నాడు.

రాజా మాటలు వాళ్ళందరిమీదా పనిచేశాయి బాగా. ప్రయాణీకుల హాహాకారాలు వినలేక వాళ్ళంతా హెడ్క్వార్టర్స్ లిన్ అంతర్భాగంలో వున్న మారుమూల గదిలోకి పోయి తలుపులు వేసుకున్నారు.

రూసో అనుచరులు పాసింజర్ నౌకకు నిప్పుపెట్టి యుద్ధనౌకమీదకు వచ్చేసారు. చూస్తుండగానే అది

మంటల్లోమాడి పేలి సముద్రంలో కలిసిపోయింది. బంగారంతో యుద్ధనౌక సముద్రపు దొంగల దీవికి తిరుగుముఖం పట్టింది.

రూసో అతడి అనుచరులు గొప్ప హుషారుమీద వున్నారు. రాజు బృందాన్నికూడా తమతోబాటు తాగి మజా చేసేందుకు రమ్మని వాళ్ళంతా బలవంతం చేసారు. తమకు తాగుడు అలవాటులేదని చెప్పి వాళ్ళను వదిలించుకునేసరికి బ్రహ్మప్రళయ మయింది వారికి. హెర్క్యులిస్ నిమ్మదిగా తమ స్థావరాన్ని చేరింది.

బంగారం హెర్క్యులిస్ లో నే వుంచబడింది. ప్రయాణం ఎటూ రెండుమూడు రోజుల్లో నే గనక దానిని అటునుండి ఇటు పదేపదే మార్చడం దేనికని రాజు సలహా యిచ్చినమీదట "అదీ నిజమే" అన్నాడు రూసో.

## 9

రాజుబృందం మొదట వుంచబడిన బసలో నే ఇప్పుడూ వున్నారు. బయట తలుపులకు తాళం వేయలేదు గాని, ఎప్పటిలా నలుగురు సాయుధులు మాత్రం కాపలా వున్నారు.

"అంటే రూసో తమను ఇంకా పూర్తిగా నమ్మలేదన్న మాట!" అనుకున్నారు వాళ్ళు. ఏమయితే నేం మునుపటి కన్నా ఇప్పుడు కొంచెం నయం. ఇంటి పరిసరాల్లో ఆ మాత్రంగానయినా తిరిగే అవకాశం వుంది.

రాత్రి ఒంటిగంట కావస్తోంది. అంతటా నిశ్శబ్దం ఆవహించింది. రూసో అతడి అనుచరులు ఇంచుమించు ఆ సమయంవరకూ ఇష్టం వచ్చినట్టు తాగి తందనాలాడి అలసి ఎవరి నివాసాలకు వారు పోయారు. కాపలా డ్యూటీల్లో వున్నవాళ్ళు ముంచుకువచ్చే నిద్రాదేవిని దరిచేరనీయ

కుండా అవసలు పడుతూ అటూ ఇటూ తిరుగుతున్నారు.

"మనం తప్పించుకుపోయేందుకు సరయిన సమయం. అంతా నిద్రమే కదూ!" అడిగాడు రాజు.

మిగిలిన నలుగురూ మౌనంగా తలలూపారు. రాజు చప్పుడు కాకుండా గోడలకున్న బలమయిన మేకుల్ని వూడదీసాడు. ఒక్కొక్కటీ ఏడెనిమిదంగుళాల పొడవు వుంది.

ప్రస్తుతానికి ఇవే మన ఆయుధాలంటూ రాజు ఆ మేకుల్ని తలొకటీ పంచాడు. బల్వంత్ నవ్వుతూ మేకుని అటూ ఇటూ తిప్పిచూశాడు.

"భలే ఆలోచన రాజూ. నేనింకా ఆయుధాల మాటేమిటా అని ఆలోచిస్తున్నాను" అన్నాడు బల్వంత్.

గదిలోపల ఒకే ఒక కొవ్వొత్తి గుడ్డిగా వెలుగుతున్నది. దానిని ఆర్పేయబోయాడు ప్రకాష్.

"వద్దు! అదలాగే వుంచండి. గది లోపల చీకటయితే కాపలావాళ్ళకు అనుమానం కలగవచ్చు" అన్నాడు రాజు.

తలుపు ఓరగా తీసిచూసాడు రాజు. వరండా అంతా చీకటి. అక్కడ ఇద్దరు కాపలా వున్నారు. ఒకడు పిట్ట గోడమీద కూర్చొని స్తంభానికి ఆని మడుకులమీద తల వుంచి కునికిపాట్లు పడుతున్నాడు. రెండోవ్యక్తి చేతులు వెనక్కి కట్టుకొని కాళ్ళు ముందుకు విసురుతూ అటూ ఇటూ పచార్లు చేస్తున్నాడు.

తలుపు కొద్దిగా చప్పుడు చేస్తూ తెరిచాడు రాజు. కాపలావాడు గిరుక్కున వెనుదిరిగి రాజుని చూస్తూ "ఏం కావాలి" అన్నట్టు తలెగరేశాడు.

"మంచి నీళ్ళయిపోయాయి తెచ్చి పెడతావా?" మొహాన నవ్వు పులుముతూ అడిగాడు రాజు. కాపలా వాడికి అనుమానం రాలేదు. చంకన వున్న తుపాకీని గోడకు జారేసి తలుపు దగ్గరకు వచ్చాడు. రెండో వాడు ఈ లోకంలో లేడు.

"ఆ కూజా ఇటివ్వండి" ప్రక్కకు తిరిగి సగం మనిషి బయట సగం మనిషి లోపలా వున్నాడు కాపలావాడు. వాడు పూర్తిగా లోనికొస్తే నేగాని పని జరగదు. బల్వంత్, ప్రకాష్‌లు తలుపు రెక్కల వెనక నక్కి వున్నారు.

కూజాకోసమని వెనక్కి తిరిగినట్టు తిరిగి ఓ అడుగు ముందుకు వేస్తూ నేర్పుగా జారిపడ్డాడు రాజు. "అరె!" అంటూ లోనికి వచ్చి రాజుని పైకి లేపేందుకు ముందుకు వంగాడతను. బల్వంత్, ప్రకాష్‌లు అదే అదనుగా వాడి మీద విరుచుకుపడ్డారు.

బల్వంత్ ఒక చేత్తో వాణ్ణి ఒడిసిపట్టి రెండో చేత్తో నోరు గట్టిగా మూసి వుంచాడు. ప్రకాష్ చేతిలోవున్న మేకుతో అతణ్ణి పక్కల్లో పొడిచాడు పలుమార్లు. కాపలా వాడు కిక్కురుమనకుండా చచ్చాడు.

రాజు తలుపు దగ్గరకు వచ్చి తొంగి చూసాడు బయటికి. రెండవ వ్యక్తికి కిదేం తెలియదు పాపం! కునికి పాట్లు పడుతూ చిన్నగా గురకతీస్తున్నాడు. బల్వంత్ చప్పుడు చేయకుండా వెళ్ళి కుడిచేయి పిడికిలి బిగించి శక్తికొద్దీ వాడి నెత్తిమీద గుద్దాడు. ఉన్న బరువు ఒకేసారి మెడమీద పడినట్టు చాపచుట్టలా ప్రక్కకు ఒరిగిపోతున్న వాణ్ణి రెండు చేతులా పొదివిపట్టి గదిలోకి ఈడ్చుకొచ్చేసాడు బల్వంత్.

రాజా కాపలా వాడి ముక్కు దగ్గర వేలు పెట్టి చూశాడు. బల్వంత్ నవ్వుతూ "మెడలు విరిగినవాడెవ్వడూ బ్రతకడు భాయ్!" అన్నాడు.

రాజు తల వూపుతూ "చచ్చాడు" అన్నాడు. రెండు తుపాకులు తూటాల పట్టీలు వారి వశమయ్యాయి. అయినా వాటిని వాడేందుకు వీలుకాదిప్పుడు. పని జరగాలంటే చాపకింద నీరులా జారిపోవాలే తప్ప చీమ చిటుక్కుమనేంత చప్పుడు సయితం కూడదీ సమయంలో. వెనక భాగంలో మరో ఇద్దరున్నారు. రాజా బృందం ముందుకు సాగాలంటే మెట్లదారి అదే వుంది!

కిటికీ చప్పుడు చేయకుండా గాలివాటున తెరచుకున్నట్టు తెరిచాడు రాజా. మెట్లకిరుప్రక్కలా వున్న దిమ్మమీద అటు తిరిగి మాటాడుతూ కూర్చున్నారిద్దరూ. తుపాకులు ఆ దిమ్మలకే జారవేసి వున్నాయి.

రవి, సునీల్‌ను పిలిచాడు రాజా. ఇద్దరినీ దగ్గరకు చేర్చి వారి చెవుల్లో నెమ్మదిగా చెప్పాడు ఏం చెయ్యాలో. రవి సునీల్ గది బయటకొచ్చి చెరోప్రక్క విడిపోయారు. కిటికీలోనుండి చేయిచాచి వుంచాడు రాజు. రవి, సునీల్ పూలకుండీల దాపుగా నేలమీదపాకుతూ వెళుతున్నారు. వారికి కాపలావాళ్ళు కనపడరు. కాపలావాళ్ళకు వీరిద్దరూ కనపడరు. రాజు కాపలావాళ్ళను గమనిస్తూ చేయి వూపుతున్నాడు. రవి, సునీల్ ఆ చేతిని గమనిస్తూ ముందుకు పోతున్నారు.

బాతాఖానీ మంచి రసపట్టులో వున్నట్టుంది. కాపలావాళ్ళు వెనక్కి తిరిగి చూడనే లేదసలు. గరుకు నేల. మోకాళ్ళూ చేతులు పీక్కుపోతున్నాయి. బాధను భరిస్తూ కిక్కురుమనకుండా పాముల్లా పాకుతున్నారు రవి,

సునీల్.

కాపలావాళ్ళకు బాగా చేరువలోకొచ్చారిద్దరూ. వీపులు స్పష్టంగా గోచరిస్తున్నా యిప్పుడు. రవి, సునీల్ సైగచేసుకొని ఒకేసారి లేచి వాళ్ళమీదపడ్డారు. ఎడమ చేతులతో వాగుతున్న నోళ్ళకు తాళంవేసి కుడిచేతిలో వున్న మేకులకు పని కల్పించారు. కాపలావాళ్ళు వారిద్దరి చేతుల్లోనూ తోటకూర కాడల్లా వేలాడిపోయారు. రాజు బృందం ముందుకు సాగేందుకు మార్గం సుగమమయింది.

రాజుతప్ప మిగిలిన నలుగురూ తూటాల బెల్టులు ధరించి తుపాకులు చేతబట్టారు. సముద్రపు దొంగలు అనుక్షణం ధరించే వేటకత్తులు, పెద్దదయిన టోపీలు ధరించారు వారు. అయినా సాధ్యమయినంతవరకూ చెట్లు పొదలు ఆసరాగా ముందుకు కదులుతున్నారంతా.

ఒకచోట భూగృహం లాంటిది వుంది. దానిముందు సాయుధులయిన వ్యక్తులిద్దరు పహరాకాస్తున్నారు.

"ఆ గృహం ఏమయ్యుంటుంది?" ప్రశ్నించాడు రాజు నెమ్మదిగా. బల్వంత్ రాయ్ వున్నాడతని వెనక. పొదల మాటున నక్కి వున్నారందరూ.

"బహుశా అమ్యునిషన్ స్టోర్ అయ్యుంటుంది" గొణిగాడు బల్వంత్.

"అదే నిజమయితే దానితో మనకి చాలా పనివుంది" అన్నాడు రాజు.

"అయితే ఓ పట్టుపడదామంటావా?" అడిగాడు బల్వంత్ హుషారుగా. తల వూపాడు రాజు.

బల్వంత్ రవి సునీల్ను తనవెంట రమ్మన్నాడు. రాజు, ప్రకాష్లు అవసరమయితే రంగంలోకి దిగేందుకు దాపులనే వున్నారు సిద్ధంగా.

టోపీలను వీలయినంత మేర మొహాలమీదకు లాక్కు-న్నారు ముగ్గురూ. బల్వంత్ ఠీవిగా ముందుకు నడుస్తున్నాడు. కాపలా మనుషులు వారిని చూస్తూనే సర్దుకున్నారు. సాధారణంగా అక్కడ సంచరించేది వారి మనుషులే గనక మరీ అంత పట్టుదలగా వుండరెవరూ.

"ఎవరది?" ప్రశ్నించారు కాపలా మనుషులు. అప్పటికి వారి చేతుల్లో తుపాకులు నేలకు ఆనించే వున్నాయి.

"మెసేజ్ ఫ్రమ్ కమాండర్!" బొంగురు స్వరంతో పలికాడు బల్వంత్. రూసోని అక్కడంతా కమాండరనే పిలుస్తారు.

కాపలావాళ్ళు రిలాక్సవుతూ "ఎంతమందిని వదలాలేంటి" అన్నారు నవ్వుతూ. ఆ మాటతో అది అమ్యునిషన్ స్టోర్ కాదని తెలిసిపోయింది వారికి. ఏదయితే నేం ముగ్గులోకి దిగాక వెనక్కి తగ్గే ప్రశ్నలేదు. అసరికి ముగ్గురూ కాపలావాళ్ళకు బాగా చేరువయ్యారు.

కాపలావాళ్ళలో ఒకడు చేయి చాచి "ఆర్డర్" అని అడిగాడు. బల్వంత్ "ఆర్డరు"అంటూ జేబుల్లోకి చేతులు పోనిచ్చి మరో రెండడుగులు వేసి వారి మధ్యకు చేరాడు. చేతులు రెండు చటుక్కున పైకిలాగి ఇద్దరి కంఠాలూ ఒకేసారి పట్టుకున్నాడు గట్టిగా. కాపలా వ్యక్తులు గిజగిజలాడుతూ తప్పించుకునే ప్రయత్నం చేసారు. కానీ అది భల్లూకపు పట్టు. ఊపిరి అందక వారిద్దరూ కొట్టుమిట్టాడుతున్న తరుణంలో రవి, సునీల్ తమ వంతు కర్తవ్యాన్ని పూర్తి చెయ్యగా సముద్రపు దొంగల శవాలు తుప్పల్లోకి విసిరి వేయబడ్డాయి.

రాజు, ప్రకాష్ ఈలోగా చేరారక్కడికి. భూగృహం తలుపులకు పెద్ద తాళంకప్ప వేలాడుతోంది.

"దీనిని పగలగొట్టడం ఎలా? తుపాకీ పేలిస్తే చప్పుడవుతోంది మరి" బుర్ర గోక్కుంటూ అన్నాడు బల్వంత్ రాయ్.

రాజు నవ్వుతూ "శవాల జేబుల్లో తాళాలుంటాయి" అన్నాడు.

"అవునుసుమా! ఆ మాటే మరిచాను" అంటూ తిరిగి పాదల్లోకి పరుగెత్తాడు బల్వంత్ తాళాలకోసం. కాపలా వాడి శవం జేబుల్లో తాళాలు దొరికాయి.

తలుపులు తెరవబడ్డాయి. లోపల మిణుకు మిణుకుమంటూ ఓ దీపం వెలుగుతోంది. అక్కడక్కడా శవాలకు మల్లే పడివున్నారు మనుషులు. ఆడా మగా కలిసి సుమారు ఓ ముప్పైమంది వుంటారు.

తలుపులు తెరచిన శబ్దానికి ఉలిక్కిపడుతూ లేచారు కొందరు. ఏ ఒక్కరి కళ్ళల్లోనూ జీవంలేదు. ఆగంతకుల వంక భయంగా చూడసాగారు. తమలో ఏ ఒక్కరికయినా చావుమూడితేనో లేదా వాపో ఆనందంకోసం తమను హింసించేందుకో తలుపులు తెరవబడతాయి. మిగిలిన సమయాల్లో తిండికూడా తలుపు కన్నాల్లోంచి విసరబడుతుంది. ఎవరికివారు ఆ రొట్టె ముక్కలకోసం కుక్కల్లా కొట్లాడుకుంటుంటే బయటనుండి సముద్రపు దొంగలు ఆ దృశ్యాల్ని సినిమా తిలకిస్తున్నట్టు తిలకిస్తూ ఆనందిస్తారు.

రాజు అక్కడి పరిస్థితిని తిలకిస్తూనే వారంతా సముద్రపు దొంగల చేతుల్లో బాధలను అనుభవిస్తున్న బందీలుగా గ్రహించాడు. వారిలో పురుగులమధ్య హింసింపబడిన స్త్రీకూడా వుంది.

తమ అంచనా తప్పయి అది అమ్యునిషన్ స్టోర్

కానందుకు రాజు ఏమాత్రం బాధపడలేదు. అంతకుమించి వేయి రెట్లు శక్తిగల మనుషుల సహకారం తమకిప్పుడు తోడవుతోంది. సముద్రపు దొంగల చేతుల్లో దారుణంగా హింసలకు గురవుతున్న వీళ్ళు ఒక్కొక్కరు అవకాశంవస్తే వందమందితో నిర్భయంగా పోరాడగలరు. అంతటి కసీ, ద్వేషం ఆ కళ్ళలో స్పష్టంగా గోచరిస్తున్నాయి.

రాజు వారందరికీ తామెవరమో చెప్పాడు. తమను విడిపించేందుకు వచ్చిన ఆ అయిదుగురు వ్యక్తుల్నీ నమ్మలేనట్టు చూశారు వాళ్ళు.

పురుషుల మధ్య బాధింపబడిన స్త్రీ గట్టిగా అరుస్తూ "వీళ్ళను నేను కొద్దిరోజులక్రితం రూసో వెంట చూసాను. అవకాశం వుంటే అప్పుడే వీళ్లు ఆ దొంగ వెధవల్ని మట్టుపెట్టేంత ఆవేశాన్ని కనబరచడం గమనించాన్నేను. సందేహంలేదు. వీళ్ళు మన మిత్రులు" అందామె.

ఆ మాటతో ఖైదీలు ఆనందం పట్టలేక అరుస్తూ గంతులు వేయగా కొందరు పెద్దగా యేడ్చేసారు. వారందరినీ ప్రశాంతంగా వుంచేందుకు రాజు బృందం కొంత శ్రమపడాల్సి వచ్చింది. ఖైదీలందరూ దాదాపు బలహీనంగా వున్నారు. అయినా భవిష్యత్తుమీద చిగురించిన ఆశలు వారిలో కొత్త శక్తిని ప్రవేశపెట్టాయి.

వారంతా కలిసి అక్కడికక్కడ ముందు జరగబోయే కార్యక్రమాన్ని రూపొందించుకున్నారు. ఖైదీలలో ఇద్దరు మాజీ సైనికాధికార్లు వున్నారు. వారిద్దరూ ఇక మీదట సముద్రపు దొంగల్ని యెదుర్కొనే విషయంలో రాజు బృందానికి సహకారంఇచ్చేందుకు ముందు నిలుస్తామన్నారు. మిగిలిన వాళ్ళంతా యెప్పటికప్పుడు వారి ఆజ్ఞలప్రకారం నడుచుకుంటారు.

"అంతా బాగానే వుంది! ఇంతమందికి ఆయుధా లేవీ?" వున్న ఐదారు తుపాకులు వందల సంఖ్యలో వుండే సముద్రపు దొంగలకు ఏమాత్రం దీటుకావు.

"ఆయుధాల గిడ్డంగి ఎక్కడుందో తెలుసుకోవడం తప్పనిసరి పని" అన్నాడు రాజా.

"అదెక్కడో నాకు తెలుసు" అన్నాడొక ఖైదీ ముందుకి వస్తూ.

రాజా మొహం వికసించింది. "ఏమాత్రం దూరమది? ఓ అరగంటలో చేరుకోగలమా?" అన్నాడు ఆత్రతగా. ఎందుకంటే తూర్పున తెల్లవారేందుకిక గంటకుమించి లేదు సమయం.

ఖైదీ "అరగంట దేనికి. ఇటుప్రక్కనే వుంది. తొందరగా నడిస్తే ఐదు నిమిషాలు" అన్నాడు.

"మరయితే ఆలస్యం దేనికి? పదండి" అంటూ కదిలారంతా.

# 10

"అదే ఈ దీవిలో రూసో అనుచరులందిరికీ మందు గుండు, ఆయుధాలు సప్లయిచేసే గిడ్డంగి" అన్నాడు ఆ ఖైదీ నెమ్మదిగా.

అందరూ రాళ్ళ వెనక దాగి వున్నారు. సుమారు వంద అడుగుల దూరంలో వుందొక పెద్ద రేకుల షెడ్డు. సాయుధులైన వ్యక్తులు ముగ్గురు చుట్టూ తిరుగుతూ కాపలా కాస్తున్నారు.

"వెధవలు మరీ ఎలెర్టుగా వున్నట్టున్నారు!" బుర్ర గోక్కున్నాడు బల్వంత్ సందిగ్ధంగా.

"నయమే! ఇంకా పకడ్బందీగా వుంటుందేమో అను కున్నాను" అన్నాడు రాజా.

"అది సరే! వీళ్ళను మాత్రం ఎలా తప్పించేట్టు. కనబడితే కాల్చేసేలా వుంది పరిస్థితి" అన్నాడు బల్వంత్.

రాజు ఏ జవాబూ చెప్పకుండా కొద్దిక్షణాలు ఆలోచించాడు. తమ వెంట వున్న ఖైదీలలో ఆడవాళ్ళను పరిశీలనగా చూసి ఇద్దర్ని బయటికి రమ్మన్నాడు. ఆ ఇద్దరిలో మొదట రాజు బృందాన్ని మిత్రులుగా పోల్చిన యువతి ఒకతె!

ఇద్దరూ కాస్తంత నీరసంగా కనబడుతున్నా చాకుల్లాంటి పిల్లలు.

"పరిస్థితి మీకు తెలుసు. ఏమాత్రం చప్పుడుచేసే అవకాశం మనకు లేదు. నా అనుమానం డ్యూటీలో వున్న ఈ ముగ్గురు కాక చుట్టుప్రక్కల విశ్రాంతిలో మరి కొందరు వుండవచ్చు. ఈ ముగ్గుర్నీ రాళ్ళ వెనక్కి చేర్చే బాధ్యత మీది. ఆ తర్వాత పని మేం చూసుకుంటాం" అన్నాడు రాజు ఇద్దరు ఆడవాళ్ళతో.

"ఓ! అదెంతలో పని" అంటూ కదలబోయారిద్దరూ.

రాజు కంగారుగా "ఆగండాగండి. తొందరకూడదు. వాళ్ళకి మీ వెనక మనుషులున్నారనే అనుమానం రాకూడదు" అంటూ వాళ్ళకు ఏం చెయ్యాలో చెప్పి పంపాడు.

ఆడవాళ్ళిద్దరూ ఒక ప్రక్కకు పోయి అటునుండి ఆయుధాగారం ముందునుండి వడిగా పరుగెత్తసాగారు. కాపలావాళ్ళు ఉలిక్కిపడుతూ కళ్ళు నులుముకు చూశారు. ఎవరో ఇద్దరు బహుశా ఖైదీల గృహంనుండి కాబోలు తప్పించుకుపోతున్నారు.

"ఏయ్! ఆగండి!" అరిచారు కాపలావాళ్ళు.

పరుగెడుతున్న ఆకారాలు ఆగలేదు. కంగారుగా

మరింత వేగంగా ముందుకుపోతున్నారు.

"ఆగకపోతే కాల్చేస్తాం!" తుపాకులు ఎక్కుపెట్టారు కాపలావాళ్ళు. ఆకారాలు యెక్కడివక్కడ ఠక్కున నిలబడిపోయాయి.

కాపలావాళ్ళు ముగ్గురూ తుపాకులు పొజిషన్‌లో వుంచి వచ్చారక్కడికి.

ఖైదీలే! కానీ ఆడవాళ్ళు!! అందంగా వున్నారు. పరుగెత్తి బాగా అలసిపోయి వున్నారు. వుచ్ఛ్వాస నిశ్వాసలతో యెత్తయిన వక్షసలాలు యెగిరెగిరి పడుతున్నాయి. బాగా చిరిగివున్న దుస్తులు సగం ఒంటిని బయటికే వదిలేసాయి.

కాపలా వాళ్ళకు నరాలు జివ్వుమంటున్నాయి. గుటకలు మింగుతూనే కోపంగా "ఎక్కడికి తప్పించుకు పోతున్నారు? పదండి" అన్నారు.

ఆడవాళ్ళు గజగజలాడిపోయారు. "మీకు పుణ్యం వుంటుంది మమ్మల్ని వదిలెయ్యండి ప్లీజ్!" బ్రతిమాలారు.

కావాలనికాపలా వాళ్ళ శరీరాల్ని తాకారు. ముగ్గురు మగాళ్ళూ మరింత వేడెక్కిపోయారు.

ఒకడు మిగిలిన కాపలావాళ్ళకేసి చూస్తూ కన్నుగీటి "ఆల్‌రైట్! మిమ్మల్ని వదిలేస్తాం. మమ్మల్ని మజాలో ముంచుతారా మరి" అన్నాడు ఆడ ఖైదీలతో. తప్పదన్నట్టు ఒప్పుకున్నారు ఆడవాళ్ళు.

"మరయితే లోపలకి పోదాం పదండి" అన్నాడు వాడు తాళాలు జేబులోనుండి తీస్తూ.

"అబ్బే!" కంగారు పడ్డారు ఆడాళ్ళు "ఇదసలే ఆయుధాగారం. తుపాకులు, బాంబులు. అమ్మో! మాకు భయం" అన్నారు వాళ్ళు.

"మరయితే ఎలా?" తలలు గోక్కున్నారు మగాళ్ళు.

వేలితో రాళ్ళకేసి చూపించారు ఆడాళ్ళిద్దరూ. కాపలావాళ్ళు నవ్వుతూ "అదీ మంచిదే. చల్లగాలి కూడానూ" అన్నారు కదులుతూ.

ఆడాళ్ళు ఆశ్చర్యపోతూ "ముగ్గురూనా?" అన్నారు. కాపలావాళ్ళు నవ్వుతూ. "మాకలాంటివేంలేవు పదండి" అన్నారు.

రాళ్ళ వెనక్కి చేరుతూనే కాపలావాళ్ళ బుర్రలు బద్దలయ్యాయి. వాళ్ళ శవాలనక్కడే వదలి గిడ్డంగి చేరారంతా.

తలుపులు తెరిచి లోపల దూరారు. లోపల వరుసలుగా పేర్చబడివున్న అనేక రకాలయిన ఆధునిక ఆయుధాలను చూసి ముక్కున వేలేసుకున్నారందరూ.

"ఈ ఆయుధాలతో ఒక డివిజన్ సైన్యాన్ని నిర్వహించవచ్చు" అన్నారు సైనికాధికారులిద్దరూ.

మనిషొక మిషిన్‌గన్ చేతబట్టారు. హేండ్ గ్రెనేడ్లు, మినీ సైజు బాంబులు వీలయినన్ని పట్టుకున్నారు. ఒకరి వెంట ఒకరు వరసగా బయల్దేరారు.

హెర్క్యులిస్ జెట్టీకి తాళ్ళతో కట్టబడి వుంది. తెల్లవారేందుకు ఇక యెంతో సమయం లేదు. నౌక అప్పర్ డెక్ మీద ఒకరిద్దరు కాపలా వున్నారు. ఇక తెల్లవారబోతుందనే ధీమాలో చాలామంది కాపలాదార్లు లోపలికి పోయారు. షిప్ మీదకు పోయే గాంగ్ వే ఎత్తివేయబడి వుంది.

నౌకను జెట్టీకికట్టిన తాళ్ళ ఆధారంగా పైకి చేరారందరూ. బల్వంత్ విజిల్ వేసాడు గట్టిగా. అందరూ ఒకేసారి ముందుకు కదిలారు. ఎదురుపడిన సముద్రపు

దొంగలు అక్కడికక్కడే కూలుతున్నారు. కేకలు, అరుపులు, ఆర్తనాదాలు. మరో ప్రక్క మెషిన్‌గన్‌లు నిర్విరామంగా గర్జిస్తున్నాయి. సముద్రపు దొంగలు జరుగుతున్నదేమిటో తెలుసుకునే లోగానే అంతా నేల కూలారు.

కొందరు ఖైదీలు హెర్క్యులిస్ బంధాలను తెగనరికారు. హెర్క్యులిస్ సముద్రం లోనికి దారితీసింది. రూసోకి విషయం తెలిసి తన అనుచరులను కూడగట్టుకొని జెట్టీని చేరేసరికి హెర్క్యులిస్ సముద్రంనుండి ఎడతెరిపిలేకుండా దీవివైపున్న వాళ్ళ స్థావరాలమీద అగ్నివర్షం కురిపిస్తోంది. రూసో అనుచరుల హాహాకారాలు మిన్నుముట్టాయి. నెత్తిమీద చేతులతో వాళ్ళంతా తలో దిక్కుకు పారిపోసాగారు.

ఈలోగా రాజు మాజీ సైనికాధికారుల సహాయంతో అమెరికన్ నేవీ అధికార్లకు విషయాన్ని వివరించి చెప్పాడు.

కొన్ని గంటల సమయంలో అమెరికన్ యుద్ధ విమానాలు వందలకొద్దీ సైనికులను పారాష్యూట్ల ద్వారా ఆ దీవిమీదకు దించింది. అమెరికన్ సైనికులు చెట్టు పుట్టలు సయితం వదలకుండా గాలించి సముద్రపు దొంగల ముఠాలో చావగా మిగిలినవాళ్ళను బందీలుగా పట్టుకుంది—

—:అయిపోయింది:—

# తోడు దొంగలు

## టెంపోరావ్

ఆరతి పడుకుని పత్రిక చదువుతోంది. గదిలో ఫ్లోరసెంట్ లైటు ప్రకాశవంతంగా వెల్గుతోంది. ఫాన్ వేగంగా కదుల్తోంది.

తన తండ్రి తిరిగొచ్చేసరికి పన్నెండు దాటుతుంది. ఫ్యాక్టరీ నుంచి క్లబ్ కి వెళ్ళి అక్కడ పేకాడ్తూ కూర్చుంటాడు తండ్రి. పన్నెండింటికి అందరూ పోతారు. అతడూ ఇంటికి చేరుకుంటాడు.

బయటనుంచి పోలీస్ విజిల్సు వినబడ్డాయి. ఆమె పరుపుమీదనుంచి దూకి కిటికీ దగ్గరకు నడిచింది. బయటకు చూసింది. కొంచెం దూరంలో ఇంటి కాంపౌండ్ వాల్ కనిపించింది. ఆ గోడ కటువైపున గోపాలం రోడ్డుంది.

ఆ రోడ్డమ్మట నలుగురు పోలీసులు పరుగెడ్తున్నారు. చంద్రకాంతిలో వాళ్ళ టోపీలు ఆమెకు బాగా కనిపించాయి. మళ్ళా విజిల్సు. ఏమైంది? వాళ్ళు యెవరి వెనక పరుగెడ్తున్నారు?

ఆలోచిస్తూ ఆమె టైమ్ చూసింది. తొమ్మిదిన్నర దాటింది.

ఏదో ఆకారాన్ని తన కాంపౌండులో చూసి ఆమె వులిక్కిపడింది.

ఒకతను కిటికీ దగ్గరకు గాభరాగా వచ్చాడు.

"ప్లీజ్, తలుపు తెరువు! వాళ్ళు నాకోసం వస్తున్నారు" అరిచాడతను.

అతను యువకుడు. పాంట్, స్లాక్ ధరించాడు. చేతికి వాచ్ వుంది. అతడి ముఖం చూస్తే పోలీసులు వెంటాడే అపరాధి అని యెవ్వరూ అనుకోరు. మళ్లా పోలీసు విజిల్సు ధ్వనించాయి.

"ప్లీజ్, తొందరగా! వాళ్ళు యీ కాంపౌండులోకి వస్తున్నారు!" అరిచాడతను.

"ఇంటి వెనక్కి పరుగెత్తు! తలుపు తెరుస్తాను" అందామె.

అతను వెనకవైపుకు పరుగెత్తాడు. ఆమె వేగంగా వెనక గదిలోకి వెళ్ళి తలుపు తెర్చింది. అతడు లోపలికొచ్చి మెల్లిగా తలుపు మూసి గడియపెట్టాడు.

"నీ గదికి పో! వాళ్ళు నా గురించి అడగొచ్చు. యేదేనా చెప్తే ఈ కత్తితో పొడిచి నిన్ను చంపుతాను! నన్ను కాపాడ్తే నీకు యే ప్రమాదమూ రాదు" అన్నాడతను.

ఆమె తన పడగ్గదిలోకి నడిచింది. ఆమెను గమనిస్తూ హాల్లో నిలబడ్డాడతను.

ఆమె కిటికీ బయట పోలీసులు ఆగారు. ఆమె వాళ్ళ వైపు చూసింది.

"ఏమైంది?" అడిగిందామె.

"ఒక దొంగ ఇలా పరుగెత్తుకొచ్చాడు. వాడిని చూశారా?" అడిగాడు కానిస్టేబులు.

"అతడు గోడమూకి గోపాలం రోడ్డుకి దిగడం నేను చూశాను" అందామె.

"థాంక్స్, పదండి" అన్నాడొక కానిస్టేబులు.

వాళ్ళు గేటు దాటి గోపాలం రోడ్డువైపు పరుగెత్తారు.

కిటికీ అద్దం తలుపులు ఆమె మూసేసింది. హాల్లో నిలబడి వున్న యువకుడివైపు చూసింది.

"మిస్టర్, లోపలకు రా!" అందామె.

అతడు లోపలకు వచ్చాడు. సోఫాలో ఆమె అతడిని కూర్చోమంది. అతడు కూర్చున్నాడు. అతడి చేతిలో కత్తి మెరుస్తోంది.

అతడివైపు ఆమె సూటిగా చూసింది. అతడి వయస్సు ఇరవై ఆరో, యిరవై ఏడో వుండొచ్చు. మనిషి అందంగా వున్నాడు. చదువుకున్నవాడిలా కనిపిస్తున్నాడు.

"ఆ కత్తిని జేబులో పెట్టుకోరాదూ? మంగలి కత్తిలా ఎందుకది నీ చేతిలో?" అందామె.

అతడు బటన్ నొక్కాడు. కత్తి లోపలకు మూరింది. అతడు బటన్ నైఫ్‌ని పాంటుజేబులో పడేసుకున్నాడు.

"పోలీసులు నీ వెనక యెందుకు వచ్చారు?" ప్రశ్నించిందామె.

"ఎవర్నో వెంటాడ్డమే వాళ్ళ పని!" అన్నాడతను.

"అందర్నీ వెంటాడరే!" అందామె.

"నేనొక దొంగనని వాళ్ళ అనుమానం" అన్నాడతను.

"కావా?"

"నేను చేసిన తప్పల్లా ఆ ముసలిదాని మెళ్ళోని గొలుసును లాగడం. ఆమె భూకంపం వచ్చినట్లు అర్చింది. సమీపంలో వున్న పోలీసులు నా వెనకబడ్డారు. గొలుసు ఆమె మెళ్ళోనే వుంది" అన్నాడతను.

"ఆమె గొలుసును దొంగిలించడానికి ప్రయత్నించావుగా! నువ్వు దొంగవన్నమాటే!" అందామె.

"గొలుసు నా చేతికి రాలేదు."

"ఇంతకుముందు ఇటువంటి దొంగతనాలు చేశావా?"

"చేశాను."

"మంచి కుటుంబానికి చెందినవాడిలా వున్నావు. చదువుకున్న వాడిలా అగుపిస్తున్నావు. ఇలా దొంగతనాలకు ఎందుకు దిగజారావు?"

"చదువున్నా, ఉద్యోగం దొరక్కపోతే నాలాటి వాళ్ళు మరేం చేస్తారు?" అడిగాడతను.

"అందరూ నీలా దొంగలవరు!"

"అందరికీ ధైర్యం వుండదుగా! లోకంలో చాలామంది పిరికిపందలు. ఎక్కడ పట్టుబడిపోతామో అని భయపడ్తారు!"

"నువ్వూ ఆ కోవకు చెందినవాడవే! పోలీసులు వెనక వస్తూంటే నువ్వు భయంతో పరుగెత్తావు. కాపాడమని నన్ను బ్రతిమాలావు" అందామె.

"పోలీసులంటే నాకు భయంలేదు. ఇప్పట్లో వాళ్ళకు పట్టుబడ్డం నాకిష్టంలేదు. నా తల్లి గుడ్డిది. ఆమెకు నేను తప్ప మరెవ్వరూ లేరు."

"అదంతా విని విచారిస్తున్నాను" అని ఆమె అతడి వంక క్షణకాలం చూసింది.

ఆమె టైమ్ చూసింది. పది దాటింది.

"భోజనం చేశావా?"

"లేదు" అన్నాడతను.

"వడిస్తాను, రా" అందామె.

అతడామె వంక గాభరాగా చూశాడు.

"నీ వాళ్ళెవరేనా వచ్చినదాకా నన్ను ఇక్కడ వుంచి పోలీసులకు అప్పగించాలనా నీ వుద్దేశం?" అన్నాడతను.

ఆరతి తీయగా నవ్వింది. అతడి వంక చిరునవ్వుతో చూసింది.

"దొంగతనానికి దిగజారి నీలోని విశ్వాసాన్ని, మానవత్వాన్ని నువ్వు పోగొట్టుకున్నావు!"

అతడు తల దించాడు.

"నన్ను క్షమించు! నా పరిస్థితిలో నేనెవర్నీ నమ్మలేను" అన్నాడతను.

"నిన్ను నేను అర్థం చేసుకున్నాను. నీకు యే భయం లేదు. నా మూలంగా నువ్వు పోలీసులకు పట్టుబడవు. తింటూ మాట్లాడొచ్చు రా" అందామె.

ఆమె వెనకనే అతడు డైనింగ్ హాల్లోకి నడిచాడు.

## 2

కుర్చీలో కూర్చున్నాడతను. డైనింగ్ టేబుల్ చక్కగా వుంది. మొజాయిక్ ఫ్లోర్ మెరుస్తోంది.

పెద్ద కంచంలో ఆమె వడ్డించింది. పదార్థాలను చూస్తూంటే అతడి నోరు వూరింది.

అతడు ఆకలితో తినడం ప్రారంభించాడు. కొంత సేపు గదిలో మాటలు లేవు. తింటూన్న అతడి వంక ఆమె చూస్తోంది. అతడు ఆకలితో తింటున్నాడు.

తటాలున యేదో చప్పుడైంది. అతడు ఉలిక్కిపడ్డాడు. లేచి నిలబడ్డాడు. ఆమె పక్కనున్న వంట గదిలోకి

వెళ్ళి తిరిగి వచ్చింది.

"కిటికీ తలుపు తెర్చి వుంది. పాలకోసం వెతుకుతోంది పిల్లి. నన్ను చూసి పారిపోయింది."

"ఈ ఇంట్లో మరెవ్వరూ లేరా?"

"నాన్నా నేనూ వుంటున్నాం. అమ్మ మరణించి ఆరేళ్ళయింది. పన్నెండు దాటిందాకా నాన్న యింటికి రాడు."

"ఒక్కర్తెవ్వూ వుంటావా? నీకు భయంలా?"

ఆమె నవ్వింది.

"పొద్దుటే కాలేజికిపోయి నేను సాయంత్రం వస్తాను. నేను వచ్చేసరికి వంటామె, పనిమనిషి మంగమ్మ వుంటారు. యేడు గంటలకు వాళ్ళు పోతారు. ఆటుపైన గూర్ఖా మాత్రం వుంటాడు."

"గూర్ఖా నాకు కనపడలేదే?" అన్నాడతను.

"యూ ఆర్ లక్కీ! ఏదో హిందీ సినిమా చూడ్డానికి అతడు వెళ్ళాడు. అతడు యిక్కడ వుండి వుంటే నిన్ను పట్టుకొని పోలీసులకు అప్పగించి వుందేవాడు. మా గూర్ఖా దేవాంతకుడు. ఇంతకుముందు ముగ్గురు దొంగల్ని పట్టుకున్నాడు" అందామె.

"గూర్ఖా వున్న ఇంట్లోకి నేనెప్పుడూ వెళ్ళను. పోలీసులనుంచి తప్పించుకోవడానికి మీ కాంపౌండులోకి దూరాను. లక్కీగా నువ్వు కిటికీ దగ్గర నిలబడివున్నావు" అన్నాడతను.

మరికొంత మామిడికాయ పప్పును ఆమె కంచంలో వేసింది.

"ఇది చాలా బాగుంది. మీ వంటామె బాగా వండుతుంది" అన్నాడతను.

"ఇరవై ఏళ్ళపైగా ఆమె ఇక్కడ వంటామెగా వుంటోంది. ఆమె వండితేగాని నాన్న తిననివ్వరు."

పెరుగూ అన్నం కలుపుకొని అతడు తిన్నాడు. గదిలో వున్న బేసిన్ దగ్గరకెళ్ళి నోరు, చెయ్యి కడుక్కున్నాడు.

"థాంక్స్ ఫర్ ది డిన్నర్" అన్నాడతను, ఆమెకేసి నవ్వుతూ చూస్తూ.

అతడు నవ్వితే చూడ్డానికి యెంతో ఆనందంగా వుంది.

"నీ పేరు?" అడిగిందామె.

"సాగర్."

"నా పేరు ఆరతి. నా తండ్రి పేరు రాజారావు" అందామె.

ఇద్దరూ హాల్లోకెళ్ళి కూర్చున్నారు. ఆమె టైమ్ చూసింది. పదకొండు అయింది. పైన ఫాన్ తిరుగుతోంది. హాల్లో రెండు ఫ్లోరసెంట్ లైట్లు వెల్గుతున్నాయి.

ఆమె అతడి వంక సూటిగా చూసింది.

"వుద్యోగం దొరికితే నువ్వు దొంగతనం నిజంగా మానేస్తావా?"

"మానేస్తాను."

"నాతో అలా చెప్పి మళ్ళా దొంగతనంలోకి దిగకూడదు!"

"దిగను."

ఆమె ఒక కాగితం మీద తన తండ్రి పేరూ, అడ్రస్సూ రాసింది. కింద తన టెలిఫోన్ నంబరు ఇచ్చింది.

"రేపు నువ్వు నా తండ్రి రాజారావును కలుసుకో. రేపు నేను నాన్నతో మాట్లాడతాను. నాకు యెక్కడి

నించేనా ఫోన్ చెయ్యి. నాన్న యేమన్నాడో ఎక్కడ కల్సుకోవాలో చెప్తాను" అందామె.

అతడు కాగితాన్ని తీసుకున్నాడు.

"తప్పక కల్సుకుంటాను. మిస్ ఆరతీ, నా గురించి నీ తండ్రికి అంతా చెప్పకు!"

"నువ్వు దొంగవని చెప్పనులే!" అందామె నవ్వుతూ.

సోఫాలోంచి అతడు లేచాడు. ఆమెవైపు నవ్వుతూ చూశాడు.

"యూ ఆర్ గ్రేట్ గర్ల్!" అన్నాడతను.

ఇద్దరూ ముందు గుమ్మంవైపు నడిచారు.

"ఒక్క క్షణం ఆగు!" అని ఆమె లోపలకు పరుగెత్తింది.

కాస్సేపట్లో తిరిగి వచ్చింది. అతడి వంక చూసింది.

"ఇటువైన నాతో నిజం చెప్పాలి" అందామె.

అతడు తలాడించాడు.

"నీ దగ్గర ఎంత డబ్బుంది?"

అతడు ఆమెవైపు అదోలా చూశాడు.

"పైసాకూడా లేదు" అన్నాడతను.

ఐదు వంద రూపాయిల నోట్లను ఆమె అతడికిచ్చింది.

"నీ తండ్రి ఏమనుకుంటాడో?" అన్నాడతను.

"ఇది నా డబ్బు. నాన్న నాకు ప్రతినెలా నా ఖర్చులకు డబ్బిస్తూ వుంటాడు. అందులోంచి నేను చాలా దాచుకున్నాను. ఇది నేను నీకు యెందుకిస్తున్నానో తెలుసుగా?"

"తెలుసు" అన్నాడతను.

"చేతులో ఏమీ లేక, కడుపునిండా తిండి దొరక్క మనుషులు నేరస్తులవుతారు. ఆ స్థితి నీకు రాకుండా

వుండాలని" అందామె.

"నీకు చాలా థాంక్స్" అన్నాడతను.

ఆమె తలుపు తెర్చింది. బయట గూర్ఖా పచార్లు చేస్తున్నాడు. గూర్ఖా వాళ్ళకు నమస్కరించాడు.

గేటు దాటి అతడు బయటకు వెళ్ళిపోయాడు. వెనక్కు తిరిగి ఆమె వచ్చేసింది. ముందు తలుపు మూసి ఏర్ లాక్ చేసింది. హుషారుగా తన పడగ్గదిలోకి వెళ్ళింది. కిటికీ ముందు నిలబడి బయటకు చూసింది. మెల్లగా వెళ్ళి పరుపుమీద వాలింది. తెలియకుండానే ఆమెకు నిద్ర పట్టేసింది.

# 3

డైనింగ్ హాల్లో ఆరతి, ఆమె తండ్రి బ్రేక్ ఫాస్టు సేవిస్తున్నారు.

తండ్రి సంరక్షణలో ఆరతి అల్లారుముద్దుగా పెరిగింది. ఆమె ఏం కావాలన్నా అతడు వద్దనడు.

ఆమె తండ్రివైపు చూసింది.

"నాన్నా, నా ఫ్రెండు అన్నయ్య సాగర్ కి వుద్యోగం లేదు. ఆమె తండ్రి వ్యాపారంలో బాగా నష్టపోయాడట ...."

"నీ ఫ్రెండు ఎవరు?"

"కమల."

"ఆ అమ్మాయిని నేనెన్నడూ చూడలేదే!"

"ఆమె యిక్కడకు రాలేదు నాన్నా. కాలేజీలో కల్సుకుంటూ వుంటాం."

"అతడికి ఉద్యోగం కావాలంటావు. అంతేనా?"

"అవును."

"వచ్చి నన్ను చూడమను."

"ఎక్కడ?"

రాజారావును కల్సుకోవడం అంత సులువైన పని కాదని ఆమెకు తెలుసు. అతడికి సిమెంట్ ఫ్యాక్టరీ వుంది. పట్నంలో రెండు ఏ.సి. థియేటర్లు వున్నాయి. పట్నంలో డజన్ టెక్స్టయిల్ షో రూమ్స్ వున్నాయి. అతడు అన్నిచోట్లకు తిరుగుతూ వుంటాడు.

"మేనక థియేటర్‌కి రమ్మను. ఇవాళ మధ్యాహ్నం మూడూ, నాలుగు మధ్య నేనక్కడ వుంటాను" అన్నాడు తండ్రి.

"అలాగే నాన్నా. కమల చాలా సంతోషిస్తుంది" అందామె.

"నువ్వు ఆనందపడితే చాలు నాకు" అని తండ్రి లేచాడు.

ఆమె భుజంమీద చెయ్యి వేశాడు. ఇద్దరూ ముందు హాల్లోకి నడిచారు. డ్రయివర్ శర్మ యజమాని తోలు బాగ్‌ను తీసుకెళ్ళి కారులో పెట్టాడు.

రాజారావు కారులో కూర్చున్నాడు. డ్రయివర్ తలుపు మూశాడు.

"అమ్మాయి, కారులో స్లోగా వెళ్ళు. మరీ స్పీడుగా వెళ్ళొద్దు" అన్నాడు రాజారావు.

"నాకు యాక్సిడెంట్ అవదు, నాన్నా" అందామె ధీమాగా.

రాజారావు కారు వెళ్ళిపోయింది. ముందు హాల్లో కూర్చుని ఆమె దినపత్రికను చదువుతోంది.

టెలిఫోన్ మ్రోగింది. రిసీవర్ ఎత్తిందామె.

"హలో, ఆరతి స్పీకింగ్" అందామె.

"సాగర్ హియర్" అన్నాడతను.

"నీ గురించి నాన్నతో మాట్లాడాను."

"ఏమన్నారాయన?"

"ఇవాళ 3—4 మధ్య మేనక థియేటర్లో తనని కలుసుకోమన్నాను. నువ్వు సరిగ్గా ఆ టైమ్‌లోనే వెళ్ళాలి."

"వెళ్తాను."

"నువ్వు నా కాలేజి మేట్ కమల అన్నయ్యవని చెప్పాను. నీ తండ్రి వ్యాపారంలో నష్టపోయాడని చెప్పాను. అదే నువ్వూ చెప్పాలి" అందామె.

"అలాగే చెప్తాను" అన్నాడతను.

"సాగర్, రాత్రి ఇంటికి క్షేమంగా వెళ్ళావా?"

"మధ్యలో యే అడ్డంకులూ లేవు" అన్నాడతను.

"నువ్వు యింట్లో లేనప్పుడు నీ తల్లికి యెవరు సహాయ పడ్తారు?"

"ఎవ్వరూ లేరు అలా జీవించడం ఆమెకు అలవాటై పోయింది."

"ఆమె ఎలా గుడ్డిదైంది?"

"పదేళ్ళ క్రితం పెద్ద గాలి-వాన వచ్చింది. ఆమె వంట చేస్తోంది. ఏదో యాసిడ్ సీసా పగిలి అందులో వున్న ద్రవం ఆమె మొహంమీదకు చెదిరిపడింది. అప్పటి నుంచీ ఆమె గుడ్డిదైంది."

"అదంతా విని చాలా విచారిస్తున్నాను."

"ఆమె దురదృష్టవంతురాలు" అన్నాడతను.

"సాగర్, నాన్నను కలుసుకుని యేమయిందో నాకు చెప్పు. ఆరు తర్వాత నేను ఇంట్లో వుంటాను."

"అలాగే" అని అతడు రిసీవర్ పెట్టేశాడు.

ఆమె సోఫాలో కూర్చుని వెనక్కు వాలి అలో

చిస్తోంది. ఎందుకలనో గాని సాగర్ తన హృదయాన్ని దోచుకున్నాడు. అతడిని చూసినప్పటినుంచీ తన కంటో ఆనందంగా వుంది. సాగర్ గురించి కలలుకంటూ ఆమె కూర్చుండిపోయింది.

## 4

ఏర్ కండిషండ్ గదిలో రొటేటింగ్ కూర్చీలో రాజారావు కూర్చుని వున్నాడు. అతిడి ముందు ఖరీదైన గాడ్ రేజ్ టేబుల్, కుషన్డ్ కుర్చీలు. టేబుల్ మీద మూడు టెలిఫోన్లు వున్నాయి.

వైట్ యూనిఫామ్‌లో వున్న నౌఖరు గదిలో కొచ్చాడు. ఒక చీటీని రాజారావు కిచ్చాడు. చీటీ మీద సాగర్ అని రాసి వుంది.

"ఐదు నిమిషాలు అయ్యాక రమ్మను" అన్నాడు రాజారావు.

నౌఖరు బయటకు వెళ్ళిపోయాడు. ఒక టెలిఫోన్ మ్రోగింది.

"హలో, రాజారావు!"

రెండోది మ్రోగింది.

"హలో, రాజారావు! కాస్సేపు వుండండి" అని అతడు మొదటి ఫోన్ రిసీవర్ని అందుకోబోయాడు.

అదే సమయంలో మూడో ఫోన్ మ్రోగింది.

"హలో, రాజారావు" అన్నాడతను.

"నాన్నా, నేను, కాలేజినుంచి" అందో యువతి.

"ఏమిటమ్మా?"

"అతడు వచ్చాడా?"

"ఇప్పుడే వచ్చాడు. నేనింకా కల్సుకోలేదు."

"మంచి ఉద్యోగం యిప్పించు, నాన్నా. అతడు

చాలా మంచివాడు" అందామె.

"అలాగే యిస్తానమ్మా."

"థాంక్స్ నాన్నా" అందామె.

అతడు మొదటి రిసీవర్ని అందుకున్నాడు.

ఫోన్ డిస్కనెక్టు చేయబడిందని గ్రహించి అతడు రిసీవర్ని పెట్టేశాడు.

రెండో రిసీవర్ అందుకున్నాడు.

"హలో, చెప్పండి. నో, అంత యివ్వను. రెండు లక్షలు ఇస్తా, ఆల్ రైట్. రాత్రి క్లబ్లో మాట్లాడుదాం" అని అతడు రిసీవర్ పెట్టేశాడు.

తలుపు తోసుకొని ఒక యువకుడు లోపలకు వచ్చాడు. వినయంగా టేబుల్ ముందు నిలబడి అతడికి నమస్కరించాడు.

అతడివైపు రాజారావు పరీక్షగా చూశాడు. సాగర్ మొహంలో విశేషమైన ఆకర్షణ వుంది. అతడికి ఉద్యోగమివ్వమని తన కూతురు యెందుకింతగా చెప్తోంది? అతడి మెదడులో ఆలోచనలు సాగుతున్నాయి.

"కూర్చో" అన్నాడతను.

ఎదురుగా వున్న కుర్చీలో సాగర్ కూర్చున్నాడు.

"ఏం పాసయ్యావు?"

"బి.ఎ. పాసయ్యాను, సార్. మూడేళ్ళయింది."

"ఎంత జీతం కావాలి?"

"అది మీరు ఆలోచించండి."

"మీ యిల్లు ఎక్కడుంది?"

అతడు అడ్రెసు చెప్పాడు.

"నీ తండ్రికి వ్యాపారంలో నష్టం వచ్చిందటగా?"

అతడు తల ఆడించాడు.

"నీ చెల్లెలు కమల ఎలా వుంది?"

"ఫైన్, సార్."

"మా అమ్మాయి ఆరతి నీకు తెలుసా?"

"ఆమెతో నాకు పరిచయం లేదు. నా చెల్లెలు ద్వారా ఆమె పేరు విన్నాను" అన్నాడతను.

"మూడు రోజుల తర్వాత, శుక్రవారం పొద్దుట పదింటికి నన్ను ఊర్వశి థియేటర్లో కల్సుకో. నీకు యే వుద్యోగం యివ్వాలో ఆలోచించి చెప్తాను."

"అలాగే, సార్" అని నమస్కరించి అతడు వెళ్ళి పోయాడు.

అతడు బెల్ నొక్కాడు. నౌఖరు లోపలకు వచ్చాడు.

"వెంటనే సైమన్ని రమ్మను."

కాసేపట్లో సైమన్ అతడిముందు నిలబడ్డాడు.

"మిస్టర్ సైమన్, నవ్వొక యువకుడు ఇప్పుడే కలుసు కున్నాడు. ఇది అతని ఇంటి అడ్రెసు" అని ఒక చీటీని యిచ్చాడు.

"యస్సార్" అన్నాడు సైమన్ చీటీని చూసి.

"షాడో హిమ్! అతడికొక చెల్లెలు కమల వుంటుంది. ఆమె సెలా మేరీస్ కాలేజిలో చదువుతోంది. ప్రత్యే కంగా అతడిని గురించి నాకు పూర్తి వివరాలు కావాలి. అతడికి యెవరేనా గర్ల్ ఫ్రెండ్స్ వున్నారేమో కనుక్కో! వుంటే ఫోటోలుతీసి నాకు చూపించు."

"అలాగే సార్" అన్నాడు సైమన్.

"ఆ యువకుని పేరు సాగర్" అన్నాడతను.

"అంతేనా సార్."

"రెండు మూడు రోజుల్లోపల నాకు సమాచారం కావాలి."

"అలాగే చేస్తాను, సార్" అని సైమన్ గదిలోంచి వెళ్ళిపోయాడు.

సైమన్ కంపెనీలకు ఇన్వెస్టిగేటర్‌గా పదేళ్ళనుంచి పనిచేస్తున్నాడు.

ఆలోచిస్తూ రాత్‌మన్స్ సిగరెట్‌ను వెలిగించాడు రాజారావు.

# 5

హాల్లో కూర్చుని ఆరతి టిఫిన్ తింటోంది. కాఫీ తాగి ఆమె చెయ్యి కడుక్కుంది. మంగమ్మ ప్లేట్లను పట్టుకు పోయింది.

కాలేజి నుంచి ఆమె యీ రోజు వేగంగా యింటికొచ్చేసింది. సాగర్‌ని తనకు ఫోన్ చేయమందిగా!

టైమ్ ఆరు దాటింది. టెలిఫోన్ మ్రోగింది. ఆమె వుషారుగా రిసీవర్ని ఎత్తింది.

"హలో, ఆరతి!" అందామె.

"సాగర్ని."

"హలో, సాగర్, ఏమైంది?"

"రాజారావుగార్ని కల్సుకున్నాను. ఆయన్ని చూస్తే నాకు భయమేసింది. ఆయన ఆ ఏ.సి. గదిలో సింహంలా వున్నారు."

"నాన్న పైకి సింహంలాగే వుంటాడు" అందామె నవ్వుతూ.

"మూడు రోజుల తర్వాత శుక్రవారం పొద్దుట పదింటికి రమ్మన్నారు. ఏదో ఉద్యోగం మాసి చెప్తానన్నారు."

"నీకు ఉద్యోగం వచ్చినట్లే! ఇటుపైన నువ్వు చెప్పిన మాట నిలబెట్టుకోవాలి."

"నేను మాట తప్పే మనిషిని కాను!" అన్నాడతను.

"చాలా సంతోషం" అందామె.

"ఇంతవరకూ నా జీవితం ఎడారిలో సాగుతున్నట్లు వుండేది. నువ్వు కనిపించాక పూలవనంలో విహరిస్తున్నట్లు మారిపోయింది. దేవతలా నువ్వంతా మార్చేశావు."

ఆమె తీయగా నవ్వింది.

"నేను దేవతను కాను. మామూలు యువతిని. నా లాటి యువతులు యీ దేశంలో యెందరో వున్నారు."

అతడు వ్యంగ్యంగా నవ్వాడు.

"నీలా నన్ను మార్చడానికి యెవ్వరూ ప్రయత్నించ లేదు!"

"నువ్వు ఎక్కడున్నావు?" అందామె.

"మౌంట్ రోడ్డులో, హిగిన్ బాదమ్స్‌నుండి మాట్లాడుతున్నాను. ఇక్కడ నా ఫ్రెండ్ ఒకడున్నాడు."

"సాగర్, నువ్వు అక్కడే వుండు. పుస్తకాలు చూస్తూ వుండు. నేను వస్తున్నాను" అందామె.

"వెంటనే రా" అని అతడు రిసీవర్ పెట్టేశాడు.

ఆమె బయటకు పరుగెత్తింది. ఫియట్ కారులో కూర్చుంది.

"ఇవాళ నేను ఆరింటికే యింటికి పోవాలమ్మా" అంది మంగమ్మ.

"వెళ్ళు" అని ఆమె కారును గేటువైపు పోనిచ్చింది.

పార్కింగ్ స్థలంలో ఆమె కారాపి దిగింది. హిగిన్ బాదమ్స్ షో రూమ్‌వైపు నడిచింది.

ఆమె లోపలకు వెళ్ళవలసిన అవసరం లేకుండా సాగర్ బయటకొచ్చాడు.

"నా ఫ్రెండ్ మనిద్దర్నీ చూస్తే తర్వాత నన్ను యేడిపిస్తాడు" అన్నాడతను.

"ఎందుకు ఏడిపించడం?" అందామె.

ఇద్దరూ వెనక్కు తిరిగి కారువైపు నడుస్తున్నారు.

"మనిద్దర్కీ ఏదో వుందని అనుమానిస్తాడు!"

అతడి వంక ఆమె నవ్వుతూ చూసింది.

"వుంటే తప్పేమిటి?" అందామె.

"నువ్వు ధనవంతుల బిడ్డవు. ఎవరు యేమన్నా నువ్వు లెక్క చెయ్యవు. డబ్బు నీకు ధైర్యాన్ని యిస్తుంది!"

ఆమె నవ్వింది.

"డబ్బు ధైర్యాన్ని యివ్వొచ్చు. ఏమి లేకపోడం కూడా మనిషికి ధైర్యాన్నిస్తుంది. ఎవరేమన్నా ఏముందిలే పోడానికి అనే భావం మొండి ధైర్యాన్ని యిస్తుంది"

"నువ్వు బాగా ఆలోచిస్తావు!"

"నేను ఎమ్.ఎ. ఫైనలియ్యర్‌లో వున్నాను. మరో రెండు నెలల్లో నా చదువు పూర్తవుతుంది" అందామె.

ఆమె కారు తలుపు తెర్చింది. అతడు సీటుమీద కూర్చున్నాడు. పక్కనే స్టీరింగ్ వీల్ వెనక ఆమె కూర్చుంది.

"నీకు డ్రయివింగ్ తెలుసా?"

"తెలుసు. ఉద్యోగం దొరక్క కొంతకాలం ఒక కారు మెకానిక్ దగ్గర పనిచేశాను. అప్పుడు డ్రయివింగ్ నేర్చుకున్నాను. వాడి బూతులు వినలేక పని మానేశాను" అన్నాడతను.

ఆమె కారును పోనిచ్చింది. పైజామా, జుబ్బాలో వుందామె. అందమైన మొహం. చక్కటి కళ్ళు. అటువంటి యువతిపక్క కారులో కూర్చుంటాడని అతడు

కలలోకూడా అనుకోలేదు.

"మీ నాన్నగారు నా యింటి అడ్రెసు అడిగారు. కమల ఎలా వుందన్నారు...."

"గుడ్ గాడ్, నాన్నకు నీ ఇంటి అడ్రెస్ ఎందుకు?" అందామె ఆశ్చర్యంగా.

"నువ్వు నాకు తెలుసా అని ఆయన అడిగారు. నా చెల్లెలు ద్వారా నీ పేరు తెలుసన్నాను. నీతో పరిచయం లేదన్నాను."

క్షణకాలం ఆమె ఆలోచిస్తూ వుండిపోయింది. నాన్న తనని అనుమానిస్తున్నాడా? సాగర్‌కి వుద్యోగం ఇవ్వమని తను పదే పదే చెప్పడం తండ్రిలో అనుమానాన్ని పుట్టించిందా?

"ఏమిటి ఆలోచిస్తున్నావు?"

హోటల్ మియామీ కాంపౌండులో ఆమె కారు ఆపింది. ఇద్దరూ ఏర్ కండిషండ్ డైనింగ్ హాల్లోకి వెళ్లారు.

మూలనున్న టేబుల్ దగ్గర కూర్చున్నారు. బేరర్ రాగానే ఆమె ఆర్డరిచ్చింది.

ఆమె హాలు నలువైపులా చూసింది. సైమన్ లోపల కొచ్చి ఒక కుర్చీలో కూర్చోడం ఆమె గమనించింది.

"సాగర్, నువ్వు ఇక్కడే వుండు!" అని ఆమె సైమన్ టేబుల్ వైపు నడిచింది.

ఆమెను చూసి సైమన్ నవ్వాడు.

"హలో లిటిల్ బాస్ ఇక్కడ ఏం చేస్తున్నావు?" అడిగాడు సైమన్.

"అది చూడ్డానికే వచ్చేరుగా!" అందామె నవ్వుతూ.

సిగరెట్ పొగ పీల్చివదుల్తూ అతడు నవ్వాడు.

"టిఫిన్ తినడానికి వచ్చాను" అన్నాడతను.

"మిస్టర్ సైమన్, టెల్ మి ది ట్రూత్! నాన్న సాగర్ని వెంటాడమన్నారా?" అడిగిందామె.

"అన్నారు."

"నేను సాగర్‌తో కలిసి తిరగడం యిదే మొదటి సారి. దాన్ని గురించి నేనే నాన్నకు చెప్తాను. ఇదంతా మీ ద్వారా ముందుగా తెలిస్తే నాన్న నామీద మండి పడ్తాడు. ప్లీజ్, మీరు చూసింది నాన్నకు చెప్పకండి. నాన్నకు నేనే చెప్తానని హామీ యిస్తున్నాను."

"ఆల్ రైట్, లిటిల్ బాస్, నీ తండ్రిగారినుంచి ఏవీ దాచను. ప్రామిస్" అన్నాడతను.

"అలాగే" అందామె.

థాంక్స్ చెప్పి ఆమె తన టేబుల్ దగ్గరకు వెళ్ళింది. కాఫీ తాగి సైమన్ వెళ్ళిపోయాడు. లోలోపల నవ్వు కుంటూ ఆమె వెళ్ళిపోతున్న సైమన్ వైపు చూసింది.

"ఎవరాయన?"

"నాన్న కంపెనీలో పనిచేస్తున్నారు."

"మన్ని గురించి నాన్నగారితో ఆయన చెప్తారేమో!"

"డోంట్ బాదర్! సైమన్ మంచివారు. మన్ని గురించి చెప్పరు" అందామె.

సాగర్ అనేక రకాల స్వీట్స్ తిన్నాడు. మసాలా దోశ తిన్నాడు.

"నీ ఇంట్లో వంట ఎవరు చేస్తారు?"

"అమ్మే చేస్తుంది. ఆమెకు కొద్దిగా కనిపిస్తుంది."

ఆరతి కళ్ళు చిట్లించి అతడి వంక చూసింది.

హాల్లోని లైట్లు వెలుగుతున్నాయి. అనేక మందితో హాలు కిటకిటలాడ్తోంది.

"సాగర్, నువ్వెందుకు పెళ్ళి చేసుకోలేదు?" అడిగిందామె.

"పెళ్ళా, నాకా? నేను నా భార్యను పోషించలేను" అన్నాడతను.

"సాగర్, నీ తల్లికి కళ్ళు బాగా కనబడవు. నీ భార్య ఇంట్లో వుంటే నీ తల్లి సుఖపడుతుంది."

"పైసా ఆదాయం లేనివాడికి పెళ్ళేమిటి?"

"భర్త భార్యను పోషించాలన్నది పాతకాలపు పురుష సిద్ధాంతం. భార్యకూడా తన భర్తను పోషించవచ్చు. ఎవరు పోషించినా నా దృష్టిలో ఒకటే. ఇద్దరు వ్యక్తులు దగ్గరవడానికి అవసరమైనది ప్రేమ, ధనం కాదు" అందామె.

ఆమె వంక అతడు ఆశ్చర్యంగా చూశాడు.

"నీనుంచి నేను యెంతో నేర్చుకోవాలి" అన్నాడతను.

"నువ్వు నాకు నేర్పే రోజుకూడా వస్తుంది. మనిషి శాశ్వతంగా ఒకలా వుండడు. కాలచక్రం తిరిగినకొద్దీ మనిషి మారాడు ఎంతో తెలుసుకుంటాడు."

ఇద్దరూ వేడి వేడి కాఫీ తాగుతున్నారు.

ఆమె బిల్లు చెల్లించింది.

"సాగర్, నిన్ను చూసిన క్షణం నుంచీ నాకెంతో ఆనందంగా వుంది. నీ రూపం నా హృదయంలో నిల్చిపోయింది. నువ్వు ఒప్పుకుంటే నాన్నతో మన పెళ్ళి విషయం మాట్లాడతాను" అందామె.

అతడు తృప్తిపడ్డాడు.

"నీకూ నాకూ పెళ్ళా? నువ్వు నాకంటె పెద్ద చదువులో వున్నావు. ధనవంతుల బిడ్డవు. చిరిగిన గుడ్డల్లో

వుండే నా తల్లిని చూస్తే నువ్వు పెళ్ళిమాట యెత్తవు!" అన్నాడతను.

"మనిషి ఒంటిమీద వుండే గుడ్డలను మార్చవచ్చు. మనిషి మనోభావాలను మార్చవచ్చు. నువ్వు ఏ స్థితిలో వున్నా నాకు ఫరవాలేదు."

"నీ తండ్రిగారు ఒప్పుకోక పోవచ్చు!"

"నా తండ్రి గురించి నీకంతగా తెలియదు. నేను యేదేనా కావాలంటే నాన్న వద్దనరు. స్వేచ్ఛగా నేను బతకాలని నాన్న నమ్మకం."

"ఆరతీ, ఏదీ చెప్పలేని స్థితిలో వున్నాను నేను. నువ్వూ, నేనూ కలుసుకోడం ఒక కలలా, కథగా అగుపిస్తోంది. ఇదంతా నిజంకాదేమో అనిపిస్తోంది! నిన్నొక దేవతలా పూజిస్తున్నాను" అన్నాడతను.

"ఇదేం కల కాదు, నేను నీ పక్కనే వున్నాను" అని అతడిని మెల్లగా గిల్లింది.

అతడు వెనక్కు జరిగాడు.

"గిల్లితే నొప్పెట్టిందా? మనం స్వప్నసీమలో లేం. హోటల్ మియామీలో వుంటున్నాం. పద, పోదాం" అందామె.

ఇద్దరూ బయటకు నడిచారు. కారులో కూర్చున్నారు. ఆమె కారును పోనిచ్చింది. తన తండ్రి టెక్స్టయిల్ షాపుకు కొంచెం దూరంలో కారు ఆపింది.

"నువ్వు ఇక్కడే కూర్చో! నేను తొందరగా వస్తాను" అని ఆమె షాపువైపు నడిచింది.

పావు గంట తర్వాత అర డజన్ పాకెట్లతో ఆమె తిరిగి వచ్చింది. పాకెట్లను అతడు తీసుకొని వెనుక సీటు మీద పెట్టాడు.

"ఇవన్నీ ఏమిటి?"

"నీ తల్లి కోసం చీరలు, జాకెట్ గుడ్డలు. నేను నీతో ఇప్పుడు వచ్చి నీ అమ్మను కల్సుకుంటాను" అందామె.

"ఇప్పుడెందుకు? మంచిరోజు చూసి వెళ్ళొచ్చు!"

ఆమె నవ్వింది.

"అన్నీ మంచి రోజులేనని నా నమ్మకం. ప్రతిక్షణం మంచిదే. ఆనాడు నా ఇంట్లోకి పరుగెత్తూ వచ్చినపుడు మంచి సమయమో, కాదో చూశావా?" అందామె.

"పోలీసులు వెనక వస్తూంటే అదంతా యెవరు చూడగలరు?"

ఆమె నవ్వింది. కారును పోనిచ్చింది.

"నీ ఇల్లు యెక్కడో చెప్పు!"

ఎలా వెళ్ళాలో అతడు చెప్పాడు.

"ఆరతీ, నీతో ఒక అబద్ధం చెప్పాను. అమ్మ గుడ్డిది కాదు. గుడ్డిదంటే నీలో జాలిపుడ్తుందని ఆనాడు అబద్ధమాడాను" అన్నాడతను.

ఆమె అతడి చెయ్యి పట్టుకుంది.

"ఇటుపైన యెప్పుడూ నాతో అబద్ధం చెప్పకు. ప్రామిస్!" అందామె.

"చెప్పను" అన్నాడతను.

## 6

ఒక చిన్న యింటిముందు ఆమె కారు ఆపింది. ఇద్దరూ కిందకు దిగారు. పాకెట్లను అతడు పట్టుకున్నాడు.

అతడి వెనకనే ఆమె ఎడంవైపున్న ఫ్లాట్‌లోకి నడిచింది. ఒకే గది, వెనక వంటగది. ముందు గదిలో చాపమీద పడుకుని వున్న ఒక స్త్రీ వాళ్ళను చూసి

లేచింది.

గదిలో 40 వాట్ బల్బు డిమ్‌గా వెల్గుతోంది.

"నువ్వా!" అందామె కొడుకును చూసి.

"ఈమె పేరు ఆరతి. నిన్ను చూడాలంది" అన్నాడతను.

"రా అమ్మా, కూర్చో" అంది సాగర్ తల్లి కామాక్షమ్మ.

ఆరతి చాపమీద కూర్చుంది, ఆమె వంక నవ్వుతూ చూసింది.

కామాక్షమ్మ వయసు 60 వుంటుంది. ఆమె జుత్తు బాగా నెరిసింది. ఆమె ధరించిన చీర మాసింది. అక్కడక్కడ చిరిగింది.

"ఈ పేద కొంపకు యెవరూ రారమ్మా! నువ్వు రావడం ఆశ్చర్యంగా వుంది" అందామె.

"మీకోసం అర డజన్ చీరలు, జాకెట్ గుడ్డలు తెచ్చాను. దయచేసి స్వీకరించండి!"

పాకెట్లను ఆరతి ఆమె ముందు పెట్టింది. చీరలవైపు ఆమె ఆశ్చర్యంతో చూసింది.

"ఇంత ఖరీదైన చీరలు యీ మురికికూపంలో వుండేవాళ్ళు కట్టుకోరమ్మా!" అందామె.

"ఇల్లు మారొచ్చు" అందామె.

"లక్ష్మిలా వచ్చి పల్కావు. నీ మాట ఫలించాలమ్మా!" అందామె.

ఆరతి ఆమెవైపు నవ్వుతూ చూసింది.

"నన్ను మీ కోడలుగా స్వీకరించమని అడగాలని యిక్కడికొచ్చాను!" అంది ఆరతి.

"నీలాటి సుందరి, సంపన్నురాలు నా కోడలయితే వాడి జాతకం మారినట్లే!"

ఆమెకు ఆరతి సాష్టాంగ నమస్కారం చేసింది.

"నన్ను దీవించండి" అందామె.

కామాక్షమ్మ ఆమెను దీవించింది. కొడుకువైపు ఆనందంతో చూసింది.

"నీ జీవితానికి పట్టిన గ్రహణం యీమె రాకతో విడిచిపోయిందిరా! ఈమె వున్నచోట అన్నీ పచ్చగా వుంటాయి" అంది కామాక్షి కొడుకుతో.

సాగర్ మౌనంగా వుండిపోయాడు.

"అత్తయ్యగారూ, నేను వెళ్ళి వస్తాను. త్వరలో మా పెళ్ళి జరుగుతుంది. ఆటుపైన మనందరం ఒకచోట కలిసివుందాం" అందామె.

"వెళ్ళిరా అమ్మా" అంది కామాక్షమ్మ.

ఇద్దరూ బయటనున్న కారు దగ్గరకు నడిచారు. అతడు కూర్చున్నాడు. ఆమె కారును పోనిచ్చింది.

రోడ్డు దీపాలు వెల్గుతున్నాయి. సాగర్ ఆమె నడుం చుట్టూ చెయ్యి పోనిచ్చాడు.

"మీ నాన్నగారితో మాట్లాడాక అమ్మతో అంతా చెప్పివుంటే బాగుండేది" అన్నాడతను.

"మన పెళ్ళి విషయం నీ తల్లికి చాలా ఆనందాన్నియిస్తుంది. అందుకని ఆమెకు ముందు చెప్పాను."

"నీ తండ్రి ఆనందించరా?"

"సాగర్, నా తండ్రి ధనవంతుడు. పేదరికంలో వున్న నిన్ను పెళ్ళాడ్డం నాన్నకంతగా నచ్చకపోవచ్చు. అయినా నాన్న వద్దనడు. నాకోసం సమ్మతిస్తాడు" అందామె.

ఆమె కారును బీచ్ కి పోనిచ్చింది. ఇద్దరూ ఇసుకలో ఎదిమిదిదాకా కూర్చున్నారు.

"నిన్ను నీ యింటిముందు వదిలేసి నేను వెళ్ళిపోతాను" అందామె.

"పద" అన్నాడు సాగర్.

ఆమె ముందు సీటుమీద కూర్చుంది.

"ఈసారి నువ్వు డ్రయివ్ చెయ్యి" అందామె.

స్టీరింగ్ వెనక కూర్చుని అతడు కారును పోనిచ్చాడు.

7

ఏర్ కండిషండ్ గదిలోకి మెల్లిగా వచ్చాడు సైమన్. రాజారావు అతడివైపు నవ్వుతూ చూశాడు.

"కూర్చో!"

సైమన్ కూర్చున్నాడు.

"సాగర్ ని ఒకరోజు పూర్తిగా వెంటాడాను, సార్. అతడు చాలాసేపు యింట్లోనే వున్నాడు. అతడికి గర్ల్ ఫ్రెండ్స్ లేరనుకుంటాను. ఏ ఆడపిల్లతోనూ అతడు తిరగడం నేను చూడలేదు. మధ్యతరగతి కుటుంబానికి చెందినవాడై వుండాలి సాగర్. అతడికి వుద్యోగం వున్నట్లు కనబడ్డంలేదు."

"ఇంకా యేం కనుక్కున్నావు?"

"ఇవాళకూడా షాడో చేసి మీకు మళ్ళా రిపోర్టు యిస్తాను" అన్నాడు సైమన్.

"అక్కరలేదు. ఇటుపైన అతడిని వెంటాడకు. నువ్వు కనుక్కున్నది చాలు" అన్నాడు రాజారావు.

"యస్సార్" అని సైమన్ వెళ్ళిపోయాడు.

రాత్రి పన్నెండికిటికి యింటి ముందు మెర్సిడిస్ కారు ఆగింది. రాజారావు ముందుహాల్లోకి వెళ్ళాడు. అక్కడున్న

ఆరతిని చూసి నవ్వాడు.

"ఇంకా పడుకోలేదా?" ప్రశ్నించాడు.

"రా నాన్నా, వడ్డిస్తాను" అందామె.

దుస్తులు మార్చుకుని, కాళ్ళూ చేతులూ కడుక్కుని అతడు డైనింగ్ రూమ్‌లోకి వచ్చాడు.

ఆమె ఎదురుగా కూర్చుని తినడం ప్రారంభించాడు.

"నాన్నా, నీతో మాట్లాడాలి" అందామె.

"చెప్పమ్మా! తింటూ వింటాను."

"నేను సాగర్‌ని ప్రేమిస్తున్నాను. అతడిని పెళ్ళాడతాను."

"నువ్వు అతడికి వుద్యోగం యిమ్మంటే యిటువంటిదేదో వుంటుందని నేనప్పుడే అనుకున్నాను" అన్నాడతను నవ్వుతూ.

"నిన్న అతడి యింటికి వెళ్ళాను. అతడి తల్లిని కల్సుకున్నాను. ఆమెకు అర డజన్ చీరలు ప్రెజంట్ చేశాను."

రాజారావు ఆలోచిస్తున్నాడు. ఇదంతా సైమన్ ఎందుకు చూడలేదు?

"నువ్వు అతడి యింటికి ఎలా వెళ్ళావు?"

"ఒంటరిగా వెళ్ళాను. అతను యింట్లో లేడు" అందామె.

సైమన్ అతడిని వెంటాడుతూ వెళ్ళుండాలి!

"అమ్మాయి, అతడితో నువ్వు సుఖంగా వుండగలవా?"

"వుండగలనన్నే విశ్వాసం నాకుంది."

"అతడు పేదవాడమ్మా!"

"నీదగ్గరున్న డబ్బు పదిమంది పేదవాళ్ళను ధనవంతు

లుగా చేయగలదు!"

"నీ ఇష్టం తల్లీ, మీ పెళ్ళికి ముహూర్తం పెట్టిస్తాను" అన్నాడతను.

"నాన్నా, ఐ లవ్ యు! యూ ఆర్ రియల్లీ గ్రేట్!" అందామె.

# 8

ఆరతి, సాగర్ పెళ్ళి వైభవంగా జరిగింది. పుర ప్రముఖులు, మంత్రులు, విదేశీయులు పెళ్ళికి వచ్చారు. పెళ్ళి తర్వాత కామాక్షమ్మ, సాగర్ రాజారావు యింటికి మారిపోయారు.

హనీమూన్‌కి సాగర్, ఆరతి కాశ్మీర్ వెళ్ళారు. నెల పాటు అక్కడ సుఖంగా కాలం గడిపి తిరిగివచ్చారు.

సాగర్ తన మామకు కుడిభుజం అయ్యాడు. పన్నెండు నెలలు వేగంగా దొర్లిపోయాయి.

ఆనాడు సాగర్ సిమెంట్ ఫ్యాక్టరీలో కూర్చుని వున్నాడు. ఢిల్లీ వెళ్ళగానే రాజారావు ఫోన్ చేస్తానన్నాడు. తన పనులు చూసుకుంటూ అతడి కాల్ కోసం ఎదురుచూస్తున్నాడు.

టెలిఫోన్ మ్రోగింది. పిడుగులాంటి వార్త విని సాగర్ వులిక్కిపడ్డాడు.

"ఢిల్లీ వెళ్ళే ప్లేను ఆగ్రా ప్రాంతంలో నేల కూలిపోయింది, సార్. ప్రయాణీకులూ, క్రూ మెంబర్లూ మరణించారని వార్త" అన్నాడు సైమన్ అటువైపు నుంచి.

సాగర్ తన భార్య ఆరతితో మాట్లాడాడు. వెంటనే యిద్దరూ మరో విమానంలో ఢిల్లీ వెళ్ళారు.

ప్లేను కూలిన ప్రదేశానికి చేరుకున్నారు. అంతా అల్ల

కల్లోలంగా వుంది. ఎందరో ఏడుస్తున్నారు. తునాతునక లైన తండ్రి శవాన్ని చూసి ఆరతి ఏడ్వసాగింది.

శవాన్ని అక్కడే దహనం చేయించి యిద్దరూ తిరిగి వచ్చారు.

"సాగర్, యిటుపైన నీకు సలహాలివ్వడానికి నాన్న లేడు. అంతా నువ్వే చూసుకోవాలి" అందామె.

"తలిదండ్రులు శాశ్వతంగా బిడ్డలతో వుండలేరు. వయస్సువాళ్ళను ఎత్తుకుపోతుంది. కాని నీ తండ్రి యిలా యాక్సిడెంట్ లో మరణించినందుకు నేను చాలా బాధ పడుతున్నాను" అన్నాడతను.

"విధి అలా వుంది" అందామె.

రోజులు గడిచిపోతున్నాయి. సాగర్ బాగా మారాడు. తెలివిగా అనేక కంపెనీలను నడుపు తున్నాడు.

ఒకనాటి రాత్రి చోలా హోటల్లో పార్టీకి వెళ్ళా డతను. అందరూ విస్కీ సేవిస్తున్నారు. అతడి పక్కనే ఒక యువతి కూర్చుని వుంది. ఆమెకూడా తాగుతోంది!

"హై!" అందామె.

"నా పేరు సాగర్" అన్నాడతను.

"నా పేరు ఎలిజిబెత్" అందామె.

అతడితో కరచాలనం చేసింది. తర్వాత యిద్దరూ డాన్స్ చేశారు. ఆర్కెస్ట్రా శ్రావ్యంగా ధ్వనిస్తోంది. అతడిని అంటిపెట్టుకుని ఆమె కదుల్తోంది.

ఎలిజిబెత్ మహా అందంగా వుంది. అంత అందమైన స్త్రీని అతడు ఎక్కడా చూడలేదు.

ఒంటిగంట తర్వాత తన కారులో తీసుకువెళ్ళి ఆమెను యింటిముందు దింపాడు.

"థ్యాంక్స్" అందామె.

"మళ్ళా ఎప్పుడు కల్సుకుందాం?" అడిగాడతను.

"నేను ఫోన్ చేయండి" అని తన ఫోన్ నంబరు చెప్పిందామె.

ఆనాటి రాత్రి అతడికి నిద్రపట్టలేదు. ఆమెను గురించే కలలుకంటూ వుండిపోయాడతను.

# 9

పక్కనే పడుకున్న సాగర్ వైపు ఆరతి చూసింది.

"సాగర్, వారంరోజుల నుంచి నువ్వు వింతగా ప్రవర్తిస్తున్నావు. ఏమైంది?" అడిగిందామె.

"కంపెనీ సమస్యలు. వ్యాపారంలో ఎన్నో ప్రోబ్లమ్స్ వస్తూ వుంటాయి. నీతో హాయిగా కొన్ని రోజులపాటు ఏ బెంగుళూరో పోయి వుండాలనిపిస్తోంది" అన్నాడతను.

"పోదాం, పద" అందామె.

రెండు రోజుల తర్వాత ఒకనాటి ప్రొద్దుటే వాళ్ళు కారులో బెంగుళూరుకి బయల్దేరారు. సాగర్ హుషారుగా కారును పోనిస్తున్నాడు.

"ఇప్పుడు మునుపటిలా వుంది!" అందామె.

అతడామె నడుంచుట్టూ చేయిని పోనిచ్చి ఒక్క చేతితో స్టీరింగ్ వీల్‌ని తిప్పుతున్నాడు. ఆరతి కిలకిల నవ్వుతోంది.

అడవి ప్రదేశంలో కారు వెళుతోంది. దట్టంగా వున్నాయి చెట్లు.

అతడు కారును రోడ్డువారగా ఆపాడు. ఇద్దరూ కిందకు దిగారు. సాగర్ ఆమెను బలంగా కౌగలించుకుని ముద్దెట్టుకున్నాడు.

"ఆరతీ, అలా తిరుగుదాం పద, కాస్సేపు. ఇక్కడ చాలా బాగుంది" అన్నాడతను.

పొదలు దాటి యిద్దరూ కొంతదూరం నడిచారు. చెట్ల మధ్య నుంచి కదులుతున్నారు. ట్రంక్ రోడ్డు దూరంలో వుంది.

అమాంతంగా అతడామె చెయ్యి పట్టుకుని వెనక్కి లాగాడు. వెనుదిరిగి ఆమె అతడి వంక చూసింది. అతడి ఒళ్ళు వణుకుతోంది. అతడి కుడిచేతిలో వున్న కత్తి కింద పడింది.

"ఆ కత్తి ఎందుకు తీశావు?" అర్చిందామె.

అతడు మాట్లాడలేదు. అతడి కళ్ళలోకి ఆమె పరీక్షగా చూసింది.

"ఇక్కడకు తీసుకొచ్చి నన్ను చంపాలనుకున్నావా?" ప్రశ్నించిందామె.

అతడు జవాబివ్వలేదు.

"సాగర్, నిజం చెప్పు! నిన్ను నేను ప్రేమిస్తున్నాను. నా దగ్గర ఏదీ కప్పిపుచ్చకు."

"నాకు ఎలిజిబెత్ కావాలి. ఆమె నాతో వుండాలి. నువ్వు వున్నంతకాలం ఆమె నాతో వుండలేదు!" అన్నాడతను.

"ఎవరామె?"

"చాలా అందమైన యువతి. ఆమె నా పక్కనుంటే గాని ఏ పనీ నేను చెయ్యలేను."

అతడివైపు ఆమె సూటిగా చూసింది.

"నేను ప్రేమించిన వ్యక్తి హంతకుడయితే నేను భరించలేను. నీ కోర్కె తీర్చుకోడానికి నన్ను చంపడం అనవసరం. నీ ఆనందానికి నేను అడ్డురాను. మద్రాసులో

నాన్నకు చాలా యిళ్ళు వున్నాయి. మరో యింటికి నేను వెళ్ళిపోతాను. నీవు కలలుగనే ఆ యువతిని తీసుకొచ్చి యింట్లో వుంచుకో!" అందామె.

"ఆరతీ, నువ్వు ఒక దేవతవి!"

"నువ్వు ఆనందంగా వుండడమే నాకు కావలసింది. పద, పోదాం" అందామె.

ఇద్దరూ కారువైపు నడిచారు. కారులో కూర్చున్నారు.

"వెనక్కి తిప్పి మద్రాను పోనీ" అందామె.

"బెంగుళూరు వెళ్ళొద్దూ?" అడిగాడతను.

"బెంగుళూరులో ఎలిజిబెత్ వుండదు!" అందామె నవ్వుతూ.

కారుని వెనక్కి తిప్పి పోనిచ్చాడతను.

"అమ్మ ఏమంటుందో!" అన్నాడతను.

"ఆమెకు నే సర్ది చెప్తాను. ఆమె ఏమీ అనదు" అంది ఆరతి.

# 10

దేవిడ్, ఎలిజిబెత్, సాగర్ మేడమీదున్న హాల్లో కూర్చున్నారు. ఫ్లోరసెంట్ లైట్లు వెలుగుతున్నాయి.

కిందభాగంలో వుంటోంది కామాక్షమ్మ. సాధారణంగా ఆమె మేడమీదకు రాదు.

దేవిడ్ వృద్ధుడిలా వున్నాడు. తెల్ల జుత్తు, తెల్లటి మీసాలు, తెల్లటి కనుబొమ్మలు. అతడు వంగి నడుస్తాడు. చేతులు వణుకుతూ వుంటాయి.

"నా తలిదండ్రులు పోయినప్పటినుంచీ మావయ్యే నన్ను పెంచాడు" అంది ఎలిజిబెత్.

మూడు గ్లాసుల్లో ఆమె స్కాచ్ విస్కీ పోసింది.

సోడా కలిపి ఐస్‌క్యూబ్స్ పడేసింది.

"చియర్స్!" అంటూ ముగ్గురూ గ్లాసులను అందు కున్నారు.

ఎలిజిబెత్ అతడిని కళ్ళతో నవ్వుతూ నిమురుతోంది. మెరిసే కళ్ళతో అతడివైపే చూస్తోంది.

సాగర్ ఆమె ఎర్రటి పెదిమలను ముద్దెట్టుకున్నాడు.

"మీ ప్రేమను మెచ్చుకుంటున్నాను. నేను ఎక్కువ కాలం బతికి వుండను. మీరిద్దరూ ఆనందంగా బతకడమే నాకు కావలసింది" అన్నాడు డేవిడ్.

సాగర్, ఎలిజిబెత్ పెద్ద సోఫాలో పక్క పక్కనే కూర్చున్నారు.

"మావయ్యకు బాగా చూపు ఆనదు. అతడి ముందు మనం ఏం చేసినా ఫరవాలేదు" అందామె.

మంగమ్మ పైకొచ్చింది.

"అమ్మగారు మిమ్మల్ని రమ్మన్నారండి" అని వెళ్ళి పోయింది.

"వెళ్ళిరా, అమ్మ పిలిస్తే వెంటనే వెళ్ళాలి" అంది ఎలిజిబెత్.

అతడు కిందకు వెళ్ళిపోయాడు.

డేవిడ్ పక్కకొచ్చిన ఎలిజిబెత్‌ను ముద్దెట్టుకున్నాడు.

"మెడిఘర్, ఆ శాస్త్రుడికి బాగ విస్కీపోసి తాగించు. పడుకుంటాడు. తర్వాత మనం సుఖంగా వుండొచ్చు" అన్నాడు డేవిడ్.

"అలాగే, మెడిఘర్" అందామె.

మెట్లుదిగి వచ్చిన కొడుకువైపు ఆమె కోపంగా చూసింది.

"ఒరేయ్, నీ ప్రవర్తన నాకు నచ్చడంలేదు. దేవత లాంటి ఆరతిని మరో యింటికి పంపేశావు. ఆ పిశాచంతో తప్ప తాగి పడుంటున్నావు. అది యీ యింటికి నిప్పెట్టి నిన్ను నాశనం చేస్తుందిరా! నా మాటలు గుర్తుంచుకో!" హెచ్చరించింది కామాక్షమ్మ.

"అమ్మా, ఆరతి మాట్లాడకుండా వూరుకుంది. నువ్వెందుకు బాధపడ్తావు? నీ కొడుకును ఎలిజబెత్ రాణీ ప్రేమిస్తోందని ఆనందించు!" అన్నాడు సాగర్.

"అది రాణీ కాదురా, రాక్షసి!" అర్చిందామె.

"అంత అందాన్ని రాక్షసి అన్నందుకు రాక్షసులు సంతోషించాలి" అని నవ్వాడతను.

"నువ్వు నా కడుపున చెడబుట్టావురా!" అని తిట్టిందామె.

అతడు తల్లివైపు సూటిగా చూశాడు.

"రామా కృష్ణా అనుకుంటూ కూర్చో. నీకు ముక్తి లభిస్తుంది. నా జీవితంలోకి వేలు పెట్టకు!" అని అతడు పైకి వెళ్ళిపోయాడు.

డేవిడ్ సోఫాలో కూర్చుని వణుకుతున్నాడు.

"ఇంత సేపు నిన్ను చూడకుండా వుండలేను!" అంది ఆమె.

అతడిని అమాంతంగా కౌగలించుకుంది. అనేకచోట్ల ముద్దెట్టుకుంది. విస్కీతో నిండిన గ్లాసును అతడి కందించింది.

అతడు తాగుతున్నాడు. ఆమె మెట్లవైపు వెళ్ళి వంటామెను పైకి రమ్మంది. వంటామె వచ్చింది.

"వండిన పదార్థాలు తెచ్చి హాల్లోని డైనింగ్ టేబుల్ మీద పెట్టి నువ్వు వెళ్ళిపోవచ్చు" అందామె.

"అలాగే నమ్మా" అంది వింటూమె, విసుగు ప్రదర్శిస్తూ.

# 11

తప్ప తాగి సాగర్ మెజాయిక్ ఫ్లోర్ మీద సోఫా పక్కనే పడి, గుర్రుపెడ్తూ నిద్రపోతున్నాడు.

"ఇతడిని సోఫాలో పడుకో బెడ్దామా?" అడిగింది ఎలిజిబెత్.

"బాస్టర్డుని అలాగే పడుకోనీ! పద డిన్నర్ కి!" అన్నాడు డేవిడ్.

హాల్లో వున్న డైనింగ్ టేబుల్ కుర్చీల్లో యిద్దరూ పక్కపక్కనే కూర్చున్నారు. టైమ్ పన్నెండు కావస్తోంది.

ఇద్దరూ ఆకలితో తింటున్నారు.

"మై డియర్, ఇక్కడ పని తొందరగా ముగించి మనం మాయమవ్వాలి. లేకపోతే మన గుట్టు బయట పడుంది. సాగర్ మనకు దొరికిన పెద్ద చేప. కనీసం పది లక్షలు పైన రొక్కం, నగలు పట్టుకొని మనం పోవాలి" అన్నాడు డేవిడ్.

ఆమె అతడివైపు చూసింది. అతడిప్పుడు వణకడం లేదు.

"ఆ విగ్ తీసేయి. ఓల్డు మన్ లా వున్నావు!" అందామె.

"తర్వాత మన పడగ్గదిలో తీస్తానులే!"

"మై డియర్, యింతకుముందు అనేక పట్టణాల్లో యెందర్నో మనం మోసంచేశాం. ఈసారి చేతికొచ్చిన డబ్బుతో తృప్తిపడి మనం యీ జీవితానికి గుడ్ బై చెప్పేయాలి. మనం యెంత పట్టుకుపోయినా సాగర్ కి

ఈగ కాటులా వుంటుంది. అతడు లెక్క చేయడు" అంది ఎలిజబెత్.

డిన్నర్ ముగించి వాళ్ళు పడగ్గదిలోకి వెళ్లారు. దేవిడ్ తలుపు మూశాడు.

సిగరెట్ పీలుస్తూ సోఫాలో కూర్చున్నాడు. విగ్ తీసేశాడు. మీసాలను పీకేశాడు. ఇప్పుడతను యువకుడిలా వున్నాడు. అతడి ఒళ్ళో తలపెట్టుకుని ఆమె పడుకుంది.

"ఈసారి యెక్కడకు పోదాం?"

"కాశ్మీర్ పోయి అక్కడ స్థిరపడిపోదాం" అన్నాడతను.

"మనం ఇక్కడికి వచ్చి అప్పుడే నాలుగు రోజులైంది. అతడి బ్లాక్ మనీ యెక్కడుందో తెల్సుకున్నావా?"

"పడగ్గదిలో ఒక సీక్రెట్ పెట్టె వుందన్నాడు. రేపు కనుక్కుంటాను."

"తొందరగా పని కానీ" అన్నాడు దేవిడ్.

కిందనున్న టెలిఫోన్ మ్రోగింది. నిద్రపట్టని కామాక్షమ్మ వెళ్ళి రిసీవర్ని అందుకుంది.

"హలో" అంది.

"అత్తయ్యగారూ, నేను, ఆరతిని. మీరు బాగా వున్నారా?"

"చావలేక బతికి వున్నానమ్మా."

"ఆయన భోజనం చేశారా?"

"ముగ్గురూ తాగుతున్నారని మంగమ్మ చెప్పింది. పై తలుపులు మూసివున్నాయి. పైన ఏం జరుగుతున్నదీ తెలియడంలేదు" అంది కామాక్షి.

"సాగర్ అంతగా ప్రేమించిన యువతి అతడి బాగోగులను చూడకుండా వుండదని నమ్ముదాం" అంది ఆరతి.

కొంతసేపు యిద్దరూ మాట్లాడలేదు.

"ఏదేనా అవసరం ఏర్పడితే నాకు వెంటనే ఫోన్ చేయండి. తక్షణం వచ్చేస్తాను" అని అరతి రిసీవర్ పెట్టేసింది.

## 12

రెండు రోజులు గడిచిపోయాయి.

ఆమె మెట్లవైపు వెళ్ళింది. కిందకు చూసింది. హాల్లో ఎవ్వరూ కనబడలేదు.

"మంచి సమయం, పోదాం" అంది ఎలిజిబెత్.

డేవిడ్ టైమ్ చూశాడు. పన్నెండు దాటింది. లైట్లు వెలుగుతున్నాయి. రెండు ఏర్ బాగ్ లను యిద్దరూ పట్టుకున్నారు. మెల్లిగా మెట్లు దిగారు. బయటకు వెళ్ళిపోయారు.

తలుపు వెనకనుంచి వాళ్ళను చూసిన కామాక్షి పైకి పరుగెత్తింది. సోఫాలో పడుకున్న కొడుకుని తట్టింది. అతడు లేవలేదు. అతడి మొహంమీద నీళ్ళు పోసింది.

అతడు కళ్ళు తెరిచాడు.

"ఒరేయ్, వాళ్ళిద్దరూ పారిపోతున్నారురా! వెళ్ళి ఆపు!" అరిచిందామె.

అతడు లేచి నిలబడ్డాడు.

"నేను చెప్పింది నీకు అర్థమైందా?"

అతడు కిందకు పరుగెత్తాడు. బయటకు వెళ్ళాడు. పోర్టికోలో మోరిస్ కారు లేదు. వాళ్ళు అందులో వెళ్ళి వుంటారు.

అతడు మెర్సిడిస్ లో కూర్చున్నాడు. గూర్ఖా అక్కడికొచ్చాడు.

"వాళ్ళు యిప్పుడే వెళ్ళారు, సాబ్" అన్నాడతను.

"కారు ఎటువైపు తిరిగింది?"

"పడమివైపు సాబ్" అన్నాడతను.

సాగర్ మెర్సిడిస్ కారును పోనిచ్చాడు. గేటు దాట గానే మెర్సిడిస్ పడమివైపుకు తిరిగి మాసుకుపోయింది.

కామాక్షమ్మ కిందకు దిగింది. రిసీవర్ ఎత్తి ఒక నంబరు తిప్పింది.

"హాలో" అంది ఆరతి.

"వెంటనే ఇక్కడకు రామ్మా! వాళ్లు ఇప్పుడే పారి పోయారు. సాగర్ వెనకనే వెళ్లాడు" అందామె.

"వస్తున్నాను" అంది ఆరతి.

పది నిమిషాల్లో ఆరతి కారు పోర్టికోలో ఆగింది. గూర్ఖా ఆమెకు నమస్కరించాడు.

"వాళ్ళు మోరిస్ కారులో వెళ్ళారమ్మా. అయ్యగారు మెర్సిడిస్‌లో వెళ్ళారు" అన్నాడు గూర్ఖా.

కారు దిగిఆమె హాల్లోకి పరుగెత్తింది. రిసీవర్ ఎత్తి పోలీసు నంబరు తిప్పింది. మోరిస్ కారు నంబర్ను వాళ్ళకు చెప్పింది. వాళ్ళను వెంటాడుతూ మెర్సిడిస్‌లో వెళ్ళిన తన భర్త సాగర్ గురించి చెప్పింది. తన అడ్రెసు టెలిఫోన్ నంబరు యిచ్చింది.

"మేం వెంటనే మోరిస్ కారు కోసం చూస్తాం" అన్నాడు ఇన్‌స్పెక్టర్ రామన్.

హాల్లో ఆరతి పచార్లు చేస్తోంది. కామాక్షి సోఫాలో కూర్చుంది.

అరగంట తర్వాత టెలిఫోన్ మ్రోగింది. వెళ్ళి ఆమె రిసీవర్ని ఎత్తింది.

"మోరిస్ కారు దొరికింది. అందులో డేవిడ్ అనే అతను గాయపడి వున్నాడు. మీ భర్త సాగర్ ఇక్కడే

వున్నారు. పారిపోయిన ఎలిజిబెత్ కోసం పోలీసులు గాలి స్తున్నారు" అన్నాడు ఇన్స్పెక్టర్ రామన్.

"ఆమె దొరికితే నాకు వెంటనే చెప్పండి" అందామె.

"చెప్తాను."

"థాంక్స్" అందామె.

నిమిషాలు గడుస్తున్నాయి. టైమ్ ఒంటి గంట దాటింది. మెర్సిడిస్ కారొచ్చి పోర్టికోలో ఆగింది. సాగర్ అలసటగా దిగి హాల్లోకి వెళ్ళాడు. అక్కడున్న ఆరతి వంక అతడు చూడలేక తలదించుకున్నాడు.

"సాగర్ ఏమైంది?" అడిగిందామె.

"ఎలిజిబెత్ ను పోలీసులు అరెస్టు చేశారు. డేవిడ్ హాస్పిటల్లో వున్నాడు. డేవిడ్ అంతా పోలీసుల ముందు ఒప్పేసుకున్నాడు. రెండు ఏర్ బాగ్స్లో నగలు, డబ్బు పెట్టుకుని వాళ్ళు ఇద్దరూ పారిపోయారు. కాని ఆఖరి క్షణంలో అతడిని కత్తితో పొడిచి ఏర్ బాగ్స్ తీసుకుని ఆమె పారిపోయింది అంతా తనకే దక్కుతుందని ఆమె అనుకుంది" అన్నాడు సాగర్.

"ఆ ఏర్ బాగ్స్ నీకు వాళ్ళు తిరిగి ఇస్తారా?"

"తర్వాత ఇస్తారు" అన్నాడు సాగర్.

ఆమె నవ్వుతూ అతడి వంక చూపింది.

"సాగర్, నువ్వు క్షేమంగా ఇంటికి తిరిగివచ్చినందుకు సంతోషిస్తున్నాను. పాపం, ఆమె ఏదో తప్పు చేసింది. నువ్వు ఆమెను గాఢంగా ప్రేమించావు. ఆమెను కాపాడ్డానికి ప్రయత్నించు" అందామె.

ఆమెవైపు అతడు అదోలా చూశాడు.

"ఆమె ఎందర్నో అలా మోసం చేసింది. డేవిడ్

ముసలివాడిలా నటించేవాడు. తనను పెంచిన మామగా అతడిని ఆమె పరిచయం చేసేది. ఇద్దరూ తోడుదొంగలు. ఆమె నాకు బాగా గుణపాఠం చెప్పింది. నేనెంత చవటనో నాకర్థమైంది" అన్నాడతను.

"నేను వెళ్తాను" అంది ఆరతి.

"ఎక్కడికి?"

"నా ఇంటికి."

"ఇదే నీ ఇల్లు. ఈ ఇంటి దేవతవు నీవే! ఈ ఇంటికి నేను అపకీర్తి తెచ్చాను. నన్ను క్షమించు" అన్నాడు సాగర్.

ఆరతి అతడివైపు నవ్వుతూ చూసింది.

"సాగర్, డిన్నర్ అయిందా?"

"పెట్టేవాళ్ళుంటేగా?"

"నేను లేనట్టూ?" అర్చింది తల్లి.

"ఆ మోసగాళ్ళను నమ్ముకొని నేను నీకూ, ఆరతికీ దూరమయ్యాను. నాకు విస్కీ పోసి నన్ను వాళ్ళు జోకొట్టేవారు. నేను తిండి తినకుండా నే పడుకునే వాడిని. వాళ్ళు బాగా తిని సుఖంగా వుండేవారు."

"రండి, వడ్డిస్తాను" అంది ఆరతి.

కిందనున్న డైనింగ్ హాల్లోకి ఇద్దరూ వెళ్లారు. వున్న పదార్థాలను ఆమె వడ్డించింది. అతడు ఆకలితో తిన్నాడు.

"ఆరతీ, నన్ను క్షమించు! జరిగింది మర్చిపో! ఇటు పైన మన జీవితం ఆనందంగా సాగుతుంది" అన్నాడతను.

"చూద్దాం" అందామె.

—: అ యి పో యి ం ది:—

# ఒక ఇంటర్వ్యూ కథ

వసుంధర

"రిజిస్టర్డ్ లెటర్—" అన్నాడు పోస్టుమాన్.

సుదర్శనం సంతకం పెట్టి కవరు తీసుకుని చించి లోపలి ఉత్తరం చదువుకున్నాడు. అతడికేసే ఆత్రుతగా చూస్తున్న సుబ్రహ్మణ్యం—"రిజిస్టరుపోస్టులో వచ్చింది. అపాయింట్ మెంటు ఆర్డరా?" అన్నాడు.

"కాదు—ఇంటర్వ్యూ లెటరు—" అన్నాడు సుదర్శనం.

"నీ ముఖం చూసి అలాగే అనుకున్నాలే—" అంటూ సుబ్రహ్మణ్యం నిట్టూర్చాడు.

"అలా దిగులుపడకు నాన్నా! ఈ ఇంటర్వ్యూ లెటరు ఇంచుమించు అపాయింట్ మెంటు ఆర్డరులాంటిదే" అన్నాడు సుదర్శనం.

ఎందుకని కూడా సుబ్రహ్మణ్యం అడగలేదు—"పెళ్ళి చేసుకుంటేనే ప్రేయసీ ప్రియులు భార్యాభర్తలవుతారు. ఇంటర్వ్యూ లెటరు ప్రేమలేఖలాంటిది—"

అన్నా డాయన.

"చూడమ్మా—నాన్న నన్నిలా నిరుత్సాహ పరుస్తున్నాడో!" అన్నాడు సుదర్శనం నిరుత్సాహంగా.

"బుద్ధుల్లో ఈయన కల్యాణి చంపి పుట్టారులే కానీ—ఇంతకీ ఈ ఇంటర్వ్యూమీద నీకు బాగా నమ్మకమెందు కుందో చెప్పు—" అంది సుదర్శనం తల్లి కమలమ్మ కొడుకు వంక ఆప్యాయంగా చూస్తూ.

"ఈ ఊళ్ళోనే వెంకోజీరావుగారి కాలేజి వుంది కగా—అది ప్రైవేటు కాలేజి అయినప్పటికీ జీతాలూ అవీ కచ్చితంగా ఇచ్చేస్తారుట. అందులో ఎకనామిక్స్ లెక్చరర్ పోస్టుకి నేను అప్లై చేశాను. నాకు ఎమ్మేలో ఫస్టు క్లాసు వచ్చిందిగా! ప్రిన్సిపాలాఫీసులో పనిచేసే ఆనందరావు చెప్పాడు—అప్లై చేసే నేను తప్పకుండా సెలక్టవుతానని!" అన్నాడు సుదర్శనం.

"ఎందుట? అప్లై చేసేవాళ్ళ కింకెవ్వరికీ ఫస్టుక్లాసు లుండవుటా?" అన్నాడు సుబ్రహ్మణ్యం.

"ఎందుకుండవు? కానీ నాకు ఫస్టు క్లాసు మాత్రమే కాక మంచి మార్కులుకూడా వచ్చాయి. అపైన ఆ కాలేజీ ప్రిన్సిపాలు మోహనమూర్తిగారు రెక మెండేషన్ లెటరు లాంగడట. ఫస్టుక్లాసు—ఎక్కువ మార్కులు—అపైన ఇంటర్వ్యూ పెర్ఫార్మెన్స్—....ఇంటర్వ్యూలో నేను దంచికొట్టేస్తాను తెలుసా?" అన్నాడు సుదర్శనం.

"ఇంటర్వ్యూ లెందుకో తెలుసా? బాగా చదువు కున్న వాళ్ళను తప్పించి—తమకిష్టమైన వాళ్ళను ఎన్నుకునేందుకు...." అన్నాడు సుబ్రహ్మణ్యం.

"ఇంతకీ అవకాశమిస్తే మీరే వాడికీ ఉద్యోగమిచ్చేలా లేరు—" అంది కమలమ్మ.

"అదేమిటే అలాగంటావు. వాడికుద్యోగం రావాలనే కదా నా కోరిక. ఎటొచ్చీ ఇంటర్వ్యూకి ముందే లేనిపోని ఆశలు పెంచుకోవడం నాకిష్టముండదు. ప్రపంచం తెలిసిన వాణ్ణి కాబట్టి అంతా వివరించి చెబుతున్నాను—...."

"నాన్నా! ఈ ప్రపంచంలో మనిషి ప్రాణాలు నిలబెడుతున్నది ఆశ ఒక్కటే!" అన్నాడు సుదర్శనం వేదాంతిలా.

"ఆశను ఎక్కువగా నమ్ముకున్నవాడు తన ప్రాణాలు నిలబెట్టుకోవడం సంగతలాగున్నా — నిరాశ ఎదురైనపుడు—యెదుటివాళ్ళ ప్రాణాలు తీయాలనుకునేటంత ఘోరావేశానికి గురి అవుతాడు—" అన్నాడు సుబ్రహ్మణ్యం.

కమలమ్మ ఈ మాటలు విని కంగారుగా ముందు భర్త వంక, తర్వాత కొడుకు వంకా చూసింది. భర్త కళ్ళలో ఆశ కనబడింది.

## 2

పార్కులో ఓ మూల ఆ జంట కూర్చున్నారు.

"నిన్న రాలేదేం సుభాష్—" అంది సుశీల.

"మా నాన్న దగ్గర్నించి ఉత్తరం వచ్చి మనసు పాడైంది—" అన్నాడు సుభాష్ అదోలా.

"ఏం రాశారేమిటి—మీ నాన్నగారు...."

"నాకోసం నాలుగు సంబంధాలున్నాయట. అందరూ యాభై వేలకు పైగా కట్నమిస్తానంటున్నారుట....—"

సుశీల ముఖం మాడిపోయింది-"మగ పుట్టుక పుట్టావు. అదృష్టవంతుడివి" అందామె.

"నువ్వలాగంటున్నావు. నువ్వు భార్యగా దొరక్కపోతే నా అంత దురదృష్టవంతుడుండడని నేననుకుంటాను"

అన్నాడు సుభాష్.

సుశీల కళ్ళు మెరిశాయి—"నిజంగా?" అందామె.

"ఈ ప్రపంచంలో నీవు తప్ప వేరెవ్వరికీ నేను నిజం చెప్పను. ఎవరైనా సరే—నానుంచి నిజం రాబట్టాలంటే నిన్ను ప్రయోగించుకోవాల్సిందే...."

సుశీల ముఖంలో గర్వం కనబడింది—"అయితే మీ నాన్నగారికేమని రాస్తావు? మన ప్రేమ గురించి చెప్పేస్తావా?"

"మన ప్రేమ గురించి చెప్పేయగానే అయన నన్నింట్లోంచి గెంటేస్తాడు. అదీ నా భయం...."

"నేనుండగా నీవు భయమెందుకు?" అంది సుశీల.

"ఎందుకో చెప్పనా?" అన్నాడు సుభాష్.

అతడిదా ఊరు కాదు. అతడి బాబాయా ఊళ్ళో ఉంటున్నాడు. ఆయనేమో రెండు నెలల క్రితం ఫారిన్ వెళ్ళాడు. ఆయనకో పద్దెనిమిదేళ్ళ కూతురూ, పద్నాలుగేళ్ళ కొడుకూ ఉన్నారు. అతడి పిన్ని సుభాష్‌ను కొన్నాళ్ళపాటు తన దగ్గర వచ్చి ఉండమని కోరింది. ఇంకో నెల్లాళ్ళలో బాబాయొచ్చేదాకా అతడిక్కడే ఉంటాడు.

ప్రస్తుతం సుభాష్ ఎమ్మే ప్యాసై ఉద్యోగ ప్రయత్నాల్లో ఉన్నాడు. ఖాళీగా వున్నాడు కాబట్టి తోడుగా ఉండడానికి పిన్ని అతణ్ని రప్పించుకుంది. పిన్ని కూతురు రత్నకుమారికి సుశీల స్నేహితురాలు. ఆ విధంగా సుశీలకూ సుభాష్‌కీ పరిచయమైంది. తొలి పరిచయంలోనే ఇద్దరికీ ఒకరంటే ఒకరికి ప్రేమ పుట్టింది. అందులోనూ సుభాష్‌కి చొరవ ఎక్కువ. సుశీల అతడంటే బాగా ఆకర్షించబడింది.

"నెల్లాళ్ళలో మా ఇంటికి తిరిగి వెళ్ళిపోవాలి. మా నాన్న నన్నింట్లోంచి గెంటేస్తే ఎవరు నన్నాదరిస్తారు? ఎవరాదరిస్తే వాళ్ళ మీద నాన్న పగబట్టేస్తాడు. అందుకని నాకాళ్ళమీద నేనే నిలబడేదాకా ఆయనతో మన ప్రేమ సంగతి చెప్పలేను...." అన్నాడు సుభాష్.

"చాలామంది రచయితలు, రాసినట్లు ప్రేమ కథల్లో అబ్బాయిలు తండ్రి చాటు బిడ్డలు. అసలబ్బాయిలు అమ్మాయిలను మోసం చేయడానికే ప్రేమిస్తారని నా నమ్మకం...."

"అబ్బాయిలూ అమ్మాయిలూ అంటూ డొంకతిరుగుడు కబుర్లెందుకూ? నా గురించి నువ్వేమనుకుంటున్నావో చెప్పు...."

"ఈ ఊళ్లో మూణ్ణెల్లుండాలి. ఇరవై నాలుగ్గంటలూ పిన్ని, చెల్లెలు, తమ్ముడులతో కూర్చుంటే ఏం కాలక్షేపమవుతుంది. నీకు రొమాన్స్ కావాలి. నాతో స్నేహం చేశావు. తెలివిగా ఆకర్షించావు. మూడు నెలలపాటు నీకు మధురమైన కాలక్షేపం. ఆ తర్వాత నాకు మిగిలేవి కలలు. నువ్వింకో అమ్మాయిని వెతుక్కుంటావు...."

"సుశీలా!" అన్నాడు సుభాష్ — "నువ్విలాగనడం చాలా అన్యాయం. నేను నిన్ను ఏకాంతగా కలుసుకుందుకు ప్రయత్నించలేదు. నీకూ నాకూ మధ్య ఎప్పుడూ దూరముంచడానికే చూస్తున్నాను. నా ప్రేమలో స్వార్థంలేదు...."

"నీ ప్రేమలో స్వార్థమున్నా నేను నీకా అవకాశమివ్వను. నీక్కావలసింది కాలక్షేపం. అదీ మధురమైన కాలక్షేపం...." అంది సుశీల.

"అక్కడే మగాడికీ, ఆడదానికీ తేడా. నా బాధ

నీకరం కావాలంటే నువ్వో మగాడివి కావాలి. ఆడది కబుర్లతోనూ, ఊహలతోనూ సరిపెట్టుకోగలదు. మగాడి కలా కుదరదు. అనుభవం కావాలి. నిన్నిలా కలుసుకోవడం — నీకు మధురం కావచ్చు. నాకు మధురం కాదు...."

సుశీల అతడి వంక జాలిగా చూసి—"ఇంతకీ మన భవిష్యత్తేమిటంటావు?" అంది.

"అంతా మీ నాన్నగారిలో ఉంది—"

సుశీల ఆశ్చర్యంగా – "మా నాన్నగారేం చేయగలరు?" అంది.

"ఏం చేయగలరని కాదు — ఏం చేయలేరూ అని అడుగు...."

సుశీల ఓ క్షణ మాలోచించి—"మీ నాన్నగారు నిన్నింట్లోంచి గెంటేస్తే మా యింటికొచ్చి వుండాలనుకుంటున్నావా?" అంది.

"ఛీ మగాడి కంతకంటే అవమాన మింకొకటి వుండదు...."

"అయితే మరేమిటి?"

"ఈ ఊళ్ళో వెంకోజీరావుగారి కాలేజీవుంది తెలుసు కదా!"

సుశీల నవ్వి—"వేళాకోళ మాడుతున్నావా? మా నాన్నగారా కాలేజికి ప్రిన్సిపాలని నీకు తెలియదా?" అంది.

"అందుకే కదా— తెలుసా అని కాకుండా తెలుసు కదా అనడిగాను"....అని—"ఆ కాలేజీలో ఎకనామిక్స్ లెక్చరర్ పోస్టు అడ్వర్టయిజైంది. ఆ పోస్టుకి నేను అప్లై చేయాలనుకుంటున్నాను..." అన్నాడు సుభాష్.

సుశీల ముఖం గంభీరంగా అయిపోయింది—"మా నాన్నగారంటే నాకు చాలా భయం. ఆయన చాలా స్ట్రిక్టు."

"నువ్వేమీ చేయక్కర్లేదు. ఒకసారి నీ అమ్మగారిని మా పిన్నిదగ్గరకు తీసుకుని వెళ్ళు. అక్కడ మా పిన్ని అన్నీ మీ అమ్మకు చెబుతుంది...."

"అంటే మన ప్రేమగురించి మీ పిన్నికి చెప్పేశావా?" అంది సుశీల కంగారుగానూ, భయంగానూ.

"ప్రేమిస్తే భయమెందుకు? మన ప్రేమకు పెద్దలే విధంగానూ ఎదురు చెప్పలేరు. అడ్డొచ్చేదల్లా డబ్బొక్కటే! ఆ డబ్బు నాకక్కర్లేదు...."

"అంటే ఉద్యోగమే నీకు కట్నమంటావు....".

"ఉద్యోగం కట్నమెలాగవుతుంది? అది నా అర్హతతో సంపాదించుకుంటున్నది...." అన్నాడు సుభాష్.

"అర్హతతో సంపాదించుకునే మాటైతే మా నాన్నగారి సాయం నీకెందుకు? ఇంటర్వ్యూలో అది చూస్తారుగా...." అంది సుశీల.

"అర్హతనుబట్టి ఇంటర్వ్యూలో ఎన్నిక చేసే మాటైతే నేనీపాటికే ఉద్యోగం సంపాదించుకుని వుండేవాణ్ణి" అన్నాడు సుభాష్.

సుశీల నవ్వుతూ — "అయితే ఇంకేం—ఉద్యోగం కట్నంగానే అడుగుతున్నావన్న మాట!" అంది.

"నువ్వేమైనా అనుకో—త్వరగా నీతో జీవితం ప్రారంభించాలన్న నా కోరిక తీరాలంటే ఈ ఉద్యోగం నాక్కావాలి. అందుకు నువ్వు కొంత సాయంచేయక తప్పదు" అన్నాడు సుభాష్.

"నేను తప్పకుండా ప్రయత్నిస్తాను. అయితే సామీ దాట్టే ఆశలు పెట్టుకోకు...." అంది సుశీల.

# 3

"మధ్యాహ్నం రాధాబాయి గారింటికెళ్ళానండీ?" అంది సావిత్రమ్మ.

"రాధాబాయెవరు?" అన్నాడు మోహనమూర్తి. ప్రశ్నైతే వేశాడుకానీ ఆయన ముఖంలో యేమాత్రమూ ఆసక్తి కనబడలేదు.

"టంగుటూరి వారి వీధిలో వున్నారూ — వాళ్ళు!"

"ఓహో" అని ఊరుకున్నాడు మోహనమూర్తి.

"ఆ రాధాబాయి బావగారబ్బాయి సుభాష్. ఎమ్మే ఎకనామిక్స్ చదివాడు. కుర్రాడు చక్కగా వుంటాడు. మనవాళ్ళే?" అంది సావిత్రమ్మ.

"అలాగా"—అంటూ మోహనమూర్తి పడకకుర్చీలో కూర్చుని పేపరు తీశాడు.

"ఆ అబ్బాయి కట్నం లేకుండా పెళ్ళి చేసుకుంటూ టండీ" అంది సావిత్రమ్మ కళ్ళు పెద్దవిచేసి.

మోహనమూర్తి చేతిలోని పేపరు జారిపోయింది— "కట్నం లేకుండా పెళ్ళా? ఆ అబ్బాయికేమైనా లోప ముందా...." అన్నాడాయన అప్రయత్నంగా.

"లోపమూ లేదు పాడూ లేదు. కుర్రాడు నిక్షేపంలా వున్నాడు. మన సుశీల వాళ్ళింటి కెళ్ళినప్పుడు చూశాట్ట. పిల్ల నచ్చిందిట...."

"అయితే ఇంకేం—వాళ్ళ పెద్దలతో మాట్లాడదాం!"

"మాట్లాడొచ్చు కానీ అతడింకా పెళ్ళి చేసుకోనంటు న్నాట్ట."

మోహనమూర్తి విసుగ్గా—"ఇంతకీ నువ్వేం చెప్పాలను కుంటున్నావో నా కర్థం కావడంలేదు" అన్నాడు.

"అతడు మీ కాలేజీలో లెక్చరర్ పోస్టుకి అప్లై చేశాడు...."

సావిత్రమ్మ ఇంకా ఏదో చెబుతూండగానే—"అర్థ మయిందిలే—ఇంకేమీ చెప్పకు...." అన్నాడు మోహన మూర్తి.

"ఏమిటర్థమయిందీ?"

"ఆ కుర్రాడు నాద్వారా ఉద్యోగం సంపాదించాలని చూస్తున్నాడు."

"అందులో తప్పేముంది?"

"తప్పేం లేదు. కానీ ఉద్యోగానికి నామీద ఆధార పడే చవటను నా అల్లుడిగా చేసుకోలేను...." అన్నాడు మోహనమూర్తి.

సావిత్రమ్మ నోరు నొక్కుకుని—"హవ్వ—అవేం మాటలండీ—అతిడేం తెలివితక్కువవాడు కాదు. ఎమ్మే ఫస్టుక్లాసులో పాస్సయ్యాడు" అంది.

"సావిత్రీ—నా సంగతి నీకు తెలుసుగా!" అన్నాడు మోహనమూర్తి గంభీరంగా.

"మీకుద్యోగం ఎవరి సిఫారసూ లేకుండా వచ్చిం దంటారు. అంతేగా! ఆ రోజుల్లో చదువుకున్నవాళ్ళు తక్కువ. ఉద్యోగాలెక్కువ" అంది సావిత్రమ్మ.

"నేనప్పటిమాట కాదు — ఇప్పటిమాట అడుగు తున్నాను. నా సంగతి నీకు తెలుసుగా...." అన్నాడు మోహనమూర్తి మళ్ళీ.

"ఇన్నేళ్ళు కాపురం చేసినా నా గురించి మీకు తెలిసింది కనుకనా—మీ గురించి నాకు తెలియడానికి!" అనేసింది సావిత్రమ్మ.

"తెలియదన్నావు కాబట్టి చెబుతున్నాను విను. ఇంటా బయటా మచ్చలేని జీవితం నాది...."

"అయితే యిప్పుడేమైందిట?"

"నువ్వు చెప్పిన ఆ సుభాష్‌కి మెరిట్ వుంటే తనే సెలక్టవుతాడు. అయితే కాలేజీలో సెలక్టయ్యాడంటే-సుశీలకూ అతడికీ పెళ్ళి జరుగదు."

"ఎందుకని?"

"అంతా యేమని చెప్పుకుంటారు? ప్రిన్సిపాలుగారు మంచి పత్రాణి పట్టి ఉద్యోగం వేయించి అల్లుణ్ని చేసుకున్నాడని! అది నాకు నచ్చదు...."

"అందుకని...."

"అతడికి సుశీల నచ్చి పెళ్ళి చేసుకోవాలనుకున్నాడనుకో—ఈ ఉద్యోగానికి అప్లై చేయకూడదు...." అని—"అయినా లాస్టు డేటైపోయిందిగా. మేము ఇంటర్వ్యూ లెటర్సుకూడా పంపేశాం" అన్నాడాయన.

"అతడప్లై చేసేశాట్ట...."

"అయితే ఇంటర్వ్యూకి రాకూడదు...."

"ఇదేం ఘోరమండీ — ఈ రోజుల్లో ఎరచూపించి అల్లుళ్ళను పట్టుకుంటున్నారందరూ. మీరేమో చేతిలో ఉద్యోగముండీ అది అల్లుడు కాదగ్గవాడి కివ్వనంటున్నారు...." అంది సావిత్రమ్మ.

"చెప్పానుగా—మచ్చలేని జీవితం నాది" అన్నాడు మోహనమూర్తి.

# 4

"వెతకబోయిన తీగ కాలికి తగిలింది" అన్నాడు సుద ర్శనం సంతోషంగా.

"ఏమిటీ విశేషం-నన్ను తీగను చేసేశావు" అన్నాడు ఆనందరావు కుతూహలంగా.

"అన్నీ ఇక్కడెందుగ్గానీ—ఆలా కాఫీ హోటలుకి పోదాం పద!" అన్నాడు సుదర్శనం.

ఇద్దరూ దగ్గర్లో వున్న "పంచవటి" హోటలుకు వెళ్ళి ఫామిలీ సెక్షన్లో కూర్చున్నారు.

"ఆడాళ్ళు లేకుండా ఫామిలీ సెక్షన్‌లో కూర్చోవాలంటే తగని సిగ్గు నాకు. అందులోనూ ఇక్కడ మరీను. ప్రేయసీ ప్రియులకోసమున్నట్లు ఇద్దరిద్దరికో చిన్న అపార్టుమెంట్ ...." అన్నాడు ఆనందరావు ఇబ్బందిగా.

"అందుకే గదా ఇక్కడికి తీసుకొచ్చాను. మనమాటలింకెవ్వరూ వినకూడదు...." అని ఇంకా యేదో అనబోతూండగా అక్కడ ప్రత్యక్షమైన సర్వర్ని చూసి— "రెండు మిక్స్చర్ ఊతప్పాలు" అన్నాడు సుదర్శనం.

"అరె—నాకు ఊతప్పం చాలా ఇష్టమని నీ కెలా తెలుసు?" అన్నాడు ఆనందరావు ఆశ్చర్యంగా.

"ఊతప్పమైతే తయారవడానికి చాలా సేపు పడుతుంది. సర్వరు మనల్ని బాధించడని అది చెప్పాను."

"ఇంతకీ యేమిటంత రహస్యం?"

"నీకు తెలుసు...."

"నిజంగా నాకు తెలియదు...."

"నిరుద్యోగిని—నాకు నీతో రహస్యమేముంటుంది?"

ఆనందరావు నాలిక్కరుచుకుని — "అయాం సారీ బ్రదర్ ....ఆ విషయమే మర్చిపోయాను. అప్లికేషన్నుకి

లాస్టు డేటే అప్పుడే వారంరోజులు దాటింది—ఇంటర్వ్యూ లెటర్సు ఈ వారమే పంపామనుకుంటాను" అన్నాడు.

"నాకు లెటరుకూడా అందింది కానీ—ఇందులో నా అవకాశాలేమిటో చెప్పగలవా?"

ఆనందరావు క్షణం మౌనం వహించి—"నువ్వు చాలా అదృష్టవంతుడివి" అన్నాడు.

సుదర్శనం కళ్ళు మెరిశాయి—"ఏం?"

"మోహనమూర్తిగారు చాలా గొప్పవాడు. దేశంలో అలాంటివాళ్ళు మరికొందరుంటే యెంతో బాగుండేది!" అని నిట్టూర్చాడు ఆనందరావు.

"ఎందుకని?"

"వచ్చిన అప్లికేషన్సన్నీ స్క్రీన్ చేయడమైనాక మొత్తం పదిమందికి ఇంటర్వ్యూ లెటర్సు పంపారు. అందులో నీదే మొదటి పేరు. అంటే అందరిలోకీ నువ్వే బెస్టు కాండిడేటువి ..."

"అంటే నేను తప్పక సెలక్టవుతానన్న మాట...."

"నూటికి నూరుపాళ్ళ గ్యారంటీ లేదు...."

"ఎందుకని?"

ఆనందరావు నవ్వి—"ఇంటర్వ్యూ లెటరుకీ అపాయింట్ మెంట్ ఆర్డరుకీ తేడా వుంటుంది కదా...." అన్నాడు.

"సరిగ్గా—ఇదే నాన్నగారుకూడా అన్నారు...."

"బాగా దగ్గర స్నేహితుడివి కాబట్టి నీకింకో రహస్యం చెబుతున్నాను. ఇది నీలో ఆశలు పెంచనూవచ్చు. త్రుంచనూ వచ్చు...."

"చెప్పు!" కుతూహలంగా అన్నాడు సుదర్శనం. ఆనందరావు చెప్పడం మొదలుపెట్టాడు.

"వెంకోజీరావు కాలేజీలో ఎకనామిక్స్ లెక్చరర్ పోస్టుకి అప్లై చేసిన వారిలో సుభాష్ అని ఇంకో కాండిడేటున్నాడు. మెరిట్ ప్రకారం అతడి నంబరు మూడు. ఇంటర్వ్యూలో అర్హతలతో పాటు—ఇంటర్వ్యూ పెర్ఫార్మెన్స్‌కు కూడా కొన్ని మార్కులుంటాయి. ఆ మార్కుల్ని అడ్జస్టు చేయడంలోనే ఉంటుంది సెలక్షనంతా. కేవలం ఆ మార్కుల్ని ఉపయోగించి అర్హతల ప్రకారం ఆఖరున వున్నవాడిని పోస్టుకు ఎన్నిక చేయవచ్చు.

సుభాష్ తెలివైనవాడిలా కనబడుతున్నాడు. అతడు ఉద్యోగం కోసం అట్నించి నరుక్కుని వస్తున్నాడు."

"అంటే?" అన్నాడు ఆనందరావుని మధ్యలో ఆపుతూ—సుదర్శనం.

"సుభాష్ మోహనమూర్తిగారమ్మాయి సుశీలను ప్రేమించాడు. కట్నం లేకుండా పెళ్ళిచేసుకుంటానంటున్నాడు...."

"అయితే ఇంక నాకేం ఛాన్సుండదు—" నీరసంగా అన్నాడు సుదర్శనం.

"అలా నిరుత్సాహపడకు. పూర్తిగా నేను చెప్పేది విను...." అంటూ ఆనందరావు తిరిగి చెప్పడం ప్రారంభించాడు.

మోహనమూర్తి ఆనందరావుని కలుసుకుని—"నీవల్ల ఓ సాయం కావాలి నాకు" అనడిగాడు. ప్రిన్సిపాలంతటివాడు తనని స్వయంగా కలుసుకుని సాయమడిగే సరికి ఆనందరావు తెల్లబోయాడు. మోహనమూర్తి అతడిని తన పెర్సనల్ రూంలోకి తీసుకుని వెళ్ళి సుభాష్ గురించి చెప్పాడు. ఈ విషయమాయన తనకెందుకు చెప్పాడో

ఆనందరావు కర్థం కాలేదు.

అసలు విషయమేమిటంటే సుభాష్ ప్రిన్సిపాల్ కూతురు సుశీలను ప్రేమించాడు. ఆమెతో మాట్లాడి ఆమె కూడా తనంటే యిష్టపడేలా చూసుకున్నాడు. ఇద్దరికీ పెళ్ళిచేయడం మోహనమూర్తి కీ యిష్టమే!

"వీళ్ళ పెళ్ళి జరగాలంటే—సుభాష్ ఆ యింటర్వ్యూకి రాకూడదు. కావాలని నేనతణ్ని సెలక్ట్ చేయకపోయినా ప్రమాదవశాత్తూ అతడు సెలక్టు కావచ్చు. అప్పుడీ పెళ్ళి జరగదు. ప్రేమకావాలో, ఉద్యోగం కావాలో అతడు తేల్చుకోవాలి...."

"నేనేం చేయాలో, చెప్పండి సార్!" అన్నాడు ఆనందరావు.

"నువ్వు సుభాష్‌కు నా ఆశయాల గురించీ, ప్రస్తుత పరిస్థితి గురించీ చెప్పాలి" అన్నాడు మోహనమూర్తి.

ఆనందరావు సరేనన్నాడు కానీ ఇంకా సుభాష్‌ని కలవలేదు. ప్రిన్సిపాల్ గారికి మాత్రం తానతణ్ని కలిశానని చెప్పాడు.

"ఇంతకీ దీని ఫలితమేమవుతుందంటావు?" అన్నాడు సుదర్శనం.

"వ్యవహారం చాలా తిరకాసుగా వుంది. చూస్తూ చూస్తూ ఏ ఆడపిల్ల తండ్రీ కూడా కాబోయే అల్లుడి ఉద్యోగం రాకుండా ఆపడు. మోహనమూర్తి గారు చాలా స్ట్రిక్టు అని నాకు తెలుసు. ఆయనకు కాలేజీలో చాలా మంచి పేరుంది. ఆయన తన పేరు కాపాడుకుందుకు ప్రయత్నిస్తున్నాడు. అంతవరకూ చెప్పగలను...."

"అయితే ఆ సుభాష్ ఉద్యోగం రాకపోవచ్చు...."

"రాకపోవచ్చు. రావచ్చు. నువ్వోసారి వెళ్ళి ఆ

సుభాష్‌ని కలుసుకోకూడదూ?" అన్నాడు ఆనందరావు.

"ఎందుకు?"

"నేను చెప్పాల్సిన మాటలు నువ్వతడికి చెప్పు....అటు నా బాధ్యతా తీరుంది. నీకు పనీ జరుగుతుంది...."

సరిగ్గా అప్పుడే ఊతప్పాలు వచ్చాయి.

## 5

పువ్వులలుంగీమీద అడ్డచారల బనియన్ వేసుకున్నాడు గోపీ. మనిషిని చూడగానే గూండాలా అనిపించడానికి అతడి మీసాలు కారణం కావచ్చు. అతడికి వయసొట్టే వుండదు కానీ బాగా పెద్దవాడిలా కనపడతాడు.

గోపీ చేతిలో యేదో సెక్స్ పుస్తకం వుంది. ఒక కాలు స్టూలుమీద పెట్టి, రెండో కాలు నేలమీదఉంచి— నిలబడే అతడా పుస్తకం చదువుతున్నాడు. అలాంటి పుస్తకాలు చదవడం అతడికి బాగా అలవాటయుండాలి. అతడి ముఖం చూస్తుంటే ఏ ఆవేశమూ కనబడదు. అప్పుడతడి ముఖం పిల్లల కథలు చదువుతున్న పెద్దవాడి ముఖంలా వుంది.

అప్పుడెవరో తలుపు తట్టారు.

గోపీ చదువుతున్న పుస్తకాన్ని మూసేసి ఎదురుగా వున్న డ్రాయరు సొరుగులో పెట్టి—వెళ్ళి తలుపుతీసి— "అరే—నువ్వా—సుదర్శనం!" అన్నాడు.

సుదర్శనం, గోపీ బియ్యేలో క్లాస్ మేట్సు. గోపీ బియే ఫెయిలయ్యాడు. ప్యాసు కావడానికి ప్రయత్నం చేయలేదు.

గోపీని, సుదర్శనాన్ని పక్కపక్కన చూస్తే ఇద్దరూ క్లాస్ మేట్సనిపించరు.

"నీతో పనుండి వచ్చాను...." అన్నాడు సుదర్శనం.

"నాతో నీకు పనా?" అన్నాడు గోపీ నమ్మలేనట్లు.

కాలేజీ రోజుల్లో క్లాసులో గోపీ అల్లరి బాగా చేసేవాడు. సుదర్శనం అతడి పక్కనే కూర్చునేవాడు. క్లాసు పరీక్షల్లో తన పేపర్లోంచి గోపీని కాపీ కొట్టుకోనిచ్చేవాడు సుదర్శనం. ఇద్దరివీ భిన్నధృవాలే అయినా ఇద్దరి మధ్యా ఆకర్షణకు అదే కారణమయిందేమో! ఇద్దరిదీ మంచి స్నేహం.

సుదర్శనం బియ్యే సెకండ్ క్లాసులో ప్యాసై తర్వాత ఎమ్మే చదివి అందులో ఫస్టు క్లాసు తెచ్చుకున్నాడు. గోపీ గూండాగా జీవితంలో సెటిలయ్యాడు. అతడు తన చదువు, సంస్కారం, తెలివితేటలు ఉపయోగించి-సమాజంలో ప్రజాశ్రేయస్సు పేరు చెప్పి దేశద్రోహ చర్యలు చేసే కొందరు గొప్పవాళ్ళ కుపయోగపడుతున్నాడు. అందువల్ల అతడికి అటు డబ్బుకూ లోటుండడం లేదు. తన వృత్తిలోని ప్రమాదమతణ్ని బాధించడంలేదు.

"అవును నీతోనే!" అంటూ సుదర్శనం అతడికి తన ఉద్యోగంకథ మొత్తం చెప్పాడు.

"చాలా బాగుంది. ఇప్పుడు నేనేం చేయాలి?" అన్నాడు గోపీ.

"నువ్వా సుభాష్‌ని కలుసుకుని ఇంటర్వ్యూకి వెళ్లొద్దని బెదిరించాలి. అయితే నేను పంపినట్లు చెప్పకూడదు. ప్రిన్సిపాల్ మోహనమూర్తిగారు పంపినట్లే అతడు భావించాలి...." అన్నాడు సుదర్శనం.

"ఉద్యోగం గురించి ఇలా దిగజారిపోయావా?" అన్నాడు గోపీ.

"ఇందులో దిగజారి పోవడమేముంది? సుభాష్ సుశీలను ప్రేమించాడు. సుశీల సుభాష్‌ను ప్రేమించింది

వాళ్ళిద్దరికీ పెళ్ళి జరగాలని సుశీల తండ్రి కూడా అనుకుంటున్నాడు. సుభాష్ ఇంటర్వ్యూకు వెళ్ళకపోవడం వల్ల ముగ్గురి కోరికలు తీరతాయి. వాటితోపాటు కలిసి నాలుగో కోరిక నాది—" అన్నాడు సుదర్శనం.

"సమర్థించుకోవడం చేతనైనవాళ్ళు మర్యాదస్థులు. చేతకానివాళ్ళు గూండాలు. ఈ తేడా ఒక్కటి తీసేస్తే ప్రపంచంలో అందరూ సెరసులే!" అని—"ఏమైతేనేం-నేనీపని తప్పక చేస్తాను. అందుకు రెండు కారణాలున్నాయి. ఒకటి నువ్వంటే నాకిష్టం. రెండు—ఈ పని చాలా సులభమైనది. చదువుకున్న కుర్రాళ్ళను బెదిరించడమంత సుఖమైన పని మరొకటుండదు—" అన్నాడు గోపీ.

"చాలా థాంక్స్ గోపీ!" అన్నాడు సుదర్శనం.

"థాంక్స్ సంగతలాగుంచు. ఆ సుభాష్‌ని బెదిరిస్తే చాలా—నా నుంచి ఇంకా సాయమేదైనా కావాలా?" అన్నాడు గోపీ.

"అంటే?"

"కావాలంటే ఆ ప్రిన్సిపాలునే బెదిరించి నీకుద్యోగం వచ్చేలా చేయగలను...." అన్నాడు గోపీ.

"అంత దూరం వద్దులే... ఈమాత్రం సాయం చాలు" అన్నాడు సుదర్శనం. ప్రిన్సిపాలుని బెదిరించడం వరకే గోపీ చేయగలడు కానీ ఆ విధంగా తనకుద్యోగం రాదని సుదర్శనానికి బాగా తెలుసు.

## 6

పార్కులో ఒకరికొకరు ఎదురుగా కూర్చున్నారు సుశీల, సుభాష్. సుభాష్ తీవ్రాలోచనలో వున్నాడు.

"మీ నాన్న దీనికింత హడావుడి చేయడం నాకిష్టం

లేదు__" అన్నాడు సుభాష్ కాసేపాగి.

"చెప్పానుగా—ఆయన చాలా స్ట్రిక్ట్...."

"అంతగా స్ట్రిక్టయితే—ఉద్యోగం నాకివ్వొద్దను. కానీ ఇంటర్వ్యూకి రావొద్దంటాడేమిటి ఈయన...." అన్నాడు సుభాష్.

"నీ క్వాలిఫికేషన్సు బాగున్నాయి. అందువల్ల ఇంటర్వ్యూలో సెలక్టయ్యే అవకాశాలు బాగా వున్నాయి. ఏ కారణంవల్ల నువ్వు సెలక్టయినా_కాబోయే అల్లుడని నీకుద్యోగమిచ్చారని — ఆయనకు చెడ్డ పేరు వస్తుంది. అదాయన భరించలేరు. అందుకోసం నిన్నల్లుడిగా చేసుకోరు. అది నీకిష్టమేనా?"

"అయితే నన్నేం చేయమంటావ్?"

"నీకు నేను కావాలో—ఉద్యోగం కావాలో నిర్ణయించుకో...."

"రెండూ వచ్చే అవకాశమున్నప్పుడు—ఒకటెందుకు వదులుకోవాలి?"

"రెండూ వచ్చే అవకాశంలేదు నీకు...."

"ఎందుకని?"

"నీకు మా కాలేజీలో లెక్చరరుద్యోగం వస్తే—మా నాన్నగారు మన పెళ్ళికొప్పుకోరు...."

"నీ పెళ్ళి మనిష్టప్రకారం జరుగుతుందా—మీ నాన్న ఇష్టప్రకారం జరుగుతుందా?" గంభీరంగా అడిగాడు సుభాష్.

"అంటే?"

"నాకుద్యోగం వచ్చిందనుకో. మీ నాన్న మన పెళ్ళి కొప్పుకోలేదనుకో. అప్పుడు నువ్వు నన్ను పెళ్ళిచేసుకుంటావా—లేదా?"

"మా నాన్నగారిష్టం లేకుండానా?"

"నీకు మైనారిటీ తీరింది. నాకుద్యోగముంటుంది. అయినా నా పెద్దలు, ఇటు నీ పెద్దలూ ఒప్పుకోకపోతే నేం—నీకు నేనూ, నాకు నువ్వూగా హాయిగా బ్రతక లేమా?"

సుశీల కళ్ళు మెరిశాయి—"ఇలా నేనెప్పుడూ ఆలో చించలేదు సుభాష్! ఇదేదో బాగానే వుందనిపిస్తోంది."

"అందుకే — నేను ఇంటర్వ్యూకి వెళ్ళి తీరతాను. నాకుద్యోగం వస్తే—మీ నాన్నకిష్టం లేకపోయినా మన పెళ్ళి ఆగదు...." అన్నాడు సుభాష్.

"జస్టేమినిట్—మిస్టర్ సుభాష్!" అన్న మాటలు వినిపించి ఆ ప్రేమికుల జంట ఉలిక్కిపడి తలెత్తి చూసింది.

వారికి గోపీ కనిపించాడు.

అతణ్ణీ, అతడి వేషాన్నీ చూసి ఇద్దరూ నివ్వెర బోయారు.

"కంగారు పడకండి. నన్ను మీకొక్కలసినవాళ్ళే పంపించారు...." అంటూ గోపీ వాళ్ళ కెదురుగా కూర్చు న్నాడు.

"ఎవరు నువ్వు?" అన్నాడు సుభాష్.

"నా పేరు గోపీ. ఈ ఊళ్ళో గూండాగా నాకు మంచి పేరుంది. అందులోనూ నేను చదువుకున్న గూండాని...."

"నీకు నేనెలా తెలుసు?"

"తెలియని వాళ్ళను తెలుసుకోవడం, తెలియని వాళ్ళకు తెలియజెప్పడం నా ప్రత్యేకత...." అంటూ గోపీ ఓసారి మీసం దువ్వుకున్నాడు.

సుశీల భయంగా — "సుభాష్ — నాకు భయంగా వుంది—" అంది.

"మీ నాన్న పంపిన మనిషిని. నేనంటే నీకు భయ మెందుకు?" అన్నాడు గోపీ హుందాగా నవ్వుతూ.

"ఎవరు నువ్వు?" అంది సుశీల అతడి మాటలకు తెల్లబోయి.

"మీ ఇద్దరికీ మీ నాన్న అభీష్టం ప్రకారం పెళ్ళి జరగాలనుకుంటున్న వాణ్ని...." అన్నాడు గోపీ.

సుభాష్ మాట్లాడకుండా గోపీ వంక చురుగ్గా చూశాడు.

"అలా చూసి లాభంలేదు. నేను చెప్పినట్లు వినాలి" అన్నాడు గోపీ.

"ఏమిటి నువ్వు చెప్పేది?"

"వెంకోజీరావు కాలేజీలో ఎకనామిక్స్ లెక్చరర్ పోస్టుకి ఇంటర్వ్యూకి నువ్వు వెళ్ళకూడదు...."

"ఎందుకని?"

"చూడు మిస్టర్ సుభాష్! నేను సీదాసాదామనిషిని. అయితే గూండాను. నన్ను ప్రశ్నలడగడం నీకు మంచిది కాదు. ఎందుకంటే నా జవాబుల్ని నువ్వు అరాయించు కోలేవు...." అన్నాడు గోపీ.

"నేనూ గూండాలకు భయపడేవాణ్ని కాదు. నీ జవాబుల్నే కాదు—అవసరమైతే నిన్నే అరాయించు కోగలను—" అన్నాడు సుభాష్ కోపంగా.

"అయితే అరాయించుకో—" అంటూ తన జేబు లోంచి ఓ బటన్ నైఫ్ తీశాడు గోపీ. అతడు బటన్ నొక్కగానే ఆరంగుళాల చాకు బైటకు వచ్చింది. అది తళతళ మెరుస్తోంది.

సుభాష్ ఏదో అనాలని పెదవి కదిపాడు. కానీ గొంతు పెగలలేదు. అతడి చూపులా చాకుమీదనే నిలబడ్డాయి.

"ఇంటర్వ్యూకి నువ్వు వెళ్ళవు. ఒకవేళ నామాట కాదని బయల్దేరావా—దీంతో నే ఆ రోజు నిన్నాపవల్సి వుంటుంది—" అనేసి గోపీ అక్కణ్నించి లేచి వెళ్ళిపోయాడు. అతడు వెళ్ళినా అక్కడ కాసేపు నిశ్శబ్దం అలాగే వుండిపోయింది.

"సుభాష్—ఏమిటిదంతా?" అంది సుశీల నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ.

"ఇది-మీ నాన్న తన ప్రిస్టేజిని నిలబెట్టుకునే పద్ధతి!" అన్నాడు సుభాష్.

అతడి గొంతులోని విసురు, వెటకారం సుశీల కర్థమయ్యాయి.

# 7

"నాన్సెన్స్!" అన్నాడు మోహనమూర్తి.

"మీ వ్యవహారమంతా నాన్సెన్స్ గానే వుంది. ఆఖరికి మీరిలా దిగజారిపోతారనుకోలేదు. కాబోయే అల్లుడికి ఉద్యోగ మిప్పించడంవల్ల మీ పరువు పోదు. ఏ పనికైనా గూండాలను నియమించడం మీ జీవితంలో మాయని మచ్చ...." అంది సావిత్రమ్మ.

"సావిత్రీ—నీకర్థంకావడంలేదా—ఇది మనమ్మాయీ, ఆ అబ్బాయీ కలిసి చేస్తున్న అబద్ధపు ఆరోపణ. ఇది నువ్వెలా నమ్ముతున్నావు?" అన్నాడు మోహనమూర్తి బాధగా.

"అమ్మాయబద్ధం చెప్పదు. సుభాష్‌ని తను ప్రేమించాన్న విషయమే అది మన దగ్గర దాచలేదు...." అం

సావిత్రమ్మ.

"నువ్వు నాకంటే యెక్కువగా దాన్ని నమ్ము తావా?"

"ఊఁ."

"నేనలాంటి పనులెందుకు చేస్తాను?"

"ఎందుకో సుభాష్ చెప్పాడు—అమ్మాయికి...."

"ఎందుకట?"

"వీరరాఘవయ్యగారికీ వూళ్ళో నాలుగు పాపులున్నాయి. ఆయన తలచుకుంటే ఈ వూళ్ళో యెంత పెద్దవాళ్ళనైనా నాశనం చేయగలడు ..."

"అయితే?"

"ఆయన మూడో కొడుకు నాగభూషణం మీ కాలేజీలో లెక్చరర్ పోస్టుకి అప్లై చేశాడు. అతడికింటర్వ్యూ వచ్చింది...."

"వస్తే?"

"అసలతడికి ఇంటర్వ్యూయే రాకూడదు. అయినా వచ్చింది. ఇప్పుడుద్యోగమూ వస్తుంది...."

"అలాగా—ఇంకా నీకేం తెలుసో చెప్పు...." వెటకారంగా అన్నాడు మోహనమూర్తి.

సావిత్రమ్మ చలించలేదు. ఆమె చెప్పుకుపోసాగింది.

వీరరాఘవయ్య మోహనమూర్తిని కలుసుకుని హెచ్చరించడంవల్లనే నాగభూషణానికి ఇంటర్వ్యూ పిలుపు వచ్చింది. ఉద్యోగంకూడా అతడికే ఇవ్వక తప్పదు. ఆ విషయంలో మోహనమూర్తి అసహాయుడు. అందువల్ల కావాలనుకున్నా సుభాష్‌కాయన ఉద్యోగం ఇప్పించలేడు. ఆ విషయం ఒప్పుకోడానికి అహం అడ్డువస్తోంది. ఇంటర్వ్యూకని వచ్చి సెలక్టుకాకపోతే సుభాష్ సుశీలను

కాదంటాదేమోనని భయపడి ఆయన ముందరి కాళ్ళకు బంధం వేసున్నాడు.

"అయితే నేనేం చేయాలంటావు?"

"సుభాష్‌కు నిజం చెప్పేయండి. అతడు మిమ్మల్నర్థం చేసుకుని మీకు సహకరిస్తాడు...." అంది సావిత్రమ్మ.

"నిజం నీకు చెబుతాను. అది నువ్వు సుభాష్‌కు చెప్పు...."

"ఊఁ."

"నాగభూషణం వీరరాఘవయ్య అసలు కొడుకు కాదు. ఆయన అసలు కొడుకులందరూ వ్యాపారంలోనే వున్నారు. వీరరాఘవయ్య ఉంపుడుకత్తె కొడుకు నాగభూషణం. ఇది జగమెరిగిన సత్యం. కానీ ఎవ్వరూ ఆ మాట అతడి యెదురుగుండా అనరు. నాగభూషణం అప్లికేషన్సులో తన తండ్రి పోయినట్లు రాస్తాడు. కానీ వీరరాఘవయ్య పూర్తిగా అతడి ఆలనా పాలనా చూసుకుంటాడు...."

మోహనమూర్తి యింకా యేదో చెప్పబోతూండగా-

"ఈ సోదంతా నాకెందుకుగానీ — అసలు విషయం చెప్పండి...." అంది సావిత్రమ్మ విసుగ్గా.

"స్క్రీనింగ్‌లో నాగభూషణం అప్లికేషన్ తీసేయాల్సిందే. మేమసలు యెనిమిది పేర్లు ఇంటర్వ్యూకని సెలక్టు చేశాం. ఈలోగా వీరరాఘవయ్యనుంచి ఒత్తిడి వచ్చింది. నాగభూషణం పేరు ఇంటర్వ్యూకి పిలవడానికి ఎన్నుకోక తప్పలేదు. అతడి గురించి అలాంటివాడినే మరొకణ్ని కూడా కలపాల్సొచ్చింది. మొత్తం పది మందిని పిలిచాం—"

"అంటే — ఇంకేం — సుభాష్ చెప్పింది నిజమేనన్న

మాట. వీరరాఘవయ్య ఒత్తిడికి లొంగిపోయాక-మీరింకా స్ట్రిక్టేమిటండీ—" అంది సావిత్రమ్మ.

"వీరరాఘవయ్య స్వయంగా నన్ను కలుసుకున్నాడు. ఆయనకు మా కాలేజి కమిటీ మెంబర్సు చాలామంది తెలుసు. ఏటా మా కాలేజీకి యేదో రూపేణా విరాళా లిస్తూంటాడాయన. ఆయన మాటకు కొంత విలువివ్వాక తప్పదు. అంతవాడూ యేమన్నాడో తెలుసా—మూర్తి గారూ, వాడిని ఇంటర్వ్యూకి పిలిస్తే చాలు. సెలక్టు చేయక్కర్లేదు....అని మరీమరీ వేడుకున్నాడు."

"ఏమైతేనేం—ఒత్తిడికి లొంగి అర్హతలేనివాణ్ని ఇంటర్వ్యూకి పిలిచారా లేదా—సుభాష్ కరెక్టుగానే చెప్పాడన్నమాట!"

మోహనమూర్తి ముఖం ఎర్రబడింది—"నేను ఒత్తిడికి లొంగవచ్చు. అయితే ఇతరుల స్వార్థానికి తల వంచినట్లు నా స్వార్థానికి తలవంచలేను. వీరరాఘవయ్య మాట వినకపోతే నా ఉద్యోగానికేం భంగంరాదు. కష్టమంటూ వుంటే అది మా కాలేజీకి. సుభాష్ ఉద్యోగమంటే అది పూర్తిగా నా స్వార్థానికి సంబంధించిన విషయం."

"అంటే మీరు ఆ నాగభూషణానికే ఉద్యోగ మిస్తారా?"

"అవన్నీ నీ కనవసరం. సుభాష్ సుశీలను పెళ్ళి చేసుకోవాలనుకుంటే—ఈ ఉద్యోగం విషయం మర్చిపోయి తీరాలి."

"మీరు చాలా మొండి....అయితే మీ కూతురికీ మీ పోలికలే వచ్చాయి. ఏం చేస్తారో చూసుకోండి" అంది సావిత్రమ్మ.

# 8

"ఏమోయ్ గోపీ ఖులాసానా?" అన్నాడు వీరరాఘవయ్య.

"ఏదోనండి—మీ దయవల్ల" అన్నాడు గోపీ.

"మా దయేముంది. నువ్వు ఖులాసాగా వుంటేనే మా వంటి వాళ్ళకు ఖులాసా" అని స్వరం తగ్గించి—"నీకు రామేశంగారు తెలుసా?" అన్నాడు.

"ఏ రామేశంగారండీ?" అన్నాడు గోపీ.

"ప్రొఫెసర్ రామేశంగారు—తల్లావఝ్ఝుల వారి వీధిలో వుంటున్నారూ—ఆయన" అన్నాడు వీరరాఘవయ్య.

"తెలుసునండి" అన్నాడు గోపీ.

"రేపు పద్నాలుగో తారీఖున ఆయన ఇల్లు కదలకుండా ఆపాలి నువ్వు. ఒకవేళ ఇల్లు కదిలినా అనుకున్న చోటుకు చేరకూడదాయన."

గోపీ ఆశ్చర్యంగా—"ఎందుకండీ?" అన్నాడు.

"పనుందిలే....!" అన్నాడు వీరరాఘవయ్య.

"పనేమిటో తెలియకుండా పనిలోకి దిగితే ఒక్కోసారి వేడి పుట్టదండి."

"నీ పని నువ్వు చేయి. వేడి అదే పుడుతుంది...." అన్నాడు వీరరాఘవయ్య. ఆయనకింకెక్కువ మాట్లాడ్డం ఇష్టం లేనట్లు అర్థం చేసుకుని గోపీ అక్కణ్నించి సెలవు తీసుకుని తిన్నగా సుదర్శనం ఇంటికి వెళ్ళాడు.

అప్పుడు సుదర్శనం ఇంట్లోనే వున్నాడు. గోపీని చూసి ఆప్యాయంగా తన గదిలోకి ఆహ్వానించాడు.

"నీకు నచ్చని కబురొకటి తెచ్చాను...." అన్నాడు

గోపీ.

"ఏమిటది?" అన్నాడు సుదర్శనం కంగారుగా.

"సుభాష్‌ని నేను బెదిరించాను. అతడికా బెదిరింపు చాలని నేననుకుంటున్నాను. కానీ ఇంటర్వ్యూ రోజు వచ్చేసరికి అతడిలో వేడి పుట్టవచ్చు. ఆ రోజుకతడి న్యాపలా కాద్దామా అనుకున్నాను. కానీ ఆ రోజు నే నాకింకో పని తగిలింది... "

"ఏమిటది?"

"అది నువ్వడక్కూడదు. నేను చెప్పకూడదు. నన్ను నమ్మి నాకెందరో ఎన్నో రకాల పనులు చెబుతారు. అవన్నీ అందరికీ చెప్పేమాటైతే ఇంక నావల్ల ప్రయోజన మేమిటి?"

"చెప్పొద్దులే కానీ—సుభాష్‌ని ఇంటర్వ్యూకి వెళ్ళకుండా ఆపలేవా?"

"ఆపాలంటే ఆ పని ఇంకెవరికైనా అప్పజెప్పాలి. ఇది నీకూ నాకూ మధ్యనున్న రహస్యం. మూడో మనిషికి తెలియడం నా కిష్టంలేదు" అన్నాడు గోపీ.

"అసలు పని జరక్కపోయాక రహస్యం కాపాడి మాత్రం యేమి లాభం?" అన్నాడు సుదర్శనం దిగులుగా.

"ప్రతి నేరానికీ కొన్ని హద్దులుంటాయి. ఈ ఇంటర్వ్యూ విషయంలో ఇంతకు మించి చేయడం న్యాయం కాదు. అదృష్టం బాగుంటే అన్నీ నీకు సహాకరిస్తాయి...." అన్నాడు గోపీ. ఆ తర్వాత అతడెక్కువసేపు వుండలేదు.

గోపీ ఇలా వెళ్ళగానే అలా వచ్చాడు ఆనందరావు. అతడి ముఖంలో ఆత్రుత వుంది.

"ఏమిటి విశేషం?" అని సుదర్శనం ఆనందరావు

పలకరించాడు.

"నీ అదృష్టం బాగోలేదు. ఉద్యోగంమీద ఆశలు పెట్టుకోకు" అన్నాడు ఆనందరావు.

"ఏమయింది?"

"మోహనమూర్తి నేననుకున్నంత స్ట్రిక్టు కాడు. ఇంటర్వ్యూకి ఎన్నికైన అభ్యర్థుల్లో నాగభూషణం అనే వాడిని కలిపాడాయన. అందుకు కారణం వీరరాఘవయ్య" అంటూ ఆ వ్యవహారం చెప్పాడానందరావు.

"ఒక చిన్న ఉద్యోగాని కెంత పోటీ?" అన్నాడు సుదర్శనం నీరసంగా.

"అయితే ఉద్యోగం నాగభూషణానికి రాదు"— అన్నాడానందరావు.

"మరి?"

"ప్రిన్సిపాల్ చాలా తెలివైనవాడు. ముందు ఎవ రెవరినో ఎన్నిక చేసినవాడు నాగభూషణం గురించి ఒత్తిడిరాగానే యేం చేశాడో తెలుసా—అలాంటివాడినే ఇంకొకణ్ని కూడా ఎన్నిక చేశాడు. అతడి పేరు విద్యాసాగర్. ఈ విద్యాసాగర్ కూడా ఊళ్ళో బాగా పేరున్న గణపతిరావుగారి మేనల్లుడు. ఆయనకూ కాలేజీలో చాలా పలుకుబడి వుంది."

"అయితే?"

"వీరరాఘవయ్య పలుకుబడికి గణపతిరావు పలుకు బడితో భేటీ పడుతుంది. ఇద్దరికిద్దరూ హేమాహేమీలు. వీళ్ళిద్దరిలో ఏ ఒక్కరిని ఎన్నిక చేసినా ఊళ్ళో భూకంపం వచ్చేస్తుంది."

"అరే—బావ్ రే!" అన్నాడు సుదర్శనం.

"ఈ తిరకాసంతా ఇప్పుడిప్పుడే నాకర్థమవుతోంది"

అన్నాడు ఆనందరావు.

"అయితే ఇప్పుడేం జరుగుతుంది?"

"మోహనమూర్తి చాలా తెలివిగా వ్యవహరిస్తున్నాడు. ఆయన కమిటీ మెంబర్సుకి తన సమస్య చెప్పుకున్నాడు. వాళ్ళైతే ఆయనమీద జాలిపడి సుభాష్‌ని సెలక్టు చేయమని సూచించారుకూడా. వాళ్ళ పాయింట్ యేమిటంటే వీరరాఘవయ్య, గణపతిరావు—వీళ్ళిద్దరిలో ఏ ఒక్కరిని మాత్రమే సంతృప్తిపరచినా, అసంతృప్తికి గురిచేసినా ఇబ్బంది. ఇద్దరి కాండిడేట్సునీ తిరస్కరించడంలో సమస్య లేదు. అలాంటప్పుడు ప్రిన్సిపాల్ గారి కాండిడేటుని ఫేవర్ చేయడం మంచిది కదా....ఎవరో మనవాళ్ళకే ఉద్యోగమిస్తే మనకూ తృప్తిగా వుంటుందని వాళ్ళాయనతో అన్నారు. ఆయన దానికి ఒప్పుకోలేదు. పైగా ఈ క్లిష్టపరిస్థితిలో తను సెలక్షన్ బోర్డులో వుండనని కూడా ఆయన స్పష్టంచేశాడు. అందుకోసం ఓ వారంరోజులు సెలవుకూడా పెడుతున్నాడు."

"పాపం—ఆయన నిజంగానే స్ట్రిక్టు మనిషిలాగున్నాడు...." అన్నాడు సుదర్శనం అప్రయత్నంగా.

"అలా అప్పుడే జాలిపడిపోకు. ఇలా జరిగినప్పుడే నాకాయన నిజాయితీమీద అనుమానం కలిగింది. ఎందుకంటే అయిన వాళ్ళ నుద్యోగానికి సెలక్టు చేయాలనుకున్నప్పుడెవరైనా ఇలాంటి పనే చేస్తారు. తనేమో సెలక్షన్ కమిటీలో వుండడు. సెలవుపెట్టి ఇంటి దగ్గర కూర్చుంటాడు. తనకు బాగా నమ్మకమున్న వాళ్ళను సెలక్షన్ కమిటీ చెయిర్మన్ చేస్తాడు. అయిన వాళ్ళు సెలక్టవుతారు. ఆ సెలక్షన్‌లో ఆయనకేమీ సంబంధముండదు. ఇది అందరికీ తెలిసిన రహస్యం. అయినా

యెవ్వరూ తప్పుపట్టలేరు...."

"నువ్వనసరంగా అయున్నుమాని స్తున్నావు...."

"సెలక్షన్ కమిటీ చైర్మనెవరో తెలిస్తే నువ్వామాట అనవు. ప్రొఫెసర్ రామేశం ప్రిన్సిపాల్ మోహనమూర్తికి ప్రాణస్నేహితుడు...."

సుదర్శనం ఆలోచనలో పడ్డాడు.

"అసలిప్పటి పరిస్థితి ఏమిటిి?"

వెంకోజీరావు కాలేజీలో ఒకే ఒక ఎకనామిక్స్ లెక్చరర్ ఉద్యోగం. దానికి మొత్తం పదిమందిని ఇంటర్వ్యూకి పిలిచారు. పిలిచినవారిలో తను ఉత్తమ అభ్యర్థి. తనకున్న అవకాశాలెలాంటివో తెలియదు. ఆ పదిమందిలో చిట్టచివర పేర్లున్న నాగభూషణం, విద్యాసాగర్ లకు బాగా పలుకుబడి వుంది. ఇద్దరిలో యే ఒక్కరు మాత్రమో అప్లై చేసి వుంటే తప్పక సెలక్టయుండేవారు. ఇద్దరూ అప్లై చేశారు కాబట్టి ఏ ఒక్కరికీ అవకాశంలేదు. ప్రిన్సిపాల్ తను సెలక్షన్ కమిటీలోంచి తప్పుకుని తన ప్రాణ స్నేహితుడు ప్రొఫెసర్ రమేశాన్ని కమిటీ చైర్మన్ చేశాడు. మోహనమూర్తి తనకిష్టం లేదంటూనే వుంటాడు. రామేశం సుభాష్ని యెన్నిక చేస్తాడు.

ఇదంతా ఓ పెద్ద నాటకం. ఉద్యోగాల విషయంలో ప్రతిచోటా ఇలాంటి అన్యాయాలు జరిగిపోతూండడం వల్లనే సమర్థులకుద్యోగాలు రావడంలేదు. ఫలితంగా దేశం నష్టపోతోంది.

"అయితే మనం చేయగలిగిందేమున్నా వుందా?" అన్నాడు సుదర్శనం.

"అపగలిగితే రామేశాన్నికూడా ఇంటర్వ్యూ కమిటీకి

వెళ్ళకుండా ఆపాలి!" అన్నాడు ఆనందరావు.

"నాలుగుద్యోగాలకి ప్రయత్నిస్తే—చీఫ్ మినిస్టర్నకూడానిక్కూడా సరిపడ అనుభవం వచ్చేలా వుంది—" అనుకున్నాడు సుదర్శనం.

# 9

ఒక ఎయిర్ కండిషను గదిలో కలుసుకున్నారు వీరరాఘవయ్య, గణపతిరావు....

"ఆ ప్రిన్సిపాలు గోలెట్టేసున్నాడు. మీ యిద్దరో యెవరో ఒకరు తేల్చుకోకపోతే — ఇద్దరికీ ఉద్యోగమివ్వడం కుదరదని....మీవాడపై చేశాడని తెలిస్తే నా మేనల్లుణ్ణి వద్దని చెప్పేద్దును. ఇప్పుడేమో తీరా వాడు అపై చేశాడు. వాడికి రాకుండా మీవాడికొస్తే—నా చెల్లెలు నా ప్రాణం తీస్తుంది...." అన్నాడు గణపతిరావు.

వీరరాఘవయ్యకూడా ఓ క్షణం ఆలోచించి—"మనవంటి వాళ్ళు బలాబలాలు తేల్చుకోవాల్సిన రంగస్థలం వెంకోజీరావు కాలేజీ మాత్రం కాదు. నాదీ నీకులాంటి పరిస్థితే! ఏం చేయాలో నాకూ తోచడంలేదు. ఇద్దర్నీ కలిపి యెక్కడికైనా తోలేయడం మంచిదేమో! ఎందుకంటే మావాడు ఇంటర్వ్యూకి వెళ్ళకపోతే చివరి క్షణాల్లో మీవాడికి మూడ్ వచ్చి ఇంటర్వ్యూకి వెళ్ళవచ్చు—" అన్నాడు.

ఇద్దరూ కలిసి ఆలోచించి నాగభూషణానికీ, విద్యాసాగర్ కీ కాశ్మీర్ కార్యక్రమం ఫిక్స్ చేశారు. అప్పుడు గణపతిరావు వెళ్ళిపోయాడు.

ఆ తర్వాత వీరరాఘవయ్య గోపీ కబురంపించాడు.

"ప్రొఫెసర్ రామేశం విషయంలో ఏం చేశావు?"

"ఫోన్ చేసి బెదిరించాను...."

"ఏమన్నావు?"

"ఏ ఏడో లేదీన యిల్లు కదిలితే ప్రమాదమని చెప్పాను...."

"ఆ రోజే కదా ఇంటర్వ్యూ — అందరికీ తెలిసిపోతుంది...."

"తెలిస్తే మాత్రం — ఇదంతా ఎవరూహించగలరు? ఆయన ఇంటర్వ్యూకి వెళ్ళడం వల్ల మీ అబ్బాయికి అన్యాయం జరుగుతుందని మీరే ఇంత పని చేశారని యెవ్వరూ అనుమానించరు...."

"అంటే నీకు నా అవసరం తెలిసిపోయిందన్నమాట."

గోపీ గర్వంగా నవ్వి—"నా ప్రయత్నం లేకుండానే నాకీ విషయం తెలిసింది. ఆ రోజు ప్రొఫెసర్ రామేశాన్ని అపమని మరికొందరు నన్నడిగారు—" అన్నాడు.

"ఎవరు వాళ్ళు?"

"ఇంకెవరు—కాండిడేట్సు తాలూకే!"

"వాళ్ళ పేర్లు చెప్పు...."

"తెలుసుకోవాలనుకుంటే మీకు అసాధ్యంకాదు. కానీ అందువల్ల మీకేమీ ప్రయోజనంలేదు. నాకేమో రహస్యం దాచలేదన్న అసంతృప్తి మిగులుతుంది...."

వీరరాఘవయ్య నిట్టూర్చి—"మావాడు ఇంటర్వ్యూ కాండిడేట్ గా వుంటే—ఇలాంటి పని యెవరు చేసినా నేనే చేశానని అనుమానిస్తారు. అందుకే మావాణ్ని ఇంటర్వ్యూకే పంపడంలేదు...." అన్నాడు.

"అంటే గణపతిరావుగారి మేనల్లుడికి ఢోకా లేదన్న మాట...."

వీరరాఘవయ్య ఆశ్చర్యంగా—"వాటంచూస్తే నీకు మొత్తం కథంతా తెలిసినట్లే వుందే—" అని—"వాడూ ఇంటర్వ్యూకి రాడు. ఇద్దరూ కలిసి కాశ్మీర్ వెడుతున్నారు. ఇంటర్వ్యూ అయ్యాకే వస్తారు...." అన్నాడు.

"అయితే నేను రామేశాన్ని ఆపుతాను. అప్పుడెవ్వరూ మిమ్మల్ననుమానించరు. అంతేకాకుండా ఇలాంటి వ్యవహారాల్లో మీలాంటి వాళ్ళేకాకుండా ఇతరులూ జోక్యం కలిగించుకోవచ్చని అందరికీ తెలుస్తుంది." అన్నాడు గోపీ.

అతడిలాగనడానికి కారణముంది. రామేశం గురించి అతడికి సుదర్శనం చెప్పాడు. రామేశం ఇంటర్వ్యూకి వెళ్ళకపోతే — మరొకడు సెలక్షన్ కమిటీ చైర్మన్ కావచ్చు. రామేశమే చైర్మన్ అయితే సుదర్శనానికి యే అవకాశమూ వుండదు. ఆయన సుభాష్‌ను తప్ప వేరొకణ్ని సెలక్ట్ చేయడు.

ఎలాగూ వీరరాఘవయ్య రామేశాన్ని ఆపుచేసే పని చెప్పాడు. అటు సుభాష్‌నీ ఇటు రమేశాన్నీ ఆపగలిగితే చాలా బాగుంటుంది. సుదర్శనంకోసం తనింకో మనిషిని నియోగించాలి. ఇంతకాలం ఈ విషయం మూడో మనిషికి తెలియకూడదనుకున్నాడు గానీ — ఇది సుదర్శనానికి జీవిత సమస్య. ఎలాగో అలా అతడికి సాయపడాలి.

"నువ్వు చెప్పింది బాగుంది. నా కాండిడేట్ లేక పోయినప్పటికీ రామేశాన్నెవరో బెదిరిస్తున్నారంటే— ఎవరూ నన్ననుమానించరు—" అన్నాడు వీరరాఘవయ్య.

సరిగ్గా అప్పుడే ఆయన పక్క బల్లమీద ఫోన్ మ్రోగింది.

"హలో!" అన్నాడాయన. కాసేపటిలోనే ఆయన ముఖంలో రంగులు మారాయి. ఆయన ఎవరితో మాట్లాడుతున్నాడో గోపీకి అర్థం కాలేదు.

వీరరాఘవయ్య ఫోన్ పెట్టేసి—"నువ్వు రామేశాన్ని వదిలి పెట్టేయాలి" అన్నాడు.

"ఎందుకని?" అన్నాడు గోపీ తెల్లబోయి.

"ఇప్పుడు నాకు ఫోన్ చేసింది ప్రిన్సిపాల్ మోహనమూర్తి. ఆయనకు రామేశం ఫోన్ చేసి తన ఇబ్బంది చెప్పుకున్నాట్ట. రామేశానికి రక్షణ యేర్పాటు చేయమని ఆయన నన్ను కోరుతున్నాడు."

"మీరేం రక్షణ శాఖాధికారీ కాదు, పోలీస్ డిపార్టుమెంటూ కాదు. ఈ విషయం ఆయన మీకు ఫోన్ చేయడమేమిటి?" అన్నాడు గోపీ.

"ఆయనకూ నాకూ కొన్ని మొహమాటాలున్నాయి. ఇలాంటి సమయాల్లో నా ప్రతిభ చూపించకంటే—ఆయనకూ నామీద గౌరవముండదు. ఇందులో నాకేమీ శ్రమ లేదు. రామేశాన్ని బెదిరించిందెవరో కూడా నాకు తెలుసు. అందువల్ల నువ్వీ విషయం మర్చిపో....అదే మనిద్దరికీ మంచిది...."

గోపీకి యేమనాలో అర్థం కాలేదు. రామేశాన్ని ఆపాలని అతడికుంది. రామేశాన్ని ఆపమన్న వీరరాఘవయ్యే ఇప్పుడు రామేశం జోలికి వెళ్ళవద్దంటున్నాడు.

గోపీ ఆలోచిస్తూండగానే వీరరాఘవయ్య యేదో నంబరుకు డయల్ చేసి—"హలో—ప్రొఫెసర్ రామేశం గారేనా—నమస్కారమండీ.... మీ సంగతి నాకిప్పుడే ప్రిన్సిపాల్ గారు చెప్పారు. మీరేమీ భయపడకండి. మనమేమీ ఇక్కడ గాజులు తొడుక్కుని, చేతులు

ముడుచుకునీ కూర్చోలేదు. మా మనుషులు వెయ్యికళ్ళతో మిమ్మల్ని కాపాడుతూంటారు. మీకే ప్రమాదమూ వుండదు" అన్నాడు.

## 10

వీరరాఘవయ్య ఇంటినుంచి తిన్నగా మరో యింటికి వెళ్ళాడు గోపీ. జగ్గూ వున్నాడా అనడిగాడక్కడ.

"ఓ రెండ్రోజులపాటు ఇంటికి రానని చెప్పాడు బాబూ!" అంది ఓ వృద్ధురాలు. ఆమె జగ్గూ తల్లి అయుండవచ్చు.

గోపీ నిట్టూర్చి అక్కణ్నించి కదిలాడు. జగ్గూ అతడి వయసువాడు. అతడివంటివాడు. ఈ వ్యవహారంలో జగ్గూ సాయం తప్ప వేరెవ్వరి సాయం తీసుకోకూడదని నిర్ణయించుకున్నాడతడు.

"సుదర్శనం దురదృష్టవంతుడు...." అనుకున్నాడు గోపీ.

తనకు చేతనైనంతలో గోపీ సుదర్శనానికి సాయపడాలనే అనుకుంటున్నాడు. కానీ ఎక్కడా కలిసిరావడం లేదు.

ఇంక ఇంటర్వ్యూకి రెండే రెండ్రోజులు టయిముంది. ప్రొఫెసర్ రామేశాన్ని ఆపే అవకాశం వచ్చిందనుకుంటే వచ్చినట్లే చేయి జారిపోయిందది.

తనకూ సుదర్శనానికీ వున్న పరిచయం—కొంత మందికైనా తెలుసు. అందుకని చివరి అస్త్రంగా జగ్గూను ఉపయోగించాలనుకున్నాడు. తను ముందుగా సుభాష్‌ని బెదిరించి వుంటాడు. ఆఖరున జగ్గూ సుభాష్‌ని అపుతాడు.

జగ్గూకు గోపీ—గోపీకి జగ్గూ—ఎన్నో వ్యవహారాల్లో సాయపడివా వారిద్దరూ వేర్వేరు ముఠాలకు చెందినవారే

వని అంతా అనుకుంటారు. అయితే ఎట్టి పరిస్థితుల్లోనూ ఒకరి వ్యవహారాల కొకరు ఎదురుపడకుండా, ఇబ్బంది, జోక్యం కలిగించుకోకుండా చూసుకుంటారు.

ఇప్పుడా జగ్గూ దొరకలేదు. అందువల్ల తనే స్వయంగా సుభాష్‌ని ఆపాలనుకున్నాడు గోపీ. ఈ అభిప్రాయంతో సాయంత్రం అతడు పార్కుకి వెళ్ళాడు.

అక్కడ సుభాష్, సుశీల యధాస్థానంలో యధాప్రకారం కబుర్లు చెప్పుకుంటున్నారు.

"హలో మిస్టర్ సుభాష్!" అన్నాడు గోపీ.

సుభాష్ ఉలిక్కిపడి—"నువ్వా?" అన్నాడు.

"అవును—నేనే! నా హెచ్చరిక గుర్తుందో లేదో వని ఒకసారి గుర్తుచేసిపోడానికి వచ్చాను...." అన్నాడు గోపీ.

"హెచ్చరికేమిటి—నాకేమీ గుర్తులేదే!" అన్నాడు సుభాష్.

గోపీ జేబులోంచి బటన్ నైఫ్ తీసి బటన్ ప్రెస్ చేసి "ఇప్పుడు గుర్తొచ్చిందా?" అన్నాడు.

సుభాష్ తల అడ్డంగా ఊపి—"లేదు—కానీ ఓ సారి వెనక్కి చూడు" అన్నాడు తాపీగా.

గోపీ వెనక్కి తిరిగి ఉలిక్కిపడి "అరె—జగ్గూ—నువ్వా?" అన్నాడు.

వాళ్ళిద్దరూ ఒకరికొకరు తెలిసినవారేనని గమనించగానే సుభాష్ కలవరపడ్డాడు కానీ అక్కణ్నించి కదలేదు.

జగ్గూ గోపీ ఒకరినొకరు పలకరించుకున్నారు.

సుభాష్ బాబాయి జగ్గూకి గురుతుల్యుడు. ఎవరో ఇంటర్వ్యూకి వెళ్ళొద్దని బెదిరిస్తున్నారని తెలిసి అతడి

పిన్ని జగ్గూక్కు బురంపింది. రెండ్రోజులనుంచీ అతను సుభాష్‌తోనే వుంటున్నాడు. జగ్గూ గోపీ కథకూడా విని—"మనమిద్దరం ఒకరితో ఒకరు భేటీపడ్డం ఇంతవరకూ జరగలేదు. ఇప్పుడేం చేద్దామంటావు?" అన్నాడు.

వృత్తిరీత్యా ఇద్దరికీ ఒకరితోడు ఒకరికి అవసరం. వృత్తిరీత్యానే మున్ముందు ఇద్దరూ భేటీపడవలసి రావచ్చు కూడా. ఇప్పుడీ చిన్న విషయానికి ఇద్దరూ బలాబలాలు పరీక్షించుకోవడం గోపీ కిష్టంలేదు.

"సరేలే—నే నింకో మార్గం చూసుకుంటాన్లే...." అన్నాడు గోపీ.

జగ్గూ గోపీకి థాంక్స్ చెప్పుకున్నాడు. సుభాష్ మాత్రం గోపీ జగ్గూకి భయపడ్డాడని అనుకున్నాడు.

గోపీ అక్కణ్ణించి వెళ్ళి సుదర్శనాన్ని కలుసుకుని—"నీకే విషయంలోనైనా సాయం చేయగలను కానీ ఉద్యోగం విషయంలో చేయలేను. చేతనైతే ఆ రామేశాన్ని కానీ, మోహనమూర్తిని కానీ నువ్వే బెదిరించు. లేదా ఆ సుశీలను రేప్ చేసి నువ్వే పెళ్ళాడు. ఏంచేసినా నువ్వే స్వయంగా సాధించుకోవాలి. ఇంటర్వ్యూకి వెళ్ళకుండా ఆ సుభాష్‌ని ఆపాలనుకోవడం అన్యాయమనిపిస్తోంది" అని సెలవు తీసుకున్నాడు.

## 11

"కథ మళ్ళీ మొదటికి వచ్చింది—" అనుకున్నాడు సుదర్శనం.

ఇలాంటి అపూర్వావకాశం మళ్ళీ తనకు రాకపోవచ్చు. పెద్ద పెద్దవాళ్ళ అడ్డంకులన్నీ తొలగిపోయాయి. తనకిప్పుడు సుభాష్ ఒక్కడే పోటీ. ఆ సుభాష్‌కీ తనకీ ఒకటే తేడా! అతడు ప్రిన్సిపాల్ కూతురు సుశీలను ప్రేమించి

పెళ్ళి చేసుకోబోతున్నాడు. సుశీలను పెళ్ళి చేసుకుంటే తనకూ ఆ ఉద్యోగం రావచ్చు.

ఇంతకాలం తన ఆలోచన లీ దార్లో మళ్ళలేదు.

తనూ అందంగానే వుంటాడు. సుశీల గురించి ముందు నుంచీ ప్రయత్నిస్తే ఆమె తననే ప్రేమించి వుండేది. ఇప్పుడామె సుభాష్‌ని ప్రేమిస్తోంది. ఆ ప్రేమనుంచి ఆమె మనసును మళ్ళించాలంటే ....

"నువ్వే ఆమెను రేప్ చేసి పెళ్ళాడు."

ఇవి గోపీ మాటలు. సుదర్శనం చెవుల్లో గింగురు మంటున్నాయి.

రేప్ చేయడం నేరం కావచ్చు. కానీ తనద్వారా ఆ వనిత కన్యాయం జరక్కపోతే అది నేరం కాదు. రేప్ చేశానని సుశీల తనని అసహ్యించుకోవచ్చు. కానీ భర్తగా ఆమె తనను తప్పక ఆదరిస్తుంది.

"అదే—అన్నింటికీ మంచిమార్గం.... కానీ....ఎలా?"

సుదర్శనం బుర్రలో ఆలోచనలు తిరుగుతున్నాయి. అతి దెక్కువ జాప్యం చేయలేడు. తనకున్న టైము ఎంతో లేదు.

ఆరోజు గడిస్తే మర్నాడే ఇంటర్వ్యూ....

పార్కులో సుభాష్, సుశీల కలుసుకుంటున్నారు. టైము యేడయ్యేదాకా సుశీల అక్కడే వుంటుంది. అప్పుడు సుభాష్, సుశీల విడిపోతారు. తాను సుశీల నను సరిస్తాడు. దారిలో పలకరిస్తాడు. సుభాష్ గురించి గొప్పగా నాలుగు కబుర్లు చెప్పి ఆమెను తప్పుదారిన నడిపిస్తాడు. ఓ చిన్న అడ్డదారి వుంది. ఆమె దృష్టి నా అడ్డదారిని గుర్తించనీయకుండా—ఆమెనా దారిలో నడిపించ గలిగితే....

ఆ ప్రాంతంలో కొన్ని మానభంగాలు జరిగాయి. అటువైపు జనాలాట్టే వెళ్ళరు. అక్కడ ప్రదేశమూ అందుకనువుగా వుంటుందంటారు.

తను చూడ్డానికి పెద్దమనిషిలా వుంటాడు. ఓ క్షణం క్రితం వరకూ నిజంగా కూడా పెద్దమనిషే! అందువల్ల సుశీల నాదారికి తీసుకుని వెళ్ళడం కష్టంకాదు.

అక్కడ తను అనుకున్నది సాధిస్తాడు.

అంతా అయిపోయాక కన్నీళ్ళతో విలపిస్తున్న సుశీలనలా వదిలి వెళ్ళిపోకుండా—ఆవేశంలో జరిగిన పొరపాటును క్షమించమంటాడు. తనామెను పెళ్ళి చేసుకుందుకు సిద్ధంగా వున్నానంటాడు. నెమ్మదిగా ఉద్యోగం గురించి చెప్పవచ్చు.

తన పథకంలో ప్రమాదముందని సుదర్శనానికి తెలుసు. అంతవరకూ ఏ నేరమూ చేయని తాను ఒక అబలపై అత్యాచారం చేయగలడా అన్నది సందేహాస్పదమని అతడికి తెలుసు. తను నేరస్థుడిగా పట్టుబడితే జీవితమే సర్వనాశనమవుతుందన్న విషయంకూడా అతడికి తెలుసు.

తనకు తన కుటుంబం పట్ల, సమాజం పట్ల వున్న బాధ్యతలతడికి గుర్తున్నాయి. ఒక అబలపై అత్యాచారం చేసినవాడికి ఆధ్యాపకుడయ్యే అవకాశముండదేమో నన్న విషయమూ అతడు గుర్తించాడు.

కానీ—తనకు ఇంటర్వ్యూ లెటర్ వచ్చినపుడు తండ్రి అతడితో—"ఆశను ఎక్కువగా నమ్ముకున్నవాడు తన ప్రాణాలు నిలబెట్టుకోవడం సంగతెలాగున్నా—నిరాశ ఎదురైనపుడు—ఎదుటివాళ్ళ ప్రాణాలు తీయాలనుకునేటంత ఘోరావేశానికి గురి అవుతాడు" అన్న మాటలు గుర్తులేవు.

స్త్రీకి మానభంగం హత్యతో సమానమన్న గుర్తింపూ అతడిలో లేదప్పుడు.

## 12

టైము ఏడయింది.

“బై ...” అంది సుశీల.

“బై ..” అన్నాడు సుభాష్. అతడికి కాస్త దూరంలో జగ్గా వున్నాడు. సుభాష్ అక్కడ్నించి బయల్దేరాక జగ్గా కూడా అక్కడ్నించి కదిలాడు.

మరోవైపు గేట్లోంచి సుశీల బైటకు వచ్చింది. అప్పుడే ఆమెకు ఎదురుపడ్డాడు సుదర్శనం. అతడి నామె చూసింది కానీ పట్టించుకోలేదు.

“హలో!” అన్నాడు సుదర్శనం. అతడి గొంతు వణికింది.

సుశీల ఆశ్చర్యంగా చూసింది.

“నా పేరు సుదర్శనం!” అన్నాడతడు.

ఆమె అతడివంక ప్రశ్నార్థకంగానే చూసింది.

“మీ పేరు సుశీలకదూ? మీరు ప్రిన్సిపాల్ మోహనమూర్తిగారమ్మాయి కదూ!” అన్నాడు సుదర్శనం.

అతడడిగిన పద్ధతినిబట్టి మర్యాదస్థుడిగానే భావించి- “అరే మీకు మా నాన్నగారు తెలుసా?” అంది సుశీల.

“అయ్యో—ఆయన్ని తెలియని వాళ్ళెవరుంటారు?” అని—“నేను మిమ్మల్ని కల్సుకుని మీతో మాట్లాడాలని చాలాకాలంగా అనుకుంటున్నాను. మీతోపాటు కలిసి అడుగులేయొచ్చా?” అన్నాడు సుదర్శనం.

సుశీల నవ్వి ... “మా నాన్నగారు నాకు పూర్తి స్వేచ్ఛనిచ్చారు. కానీ నాతో మీరేం మాట్లాడతారు?”

“నా ఫ్రెండొకడు—అయ్యేయస్ ప్యాసయ్యాడు.

ఇంకా పోస్టింగు రాలేదు. వాడి దగ్గర మీ ఫోటో వుంది. మిమ్మల్ని పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాడు. కానీ ధైర్యంచేసి ముందుగా మీకే ఆ మాట చెప్పాలని తాపత్రయం. వాడి దగ్గరే నేను మీ ఫోటో చూశాను....." సుదర్శనం కల్పితగాథ నొకటి మొదలుపెట్టాడు.

సుశీలకీ కల్పితగాథ ఆకర్షణీయంగానే వుంది. ఆమె, సుదర్శనంతో కలిసి అడుగులు వేస్తోంది.

అలా కొంతసేపటికి అతడనుకున్న అడ్డదారి దగ్గర పడింది.

తగ్గిందనుకున్న కణుకు మళ్ళీ సుదర్శనంలో ప్రారంభమైంది.

సుశీల మాత్రం అతడి కబుర్లు వింటూ మధ్య మధ్య ప్రశ్నలు వేస్తోంది. క్రమంగా అడ్డదారి దగ్గర పడుతోంది.

"అలా పోదాం — దగ్గర దారి..." అన్నాడు సుదర్శనం అడ్డదారివైపు చూపిస్తూ.

సుశీల క్షణం తటపటాయించి—"అదాటే మంచి దారికాదు...." అని—"అయినా మీలాంటివారు పక్కనుంటే భయముండదులెండి...." అని తనే అటువైపు తిరిగింది.

సుదర్శనం తనూ అటువైపు తిరగాలనుకున్నాడు. కానీ కాళ్ళు సహకరించలేదు. ఎవరైనా ముందుకులోస్తే తప్ప అతడు ముందుకు వెళ్ళేలాలేదు.

సుశీల నాలుగడుగులువేసి వెనక్కి తిరిగింది.

సరిగ్గా అప్పుడే శరవేగంతో వస్తున్న స్కూటరొకటి సుదర్శనాన్ని గుద్దుకుంది. హారన్ మోగుతున్నా సుదర్శనం తప్పుకోలేక పోయాడు. అప్పుడక్కడ యాక్సిడెంటయింది.

స్కూటర్ మీద ఇద్దరున్నారు. వాళ్ళకు చిన్న దెబ్బలు తగిలాయి. సుదర్శనం మాత్రం క్రిందపడ్డవాడు మరి లేవలేదు. అతడికి స్పృహ తప్పింది.

సుశీల కత దెవరో తెలియదు. కానీ స్కూటర్ వాలాల సహాయంతో — ఆమె అతడిని దగ్గర్లోని ప్రయివేట్ నర్సింగ్ హోంలో చేర్చింది.

సుదర్శనం దగ్గర ఏ వివరాలూ లేకపోవడంవల్ల ఆమె అక్కణ్నించే ఇంటికి ఫోన్ చేసి—తానొక అపరిచితుణ్ణి నర్సింగ్ హోంలో చేర్చాననీ—అతడికి స్పృహవచ్చేవరకూ నర్సింగ్ హోంలో వుండవలసిన బాధ్యత తనకున్నదనీ చెప్పింది. కాసేపటికి—మోహనమూర్తి అక్కడికి వచ్చి అక్కడి పరిస్థితి చూసి—"మనమిక్కడుండనవసరంలేదు. అతడికి స్పృహ రాగానే నర్సింగ్ హోంవారు మనింటికి ఫోన్ చేసి చెబుతారు. అవసరమనుకుంటే అప్పుడు సాయ పడొచ్చు—" అన్నాడు.

వాళ్ళిద్దరూ యింటికి వెళ్ళిపోయారు. అయితే సుశీలకు మనసు మనసులోలేదు. ఆమె తరచుగా రాత్రి నర్సింగ్ హోంకి ఫోన్ చేస్తూనే వుంది—సుదర్శనానికి స్పృహ వచ్చిందా అని.

# 13

తెల్లవారుఝామున నాలుగు గంటలకు సుదర్శనానికి స్పృహ వచ్చింది. తనెక్కడున్నదీ ముందతడికి తెలియ లేదు. దగ్గర్లో వున్న నర్సు కొంత చెప్పాక మొత్తం జరిగినదంతా అతడూహించుకోగలిగాడు. అప్పుడతడికి తనమీద తనకే ఏహ్యభావం కలిగింది.

సుభాష్‌ని ప్రేమించిన సుశీలను తను మానభంగం

చేయాలనుకున్నాడు. స్పృహ తప్పిపోయిన తనవామె నర్సింగ్ హోంలో జేర్పించింది.

జీవితమంటే ఉద్యోగం సంపాదించడమొక్కటే కాదు. కానీ ఉద్యోగం కోసం—తను ఒక అతివ జీవితంతోపాటు తన జీవితాన్నికూడా నాశనం చేసుకోబోయాడు.

"నాచేత పాపం జరక్కుండా దేవుడు ఆపాడు. అయినా నానుంచి కూడా కొంత నిష్కృతి తప్పదు. కనీ యింటర్వ్యూకి వెళ్ళను. ఆ విధంగా సుభాష్‌కి ఉద్యోగం వస్తుంది. సుశీల సుఖపడుతుంది..." అనుకున్నాడు సుదర్శనం.

ఈలోగా అతడికి స్పృహ వచ్చిందని తెలిసి డాక్టరతణ్ని చూడవచ్చాడు—"పాపం—ఆ అమ్మాయెవరో మీ గురించి చాలా ఆదుర్దాపడింది. మీకు పెద్దగా దెబ్బలేమీ తగల్లేదు. స్పృహ తప్పిందంటే అందుకు కారణం షాక్ అయివుండాలి. లేదా ఎందువల్లో ఆ సమయంలో మీ మెదడు బలహీనంగా ఉండివుండాలి." అని— "ముందు మీ ఇంటికి కబురుచేయాలి. మీ వివరాలు చెప్పండి...." అన్నాడు డాక్టరు.

సుదర్శనం తన ఇంటి చిరునామా చెప్పగానే ఆయన మోహనమూర్తి ఇంటికి ఫోన్ చేసి కబురు చెప్పాడు.

కాసేపట్లో మోహనమూర్తి స్వయంగా నర్సింగ్ హోంకి వచ్చాడు. ఆయన సుదర్శనంతో-"మా అమ్మాయి కబురు చెప్పడానికి మీ ఇంటికి వెళ్ళింది. కాసేపట్లో మీవాళ్ళొస్తారు. అన్నట్లు నీకీరోజు ఇంటర్వ్యూ వుండకమా!" అన్నాడు.

"మీకెలా తెలుసు?" అన్నాడు సుదర్శనం ఆశ్చ

ర్యంగా.

"ఇంటర్వ్యూ కాల్స్ పంపిన పదిమంది అడ్రసులూ కంఠతా వచ్చేశాయి. నీ అడ్రసు చెప్పగానే నువ్వు మా ఇంటర్వ్యూ సుదర్శనానివేనని అర్థమైంది నాకు...."

"కానీ- నేను ఇంటర్వ్యూకి వెళ్ళడం లేదండీ...." అన్నాడు సుదర్శనం.

"ఎందుకని?"

"ఈ యాక్సిడెంట్ కాగానే ఏదోలాగుంది...."

"అలాగనకు. ఇందులో నీకు మంచి ఛాన్సుంది...."

"నాకేం ఛాన్సు లేదండి—ఎవరో సుభాష్ అనే అతడికి మంచి ఛాన్సుందని కాలేజీలో టాకుందిటండి.."

ప్రిన్సిపాల్ ముఖం ఎర్రబడింది—"ఆ సుభాష్ నాకు కాబోయే అల్లుడు. ఉద్యోగంకోసం నన్నూరికే సతాయిస్తున్నాడు. నాక్కాబోయే అల్లుడు కాబట్టి అతడికా ఉద్యోగం వచ్చే ప్రసక్తిలేదు. మా కాలేజీ కమిటీ మెంబర్సు కొందరు నన్ను కాదని సుభాష్ కుద్యోగం ఇవ్వాలనుకుంటున్నారు. అలాచేస్తే మనసులో ఏ మూలో నేను సంతోషిస్తానని వారి నమ్మకం. అందుకే నా మాట నెగ్గడంకోసం నా మిత్రుడు ప్రొఫెసర్ రామేశంను సెలక్షన్ కమిటీ ఛైర్మన్‌గా చేశాను. అతదెవ్వరిమాటా వినడు. అందరిలోకీ మంచి అర్హతలున్న నీ పేరు రామేశానికి సూచించాను కూడా. ఎట్టి పరిస్థితిల్లోనూ అతడు సుభాష్‌ను సెలక్టు చేయడు. చేస్తే నేనుద్యోగానికి రాజీనామా చేస్తానని రామేశానికి తెలుసు...."

సుదర్శనం చటుక్కున మంచంమీంచి లేచి మోహన మూర్తి కాళ్ళమీద పడిపోయి—"ఈ రోజుల్లో మీలాంటి వాళ్ళుంటారని కలలోకూడా ఊహించలేను...."

అన్నాడు.

"నన్నూహాల్లో ఉంచకపోయినా ఫరవాలేదు. నా ఊహాల్ని మీలాంటి వాళ్ళు నిజం చెస్తే చాలు...." అన్నాడు మోహనమూర్తి.

సుదర్శనానికి కళ్ళలో నీళ్ళు తిరుగుతున్నాయి.

ఇంత సులభమైన వ్యవహారానికి— తానెంత తతంగం చేశాడు?

ప్రిన్సిపాలు సిటు అని తనకెందరో చెప్పారు. నిజాన్ని, మంచిని—అంత సులభంగా నమ్మని తాను ఎన్నో రోజులు ఇంత క్షోభా అనుభవించాడు.

మంచిని నమ్మి వుంటే....?

ఇంకా యేమైనా మోహనమూర్తిలో అనుమానా లుంటే....తనకుద్యోగం రాగానే సుదర్శనానికి అవి తీరి పోయాయి.

ఎదుటివాళ్ళ నిజాయితీనీ, మంచితనాన్నీ మోహన మూర్తి తప్పుగా అంచనా వేయడనడానికి నిదర్శనంగా- సుభాష్ సుశీలను పెళ్ళిచేసుకున్నాడు.

—:అయిపోయింది:—

సీరియల్

# అగ్ని కెరటం

ప్రతాప రవిశంకర్

(గత సంచిక తరువాయి)

దీపం కాంతిలో బండమీద వెంటనే జాన్సన్ కనిపించలేదు.

జాన్సన్ ఏమయ్యాడు!

ఎర్రతోడేళ్ళు తినేసి వెళ్ళిపోయాయా?

మరింత ముందుకు వంగి కళ్ళను చిట్లించి చూసింది.

షాక్ కొట్టినట్టు అదిరిపడింది.

వెల్లకింతలా పడుకున్న జాన్సన్ శరీరాన్ని అప్పటికే ఒక వరుస చుట్టుకుపోయి రెండో వరుస చుట్టటానికి తంటాలు పడుతున్న పెద్ద కొండచిలువ కనబడింది.

మై గాడ్!

హారిబుల్..జాన్సన్ మనిషి కాదా? మనిషే అయితే కొండచిలువ అలా శరీరాన్ని చుట్టుకుపోతుంటే ఇంకా గుర్రుపెట్టి నిద్రపోతూనే వుంటాడా?

నిజంగానే మొరటు మనిషి—

ఒక్క నిమిషం దాన్ని ఎలా ఎదుర్కోటానికీ తోచ లేదు. రివాల్వర్‌తో షూట్ చెయ్యొచ్చు. కాని అది వెంటనే చావకపోవచ్చు. కోపంతో తన పట్టును జాన్సన్ చుట్టూ గట్టిగా బిగించవచ్చు.

అందుకే కిందికి వంగి పెట్టెలో నించి పొడుగాటి కత్తిని బయటకు తీసింది.

తళతళ మెరుస్తోంది కత్తి. బాగా పదునుగా వుంది. అది టకారాలను ఎదుర్కోటానికి తీసుకువెళుతున్న కత్తి. అలాంటి కత్తులు ఇంకా కొన్ని వున్నాయి.

లేచి నిల్చుని డోర్ తెరుచుకుని రాబోతూ ఆగి పోయింది. బయట యెక్కడయినా చీకట్లో ఎర్ర తోదేళ్ళు పొంచివున్నాయేమో!

ఎవర్నయినా నిద్రలేపితే? మళ్ళీ అనవసరం అనుకుంది.

ఎర్ర తోదేళ్ళు వున్నట్లయితే జాన్సన్ శరీరం కొండ చిలువకు దొరికేదికాదు. ఎప్పుడో అతన్ని ముక్కలు ముక్కలుగా చీల్చి వుండేవి.

క్షణం కూడా ఆలస్యం చెయ్యకుండా డోర్ తెరుచుకుని బయటకు దూకి బండ దగ్గరకు పరిగెత్తింది.

ఆ దృశ్యాన్ని దగ్గరినించి చూడగానే సెలాకు ఒళ్ళు జలదరించింది.

జాన్సన్ శరీరాన్ని ఒక చుట్టు చుట్టుకొని రెండో చుట్టుకు తలను అతడి కాళ్ళకిందనించి బయటకు తెప్పిస్తోంది.

ఇంకేమీ ఆలోచించలేదు. అంతకుమించి దాన్ని చంపటానికి సరైన ఒడుపు దొరకదనుకుంది.

అది తలను పూర్తిగా బయటకు తీసుకొచ్చి పైకెత్తిందంటే దాన్ని చంపటం కష్టమవుతుంది. ఎందుకంటే

కత్తివేటు జాన్సన్‌కు కూడా తగిలే అవకాశం వుంది.

అంతే—

తల రెండు జానల పొడవునా బండమీద బయటకు వచ్చింది.

స్టెల్లా చేతిలో కత్తి విసురుగా పైకిలేచి వేగంగా కిందికి దిగింది.

అంతే—ఒకే ఒక్క వేటు....ఆ వేటుకే అంత పెద్ద కొండచిలువ తల తెగిపోయి కొంచెం దూరంలో పడిపోయింది. తల తెగిపోవటంతోనే నెత్తురు చిమ్మింది. వెంటనే జాన్సన్‌ను చుట్టుకొన్న చుట్ట విడిపోయింది.

బండమీదనించి కిందికి దొర్లుతున్నప్పుడు జాన్సన్‌కు మెలకువవచ్చి దొర్లకుండా ఆగిపోయాడు.

కళ్ళు తెరిచి చూసేసరికి అస్పష్టంగా పడుతున్న వెలుతురులో యెదురుగా పొడుగాటి కత్తి తీసుకొని నిల్చున్న స్టెల్లా కనపడింది.

అదిరిపడి పక్కనేవున్న రివాల్వర్‌ను అందుకోటానికి చేతినిపక్కకు జరిపాడు జాన్సన్ లేచి కూర్చోబోతూ—

అప్పుడు తగిలింది అతని చేతికి విడిపోయిన కొండచిలువ శరీరం. చూశాడు. చటుక్కున చేతిని వెనక్కులాక్కొని బెదురుతున్న కళ్ళతో స్టెల్లాను చూశాడు.

"భయపడకు. అది చచ్చిపోయింది" అన్నది స్టెల్లా.

అప్పుడతను టార్చి తీసుకొని ఫోకస్ చేసి చూశాడు. తల తెగిన కొండచిలువ శరీరం ఒకవైపు, తెగిపోయిన తల రెండోవైపు భయంకరంగా కనిపించాయి.

"నువ్వింత మొద్దువని అనుకోలేదు. కొండచిలువ చుట్టుకుపోతున్నా నీకు మెలకువరాలేదు. వినా మా అందరికీ కాపలా వున్నవాడివి నువ్వెలా నిద్రపోయావ్?

నీ మొద్దు నిద్రే నిన్ను ఆపదలోకి నెట్టింది. నీ గురకే నిన్ను రక్షించింది. నీ గురకతోనే నాకు మెలకువ వచ్చి చూశాను. నాకు మెలకువ రాకుండా వున్నట్టయితే నువ్వు ఈ కొండచిలువ పట్టునించి గింజుకున్నా వదిలించుకునే వాడివి కాదు."

సెల్లా మాటలకు జాన్సన్ మాట్లాడలేదు.

సిగ్గుతో తల వంచుకున్నాడు.

ఇలా జరుగుతుందని పొరపాటునకూడా వూహించ లేదు.

మరోసారి వాచీకేసి చూసుకుంది సెల్లా.

పదినిముషాలు తక్కువ ఒంటిగంట.

"ఒంటిగంట కావస్తోంది. ఇక నువ్వెళ్ళి పడుకో. నాలుగు గంటల వరకు నేను కాపలా వుంటాను."

"వద్దు....ఇక నాకు నిద్రపట్టదు. నువ్వొక్కదానివే కూర్చోటానికి విసుగుపుడుతుందేమో! నేనుకూడా నీకు తోడు వుంటాను" అన్నాడు జాన్సన్—కొండచిలువ శరీరాన్ని కొంచెం దూరానికి నెట్టివేస్తూ.

"నీ యిష్టం. నిద్ర రాకపోతే ఫర్వాలేదు. నేను కూడా నీలాగే నిద్రపోతానని అనుకోకుండా వుంటే చాలు" అన్నది సెల్లా నవ్వుతూ.

మళ్ళీ సిగ్గుపడ్డాడు జాన్సన్.

"బాధపడకు....జోక్‌గా అన్నాను. మరొకరి ప్రాణాలను కాపాడే బాధ్యతను తీసుకున్నప్పుడు బాధ్యతతోనే ప్రవర్తించాలి. అలా కానప్పుడు ఇలాంటి ప్రమాదాలే ఎదురౌతాయి" అంది.

తల వూపాడు జాన్సన్ నిజమే అన్నట్టు.

సెల్లా అతడి పక్కనే కూర్చుంది.

నిజంగానే జాన్సన్ నిద్ర ఎగిరిపోయింది. అతడికి జరిగిపోయిన సంఘటన తల్చుకుంటే భయమేసింది. సెల్లాకు మెలకువ రాకుండా వున్నట్లయితే తన గతి ఏమై వుండేది. తను ఎంత బలవంతుడైనా చెయ్యగలిగింది యేమీ వుండేది కాదు. కొండచిలువ పట్టు చాలా భయంకరమైనది.

తను తక్కువగా అంచనా వేసుకున్న ఆడదే ఎంతో సాహసంతో తన ప్రాణాలను కాపాడింది.

"ఏమిటి ఆలోచిస్తున్నావ్?" అడిగింది సెల్లా.

ఏమీ లేదన్నట్టు తలవూపాడు. ఆమెకు కృతజ్ఞతలు తెలియజేసుకోటానికి జాన్సన్ బిడియపడ్డాడు.

"జాన్సన్....నిద్రలో నాకు మెలకువ వచ్చినప్పుడు యేదో పాట వినపడింది. నువ్వేకదా ఆ పాట పాడింది."

తల వూగించాడు జాన్సన్.

"మళ్ళీ ఆ పాట పాడు. నాకు మీ పాటలంటే ఇష్టం. అప్పుడప్పుడు భారత్ పాడుతూ వుండేవాడు."

రెండు నిముషాల తర్వాత జాన్సన్ పాట మొదలు పెట్టాడు.

చూటానికి అతను మొరటుగా వున్నా మాట్లాడు తున్నప్పుడు అతని గొంతు బొంగురుగా వున్నా పాట పాడుతున్నప్పుడు అతడి గొంతు బావుంది.

సెల్లాకు ఆశ్చర్యం కలిగించిన విషయం అదొక్కటే.

పాట సగంలో వున్నప్పుడు సెల్లా హటాత్తుగా "జాన్సన్, పాట ఆపు" అంది—రివాల్వర్‌ను చేతిలోకి తీసుకుంటూ.

• • •

"జాగ్రత్తగా విను. చెట్లమధ్యగా ఎండుటాకులమీద ఎవరో నడుస్తున్నట్టుగా చప్పుడు వినపడుతోంది" అంది

షైలా.

జాన్సన్ వూపిరి తీసుకోవటం కూడా ఆపి చెవులు రిక్కించి విన్నాడు. అవును. ఎవరో ఆకులమీద నడుస్తున్నట్టుగా టపటపమని చప్పుడవుతోంది. ఎంతో జాగ్రత్తగా వింటేగాని ఆ చప్పుడు తెలీదు.

షైలా చిన్న అలికిడినికూడా వెంటనే గుర్తించగలదనుకున్నాడు.

"అవును. ఎవరో నడుస్తున్నారు. సందేహం లేదు" అన్నాడు జాన్సన్.

"జాగ్రత్తగా వింటే ఆ చప్పుడు ఆగకుండా ఒకేసారి ఒకరు కంటే ఎక్కువమంది నడుస్తున్నట్టుగా వుంది. ఈ నికోలాయ్ దీవుల్లో మనుష్య సంచారం అసలు వుండదని ప్రొఫెసర్ అనంత్ చెప్పాడు. మనుషులు కానప్పుడు ఆ అడుగుల చప్పుడు ఎవరిదై వుండాలి, జంతువులదై వుండాలి. ఒకేసారి అన్ని జంతువులు కలిసి వస్తున్నాయంటే అవి తప్పకుండా ఎర్రతోడేళ్ళే అయివుండాలి" అన్నది. అంటూనే జాన్సన్ చేతిలోనించి టార్చిలైటును తీసుకుని చప్పుడు వినవస్తున్న దిశగా చెట్లవైపు ఫోకస్ చేసింది.

షైలా అంచనా తప్పుకాలేదు.

నిజమే అయ్యింది.

ఎర్రతోడేళ్ళు! చెట్లలోనించి వరుసగా ఒక్కొక్కటే బయటకు వస్తున్నాయి తాపీగా.

ఒకటికాదు—రెండుకాదు. ఎనిమిది తోడేళ్ళు వున్నాయి. క్షణాలమీద ఒక నిర్ణయానికి వచ్చేసింది షైలా.

ఎనిమిది తోడేళ్ళను ఎదిరించటం ఇద్దరికి సాధ్యంకాదు. పైగా జిత్తులు కలిగిన తోడేళ్ళు. ఇద్దరే వున్నారని తెలిసినప్పుడు వాటి ధైర్యం రెండింతలవుతుంది.

అందుకే—

"భారత్" అంటూ పెద్దగా అరిచింది.

ఆ అరుపుకు భారత్‌తోపాటు మిగిలిన వాళ్ళంతా ఉలిక్కిపడి లేచారు.

అప్పటికి ఎర్రతోడేళ్ళన్నీ చెట్లలోనించి ముందుకువచ్చి కొంచెం దూరంలో నిలబడివున్న పైలట్లను చూస్తున్నాయి ముందుకు దూకటానికి సిద్ధంగా వున్నట్టు—

"ఎర్రతోడేళ్ళు వచ్చాయి. దాడిచేయటానికి సిద్ధంగా వున్నాయి. అంతా తుపాకులతో బయటకు రండి. లైట్లన్నీ వెలిగించండి."

అంతే. బయట పరిస్థితి అరక్షణమైపోయింది. వెంటనే హెలికాప్టర్ లైట్లన్నీ వెలిగాయి.

ఒక్కసారిగా వెలుతురుపడేసరికి ఎర్రతోడేళ్ళన్నీ అటూ ఇటూ కదిలి ఒకదాన్నొకటి చూసుకున్నాయి.

క్షణాలమీద తుపాకులు తీసుకుని ఒక్కొక్కరే కేబిన్‌లోనించి కిందికి దూకారు.

లీల మాత్రం లోపల వుండిపోయింది.

పైలట్ కూడా కిందికి దూకపోయాడు కాని భారత్ వారించాడు. అతడ్ని తుపాకి పట్టుకుని లోపలే వుండమన్నాడు. అతనికి యేదైనా గాయమయిందంటే హెలికాప్టర్ కదలదు.

కిందికి దిగుతూనే చెట్లముందు నిల్చుని వున్న ఎర్రతోడేళ్ళు కనిపించాయి.

"మైగాడ్! మన అంచనా నిజమే అయ్యింది. ఈ సమయంలో మనమంతా గాఢనిద్రలో వుంటామని అనుకుని ఇప్పుడు వచ్చాయి" అన్నాడు అనంత్.

అంతా బండ దగ్గరకు వెళ్ళారు.

రంజిత్ కు నిద్రమత్తు వదిలిపోయింది.

అప్పటికే స్టెల్లా అక్కడవుండటం భారత్ తో పాటు మిగిలిన వాళ్ళకి ఆశ్చర్యాన్ని కలిగించింది.

భారత్ — స్టెల్లాను యేదో అడగబోయాడు.

కాని ఆమె దృష్టి తీక్షణంగా ఎదురుగా వున్న తోడేళ్ళమీదే వుంది. అవి పరుగుపందానికి సిద్ధంగా వున్నట్టుగా వరుసగా నిలబడి వున్నాయి.

అప్పుడప్పుడు నోళ్ళు తెరుస్తున్నాయి. అలా తెరుస్తున్నప్పుడు వాటి కోరలు అసహ్యంగా కనపడుతున్నాయి. అన్నీ ఒకే ఎత్తులో వున్నాయి.

అవి ఎందుకలా నిలబడిపోయాయో స్టెల్లాకు అర్థం కాలేదు.

దాడి చెయ్యటానికి వచ్చి అవి ఎందుకలా నిలబడి పోయాయి? తమ చేతుల్లో వున్న ఆయుధాలను చూసి జంకుతున్నాయా?

ఊహు.... అయివుండదు.

జాగ్రత్తగా చూస్తే ఆ ఎర్రతోడేళ్ళు తమని సూటిగా చూడటం లేదని, తమ వెనకవైపుకు చూస్తున్నాయని స్టెల్లాకు అనిపించింది.

వెంటనే ఆమెకు యేదో స్ఫురించింది.

చటుక్కున తల వెనక్కు తిప్పిచూసి కెవ్వున అరిచి అరుస్తూనే రివాల్వర్ ను పేల్చింది స్టెల్లా.

అప్పటికే వెనకనించి దగ్గరకు వచ్చేశాయి రెండు ఎర్రతోడేళ్ళు. అదిరిపోయారంతా.

స్టెల్లా పేల్చిన రివాల్వర్ గుండు ఒకదానికి నుదుటిలో దూరిపోయి పెద్దగా అరుస్తూ వెనక్కుపడింది.

రెండో తోడేలు ఎగిరి స్టెల్లామీదకు దూకింది భీకరంగా

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈనెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 6 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాదిపాటు పత్రిక లేదా సప్లిమెంట్ బహుమతిగా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. పూర్తి వివరాలకు పత్రిక చూడండి.

అయితే, ఈ స్కీము అపన ఏజంట్లు వున్న ప్రాంతాలకు వర్తించదు. మీరు హోమ్ డెలివరీ సభ్యత్వము పంపే ముందు మీ వూరిలో మా ఏజంటు లేడనే విషయం నిర్ధారణ చేసుకోండి.

నేడే మీరూ 'హోమ్ డెలివరీ'లో చేరండి!

చూస్తూ.

పక్కకు తప్పుకుంటూ అరిచింది స్టెల్లా కంగారుగా.

"ఎవ్వరూ వెనక్కి తిరగొద్దు. ముందునించి ఎర్ర తోదేళ్ళు దాడిచేస్తాయి."

అప్పటికే ముందునించి ఎర్ర తోదేళ్ళు ఒక్కసారిగా పరుగుదీస్తూ ముందుకు వచ్చాయి.

"షూట్" అరిచాడు భారత్ తుపాకీ పేలుస్తూ....

అతని గురి తప్పలేదు. తుపాకీగుండు ఓ ఎర్రతోదేలును బలితీసుకుంది. అది ఎగిరి పక్కనే వున్న మరో తోదేలు మీద పడింది.

స్టెల్లా పక్కకు తప్పుకోవటంలో ముందుకు తిరగబోతున్న జాన్సన్ మీద పడింది ఎర్రతోదేలు. వెంటనే అతను కిందపడిపోయాడు. ప్రమాదాన్ని గ్రహించిన స్టెల్లా అర సెకనుకూడా ఆలస్యం చెయ్యకుండా కత్తి అందుకుంది. జాన్సన్ పీకను నోరు తెరిచి అందుకోబోతున్న ఎర్రతోదేలు నడుంమీద బలంగా విసిరింది.

అంతే—అది సగానికి తెగిపోయింది.

స్ప్రింగ్ లా ఎగిరి నిలబడ్డాడు జాన్సన్.

లేస్తూనే, తుపాకితో, పరిగెత్తుకు వస్తున్న ఎర్ర తోదేళ్ళ గుంపుకేసి గురిచూసి కాల్చాడు జాన్సన్. పేల్చిన తుపాకిగుండు మరో ఎర్రతోదేలు మెడకింద భాగంలో దిగబడింది.

అక్కడికక్కడే కూలిపోయింది.

పైలట్ కకూడా తుపాకుల చప్పుడు వినగానే ఉత్సాహం కలిగింది. పైగా అవి గుంపుగా ఒక్కసారి వస్తూ వుండటంతో అంతగా గురిలేకపోయినా ఏదో ఒక దాన్ని పడగొట్టవచ్చునన్న ఆలోచన వచ్చింది.

లీల మాత్రం లోపల కూర్చుని భయంతో వణికి పోతోంది.

పైలట్ డోర్ దగ్గర నిలబడి ఎర్రతోడేళ్ళ గుంపు కేసి పేల్చాడు. అతని వూహ నిజమే అయ్యింది. గురి లేకుండా పేల్చిన తుపాకీగుండు పరుగుదీస్తున్న ఒక ఎర్రతోడేలు పొట్టలో దిగబడిపోయింది.

భయంకరంగా అరిచింది.

ఆ ఉత్సాహంతో మరోసారి పేల్చాడు తుపాకిని. ఈసారి గుండు మరో ఎర్రతోడేలును పడగొట్టింది.

ఇక మిగిలిన నాలుగు ఎర్రతోడేళ్లు భయపడి పారి పోలేదు. పౌరుషంగా ముందుకు దూసుకుని దగ్గరగా వచ్చేశాయి.

రంజిత్ రెండుసార్లు తుపాకి పేల్చాడు కాని ఒక్క గుండుకూడా ఎర్రతోడేళ్లకు తగల్లేదు.

బాగా దగ్గర వచ్చేశాయి ఎర్రతోడేళ్ళు. ఒక చేత్తో రివాల్వర్, మరో చేత్తో కత్తిని పట్టుకుంది స్టెల్లా.

ముందుకు వచ్చిన తోడేళ్ళలో ఒకటి ఎగిరి రంజిత్ మీద పడిపోయింది. ఆ విసురుకు అతను కిందపడి పోయాడు. చేతిలో వున్న తుపాకి దూరంగా పడింది.

మిగిలినవాళ్ళు ఎర్రతోడేళ్ళకు అందకుండా పక్కకు తప్పుకున్నారు.

భారత్ హెలికాప్టర్ వైపు పరుగుదీశాడు.

పెద్దగా భయంతో కేకపెట్టాడు రంజిత్.

ఎర్రతోడేలు గోళ్ళతో అతని పొట్టమీద గీరుతూ నోరు తెరిచి పళ్లతో అతని గుండెలను చీల్చబోతోంది.

(సశేషం)

